# గ్రంథాలయవ్యాసములు

## [ వ్యాసావళి ]

### నాల్గవ భాగము

సంకలనము
'కళాప్రపూర్ణ'
పాతూరి నాగభూషణం

సేవాశ్రమము, పెదపాలెము

# అంకితము

గ్రామ సీమలలో ఉన్నత పాఠశాలల వ్యాప్తికి పునాదులు వేసిన ధీమంతుడు, శ్రీ సర్వోత్తమ భవన ప్రవేశము గావించిన గ్రంథాలయోద్యమాభిమాని, స్వీయ ప్రజ్ఞచే ఎన్నో ఉన్నత పదవుల నలంకరించిన, అనేక ఘన కార్యములను సాధించిన ప్రతిభావంతుడు, నా ఉన్నత విద్యకు దోహదం చేసిన ఆత్మ బంధువునైన

కీ. శే. పాములపాటి వెంకట కృష్ణయ్య చౌదరిగారికి

# విజ్ఞాన మహోదధి

పుస్తక భాండాగారము
విజ్ఞానపు పారావారము
ఒక మంచి పుస్తకము
పదుగురు సన్మిత్రుల కెన
దేశదేశాల చరితలు
వివిధ కాలాల గాధలతో
పురాతన అధునాతన
నాగరికతలకు వారధి
విజ్ఞాన సుధారసపు మహోదధి
పుస్తక భాండాగారము
మానవజీవిత సర్వస్వము
బ్రతుకు నవరస భరితము
దానిదెల్ప పొత్తము లవసరము
ఈ పొత్తములు గ్రంధాలయపరము
నేస్తములారా! జ్ఞానాసక్తులారా!
రండు రండు రసాస్వాదనకు
సుధారసము సుహాసనమును
వలసినంత కోకొల్లగ
పంచిపెట్టు గ్రంధచయము
సంగీతం. సాహిత్యం - శాస్త్రం, కళ
పలు నాగరికతలతో నిండిన
దేశదేశాల చరితలు
బ్రతుకు బాటకు, జీవిత సార్థక్యానికి
తోడుపడే లౌకిక, మత రచనలు
గ్రంధాలయ మహార్ణవమున
కలవెన్నో చదువ రండు!

— 'నవ్యశ్రీ' గోపాలకృష్ణ పిళ్ళె

# కృతజ్ఞత

## ఈ గ్రంథమునందలి వ్యాసములు

౧, ౨, 3 'Library Movement by Diverse Hands' నుండి
ప్రకా. : Madras Library Association

౪, ౧౨, ౧౭ 'సరస్వతీ సామ్రాజ్యమ్' నుండి
(అయ్యంకి వెంకటరమణయ్యగారి సన్మాన గ్రంథము)

౫ 'ధర్మగ్రంథాలయ పత్రిక' నుండి
సంపా. : యాతగిరి లక్ష్మీవెంకటరమణ

౬ జ్ఞాన ప్రసాదినీ ప్రచురణలు : 10 నుండి
ప్రకాశకులు : మోటుకూరి జోగిరాజు

౭, ౮ ౨౩వ ఆం. దే. గ్రం. మహాసభ సంచికనుండి

౯ ౨౪ వ ఆం. దే. గ్రం. మహాసభ సంచికనుండి

౧౦, ౧౧, ౧౩, ౧౪, ౧౮, ౧౯ 'గ్రంథాలయ సర్వస్వము' నుండి

౧౫ ౨౫ వ ఆం. దే. గ్రం. మహాసభ సంచికనుండి

౧౬ ౨౭ వ ఆం. దే. గ్రం. మహాసభ సంచికనుండి

౨౦ ౨౬ వ ఆం. దే. గ్రం. మహాసభ సంచికనుండి
సేకరించబడినవి

- ప్రకాశకులు : ఆం. ప్ర. గ్రంథాలయ సంఘము

ఈ వ్యాసకర్తలలో అత్యధికులు దివంగతులు. వారందరికీ నా జోహార్లు. సజీవులగు వ్యాసకర్తలకు, గ్రంథరూపంలోను సంచికల ద్వారాను వీటిని ప్రచురించిన ప్రకాశకులకుల నా కృతజ్ఞతలు.

అనారోగ్యమునకు తోడు తీరికలేని పరిస్థితిలో కూడ నాకోరికను మన్నించి దీనికి మొగమాటను వ్రాసి యివ్వడమే కాక, గ్రంథావిష్కరణకుపహితం సమ్మతించిన ఆంధ్రసరస్వతి అనుంగు పుత్రులు, సాహితీవరులు, సుప్రసిద్ధ భాషాసేవకులు, విమర్శకులు, తెలుగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి గారి అంతేవాసులు, సిద్ధార్థ కాలేజి తెలుగుశాఖాధిపతులు నైన శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు గారి సౌజన్యం నాకు సంతసాన్ని కూర్చినది. వారికి నా ప్రత్యేక అభివందనములు తెలుపుకొను చున్నాను.

ఈ గ్రంథం వెలుగులోనికి వచ్చుటకు, దీనిని ముచ్చటగా తీర్చిదిద్దుటకు సహకరించిన సర్వోదయ ప్రెస్ కార్యకర్తలు, ప్రూఫులు దిద్దడంలో తోడుపడిన ఆర్. వి. యస్. శివరామకృష్ణల సహాయంకూడ మరువరానిది.

దీనితో పాటు మరికొన్ని నా ప్రచురణలను వెలువరించుటకు అనువుగా ప్రభుత్వం వారు తగ్గింపు ధరకు 1 టన్ను కాగితం యిప్పించారు. ఇది దైవికంగా జరిగిన సంఘటన. కనుక ప్రభుత్వానికి కృతజ్ఞతతో పాటు నన్ననుగ్రహించిన దైవానికి భక్తిపూర్వకమైన జేజేలు సమర్పిస్తున్నాను.

—సంకలనకర్త

# నివేదన

తెలుగులో గ్రంథాలయ సారస్వత సృష్టికి పునాదులువేసిన మహనీయులలో గ్రంథాలయోద్యమ జనకులు సర్వశ్రీ అయ్యంకి వెంకటరమణయ్య, సూరి వెంకటనరసింహశాస్త్రి, 'ధర్మ గ్రంథాలయ పత్రిక' సంపాదకులు శ్రీ యాతగిరి లక్ష్మీవెంకటరమణ, సుప్రసిద్ధ భాషా సేవకులు శ్రీ సురవరం ప్రతాపరెడ్డి ముఖ్యులు. గ్రంథాలయ నిర్వహణము క్రమముగ శాస్త్రస్థాయికి చేరుకొన్నతదుపరి ముందుగా వెలువడిన ప్రత్యేకగ్రంథము 'గ్రంథాలయశాస్త్ర ప్రథమపాఠములు' హైదరాబాదు లోని ఆంధ్ర సారస్వత పరిషత్‌వారు నిర్వహిస్తూవచ్చిన పరీక్షలలో గ్రంథాలయ శాస్త్రమునకు తాను కల్పించగోరుచు నేనుగావించిన అభ్యర్థనపై వారు దీనికి పాఠ్యగ్రంథములను సూచించమనగా పై పుస్తకములను వారిదృష్టికి తెచ్చినాను. మరొకగ్రంథం అవసరమని వారు తెలుపగా వివిధ గ్రంథాలయ సభలలో నేనుగావించిన ప్రసంగములను, పత్రికలలో అంతకుముందు అప్పుడప్పుడు వెలువడిన నావ్యాసములను వారికందజేసినాను. వీటిని వారే స్వయంగా పుస్తకరూపంలో 'గ్రంథాలయములు [వ్యాసావళి]' పేరుతో 1961 జూన్‌నెలలో ప్రచురించినారు. అంతర్జాతీయ పుస్తకసంవత్సరం 1972లో ఇది రెండవసారి సేవాశ్రమ గ్రంథమాల 9వ కుసుమముగా వెలువరింపబడినది ఇది గ్రంథాలయములు (వ్యాసావళి) మొదటిభాగము.

తదుపరి తయారైన నా రచనలు కొన్నింటిని దీని రెండవ భాగముగ చేర్చిపెట్టినాను. దీనిప్రచురణ 1981 అక్టోబరు నెలలో జరిగినది. సేవాశ్రమ గ్రంథమాలలో ఇది 12వ కుసుమము. దీనికిముందు నా అనువాదములను సంకలనంచేసి 1973 ఏప్రిల్ నెలలో పై గ్రంథమాల 11వ కుసుమముగా ప్రకటించడమైనది. దీనికిపిమ్మట సేవాశ్రమ గ్రంథమాల 13వ కుసుమముగా ఆంధ్ర విశ్వకళాపరిషత్ గ్రంథాలయ విభాగములో అధ్యాపకురాలైన శ్రీమతి కొత్తగడ్డ శారద, ఎం.ఏ., ఎం.ఎల్.ఎస్‌సి.గారి రచనలకు సంపాదకత్వము వహించిప్రచురించినాను ఈ పని 1981సంవత్సరాంతంలో జరిగినది. దీనికిముందు సిద్ధంచేసిన ప్రస్తుతగ్రంథం వెలువడుటకు సమయంపట్టినది. కేంద్రప్రభుత్వంవారు తగ్గింపుధరకు నాకందజేసిన కాగితంద్వారా యిది యిప్పుడు లోకం వెలుగు చూడడానికి అవకాశం లభించినది.

ఈ గ్రంథంలో నేను సంకలనం చేసిన రచనలలో అత్యధిక భాగం మన గ్రంథాలయోద్యమం వెనుకటికాలంలో వెలువడినవి. వీని రచయితలు సుప్రసిద్ధులు. కనుక వీరిసందేశాలు ఉద్యమవ్యాప్తికి చాల సాయపడినవి. తరువాత వెలువడిన గ్రంథాలయోద్యమ మహాంధులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి 1 ఆచూకీసేవ 2. పుస్తకంచదువుట: మదరాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయ విభాగపు అధిపతి ప్రొఫెసర్ పర్వతనేని గంగాధరరావుగారి 'పుస్తకముల ఎన్నిక : గ్రంథాలయాధికారి'; గుడివాడ శ్రీ అక్కినేని నాగేశ్వరరావు కళాశాల గ్రంథభాండాగారి శ్రీ జి. రాఘవేంద్రరావుగారి 'గ్రంథవరణం : విధులు - నిషేధాలు' అనే వ్యాసాలు గ్రంథాలయ నిర్వహణలో ఉపయోగపడే శాస్త్రోక్త విషయాలతో నిండియున్నవి. దీనికిపిమ్మట ప్రత్యేకం గ్రంథాలయ శాస్త్రమునకు సంబంధించిన రచనలతో యీ వరుసలో ఆరవభాగమును వెలువరించు ఆలోచనగలదు.

# అంకితము

నారచనలను, అనువాదములను, సంకలనములను, సంపాదకత్వము వహించిన గ్రంథములను గ్రంథాలయోద్యమంలో ప్రముఖపాత్ర వహించిన నాయకులకు, నాసేవాకార్యంలో వివిధ రీతుల సహకరించిన పెద్దలకు, గురువులకు. మిత్రులకు అంకితమిస్తూ వచ్చినాను. ఈగ్రంథాన్ని నా ఉన్నతవిద్యకు తోడ్పడుటయేగాక నాపట్ల సహజప్రేమను చూపిన నా ఆత్మబంధువు కీ. శే. పాములపాటి వెంకటకృష్ణయ్యగారికి అంకితమిచ్చుటకు నిర్ణయించుకొన్నాను. వీరు గుంటూరుజిల్లా నిడుబ్రోలు వాస్తవ్యులు. ప్రజాభిమానాన్ని అమితంగా చూరగొన్నభాగ్యశాలి. గుంటూరు జిల్లాలో విద్యావ్యాప్తికి తోడుపడిన మహనీయుడు. వీరి ఆధ్వర్యంలో నడచిన ఎడ్వర్డుహైస్కూలులో నేను నాలుగేండ్లు చదువుకొని స్కూల్ ఫైనల్ ప్యాసయినాను. ఒకసంవత్సరం వారియింట్లోనే ఉన్నాను. వీరు నన్ను మదరాసులోని లయోలాకళాశాలలో ఇంటర్మీడియెట్ తరగతిలో చేర్పించినారు. శ్రీ సర్వోత్తమభవన ప్రవేశం శ్రీ హరిసర్వోత్తమరావు గారి సూచనతో వీరితో జరిపించినాము. ఆ సందర్భమున భవనానికి అయాచితముగ రు. 500/- విరాళమిచ్చినారు. ఆంధ్రదేశకావ్యవర్గ సమా

వేశాన్ని వారియింటజరిపించి చక్కని ఆతిథ్యంతోపాటు, దీనికి హాజరైన సభ్యులందరికీ ప్రయాణఖర్చు ఇచ్చి గౌరవించినారు వీరు బాపట్ల తాలూకాబోర్డుకు, గుంటూరుజిల్లాబోర్డుకు అధ్యక్షులుగాను, గుంటూరు జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలుకు చైయిర్మన్‌గాను ఉండినారు. మదరాసురాష్ట్ర కౌన్సిలులోను, సెంట్రల్ ఎసెంబ్లీలోను సభ్యులుగా నుండినారు. గ్రామసీమలలో ఉన్నత పాఠశాలలను విరివిగా స్థాపించుటలో రాష్ట్రానికి మార్గదర్శకులైనారు. దిన, వార పత్రికలను నిర్వహించారు. మరెన్నో ఘనకార్యాలు సాధించారు. వీరిది సాహసోపేతమైన జీవితం. చలించని ఆత్మవిశ్వాసం, తలవంచు ఎరుగని స్వభావం. వీరికి నేనెంతో ఋణపడియున్నాను. ఈ విధంగా వీరిపట్ల నాకుగల కృతజ్ఞతను వెల్లడించుటకు అవకాశం కలిగినందుల కానందించుచున్నాను.

వాతూరి నాగభూషణం
సంకలనకర్త

# ముంగమాట

తెలుగు వారికి విజ్ఞాన భిక్ష పెట్టిన యుద్యమములలో గ్రంథాలయోద్యమము ప్రధానమేకాక ప్రథమము కూడ అయినట్టిది. భారత దేశము బానిసతనమునకు లొంగియున్న దినములలోనే ఈ యుద్యమము ప్రారంభమైనది. ఆ నాటి సర్కారు వారి ఆదరాభిమానములు శూన్యమైనప్పటికీ నిష్కామసేవా పరాయణులు, త్యాగమూర్తులునగు వ్యక్తులు కొందఱు ఈ యుద్యమమునకు మూల స్తంభములుగా నిలిచిరి. అభినివేశముతో, ఆవేశముతో అహోరాత్రములు పరిశ్రమించి గ్రంథాలయోద్యమమును బహుముఖములుగా విస్తరింపఁజేసిరి. దీనికి ఉదార హృదయులగు సంపన్నులు తోడ్పడిన మాట నిజమే. కాని యుద్యమ ప్రారంభ దినములలో సామాన్యముగా ఆవిర్భవించు అంతరాయముల నన్నిటిని అతిగమించి గ్రంథాలయోద్యమమును ప్రబల శక్తిమంతమైనదిగా రూపొందించుటకు పాటుపడినవారు వ్యక్తులే యనుట వాస్తవము. ఇప్పటి మాదిరిగా ఆనాడు ప్రయాణ సౌకర్యాలు లేవు. ప్రచార సాధనములు లేవు. అయినప్పటికి గ్రంథాలయోద్యమ నిర్వాహకులు వెనుకంజ వేయలేదు. విసుగు వేసటలు పొందలేదు. నిరాశపడలేదు. నీరసపడలేదు వీరి సేవాదృష్టి చైతన్యము చాలని ప్రజలను జాగృతులనుజేసినది. పల్లెపట్టులలో గ్రంథాలయములను పడుకొల్పినది విద్యావంతుల విజ్ఞాన తృష్ణను తీర్చినది. నిరక్షరాస్యులకు సైతము ప్రాపంచిక పరిజ్ఞానమును ప్రసాదించినది. గ్రంథాయోద్యమమే ఆంధ్ర సాంస్కృతిక పునరుజ్జీవనమునకు ఆలంబనమైనది. స్వప్రయోజనరహితముగా సాంఘిక సేవకు పూనుకొనని వారు, ప్రజాహిత కారియగు ఉద్యమములను వర్గవర్ణ భేదసులోచనములతో చూచువారు, ద్వితీయ పురుషార్థమునకే శక్తియుక్తులు వినియోగించు వారు ఆనాటి

గ్రంథాలయోద్యమ పరమార్థమును అప్పటికార్యకర్తల సేవా దీక్షా దక్షతలను గుర్తించుట అసాధ్యము.

భారతదేశమునఁగాని, ఆంధ్రదేశముఁగాని జాతీయోద్యమము, సాంఘిక సంస్కరణోద్యమము కొంచెము ముందు వెనుకలుగా ప్రారంభమైనప్పటికీ సమప్రాధాన్యమును సంతరించుకొని కొనసాగినవి. జాతీయోద్యమమునకు కొందఱు పట్టుఁగొమ్మలు కాఁగా, మఱికొందఱు సాంఘిక సంస్కరణోద్యమమునకు ఆధార దండము లైరి. జాతీయోద్యమము కంటె సాంఘిక సంస్కరణోద్యమము ప్రధానమైనదని భావించిన ప్రజ్ఞాలానాడు గలరు. జాతీయోద్యమ తత్త్వమును సాంఘిక సంస్కరణోద్యమ స్వభావమును దేశీయులు గ్రహించి ఆరెండింటికి యథాశక్తి తమ్ముతాము అర్పించు

నే నెఱిఁగినంతవఱకు వీరికంటె యోగ్యులు ఇతరులు కనబడరు. శ్రీ నాగభూషణము గ్రంథాలయోద్యమమున కలఁగి నలఁగి తలనరసినవారు. ఒకరి సత్తువ యుడిగిపోవుచున్నను, ప్రజల సహకార సానుభూతులు సన్నగిల్లుచున్నను, పూర్వవాసనలను వదలించుకొనలేక యింకను యథావిధి యీ రంగమున కృషి చేయుచున్నారు. తెలుఁగువారు వీరి సేవల నిదివఱకే లెస్సగా గుర్తించిరి. కావుననే యాంధ్ర విశ్వవిద్యాలయము వీరికి "కళాప్రపూర్ణ" పట్టప్రధానము చేసినది. ఈ పట్టప్రదానముతో పరితృప్తి పొందక తెలుఁగువారు, భోగము లనుభవించుటకుఁ గాక త్యాగము చేయుటకు అలవాటుపడిన తరమునకు చెందిన శ్రీ నాగభూషణమునకు ఇతోఽధికముగా తోడ్పడినచో, వీరింకను ఉత్తమ కార్యము లొనరింపఁగలరను విశ్వాసము నాకుఁగలదు.

ఈ సంపుటములో గ్రంథాలయము స్వరూప స్వభావములను, లక్ష్యములను, ఆదర్శములను వివరించు వ్యాసములున్నవి. వ్యక్తి విధులను నెల్లడించిన వ్యాసము లున్నవి. గ్రంథాలయాధికారి లక్షణము లెట్టివో, పుస్తకవర్గణమున అవలంబింపఁదగిన సదాచారము లెట్టివో, గ్రంథము లే విధముగా పాఠకులకు ప్రయోజనము కల్గించునో యుపదేశించిన వ్యాసములున్నవి గ్రామ చరిత్రకు, దేశచరిత్రకు గ్రంథాలయాధికారి యెట్లు ఆధారముల నార్జింపఁదగునో, చరిత్రరచనమునకు గ్రంథాలయము లెట్లు సాక్ష్యములను సమకూర్చునో స్పష్టపఱిచిన వ్యాసము లున్నవి. విదేశ గ్రంథాలయముల విలక్షణాలను, పాఠకులకు పరమప్రయోజనమును కల్గించుటకు ప్రపంచగ్రంథాలయము లవలంబింపఁదగిన పద్ధతులను పరిశీలించిన వ్యాసము లున్నవి. ఈ వ్యాసములు శ్రద్ధగాఁ జదివినచో గ్రంథాలయ పరమార్థము పాఠకులకు ప్రత్యక్ష మగును.

ఇవి యెప్పుడో వ్రాసిన వ్యాసములు. అయినప్పటికీ, వీనికి కాలదోషము పట్టలేదు. ప్రజాతంత్రమునకు వ్యక్తి పుట్టినిల్లు. అతఁడు స్వవిధులను సక్రమముగా నిర్వహించుటకు విజ్ఞాని కావలయును. విజ్ఞాని యయినచో వివేకి యగును. వ్యక్తులు వివేకులై విలసిల్లిన నాడు ప్రజాతంత్రము పరమ పదములను ప్రతిష్ఠించును. వారు అవివేకులై ఆగడములు చేసిననాఁడు ప్రళయములు ప్రభవించును. భారతజాతి యీ నాఁడు ఏతద్విముఖముగా ఏగుచున్న దనుట అందరకు అనుభవ సిద్ధమే. కాన యీనాఁడు గ్రంథాలయములనుండి ప్రజలు నేర్చుకోఁదగిన పాఠములెన్నియో యున్నవి. ఇతర ప్రచార సాధనము లెన్నియేర్పడినను గ్రంథాలయముల ప్రాముఖ్యమునకు భంగము కలుగనే కలగదు. కలుగనంత కాలము ఇట్టి వ్యాససంపుటములు వెలువడక తప్పదు.

వ్యక్తి యజమాన్యము నందలి దురాచారములను తొలఁగించి, సర్వజన సంక్షేమము ధ్యేయముగాఁగల ప్రజాత్వము ప్రతిరంగమున వారుపత్తెమును స్వీకరించుచున్న దినములివి. మఱి ప్రభుత్వము సైతము చిన్నచిన్న పట్టములు గడించి, యేదో యొకదారిని పదవులు పొందిన వ్యక్తుల సమూహమే కదా! ఆ వ్యక్తుల దివ్యాంశ సంభూతులు గారు. అరిషడ్వర్గమునకు ఆధీను లయిన వారే. కావుననే సమశీలము వలన, సమాభిరుచుల వలన, సఖ్య సంబంధముల వలన, ఉద్యోగప్రదానముపట్ల, పుస్తకవరణముపట్ల అనాచారములు అలముకొనుచున్నవని గ్రంథాలయ శాఖను గడ్డకీడ్చిన ఘట్టములు తెలుఁగు వారింకను మఱవలేదు. పాఠకులొకసారి యీ సంపుటమును ఎటునుండి చదివినను, అంతరాత్మను జోకొట్టిన చాతుర్యము లేనివారయినచో పాత్రులకు పదవులు

కట్టఁబెటి. యుత్తమ గ్రంథములను ఎన్నికచేసి విమర్శలకు ఎడముగా వ్యవహరింపఁగల రని వక్కాణింపవచ్చును.

పాలకులకు, పలితులకు ప్రయోజనకరముగా, నుండు వ్యాససంపుటమును ప్రకటించిన శ్రీ పాతూరి నాగభూషణమును ప్రశంసించి, తెలుఁగువారు దీనిని హార్దికముగా, ఆర్థికముగా ఆదరింతురని ఆశించుచున్నాను.

— నాగళ్ల గురుప్రసాదరావు
సిద్ధార్థ కళాశాల తెలుగుశాఖ అధిపతి

విజయవాడ
10_11_82

# విషయసూచిక

# స వ ర ణ లు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౩ | 18 | వెనజల్లు | వెదజల్లు |
| | 19 | స్థా | స్థాయీ |
| ౭ | 1 | వచ్చును. | పంపవచ్చును. |
| | 14 | అ గ్రేసరులకు | అగ్రేసరులకు |
| ౮ | 1 | పరతంత్రులను | పరతంత్రులును |
| | 16 | విషయము లును | విషయములును |
| ౧౨ | 11 | స్మరణీయులై | స్మరణీయులై |
| | 22 | వేత, | నేత, |
| ౧౩ | 7 | మూమున | మూలమున |
| | 20_21 | సంబంధముంతో | సంబంధములతో |
| ౧౪ | 16 | దాన క్తి | దాస క్తి |
| ౧౫ | 25 | గ్రంథపరనము | గ్రంథపరనము |
| ౧౬ | 8 | ప్రవంచ | ప్రపంచ |
| ౧౭ | 18 | విజ్ఞానము | విజ్ఞానమును |
| | 19_20 | మహార్పుల | మహార్షుల |
| ౨౦ | 24 | బొందెవని | బొందెనని |
| ౨౨ | 24_25 | మాతృకళకు | మాతృకలకు |
| | 25 | ఖీలము | ఖిలము |
| ౨౪ | 7 | శ ని | శక్తిని |
| | 9 | నీవిధముగా దేశాభ్యుచయ మునకు | నీవిధముగా దేశాభ్యుదయ మునకు |
| | 15 | ఉవేకవిధ | ఉనేకవిధ |
| | 23 | తరువాతికాలము | తరువాతికాలమున |
| | 25 | ముదరక | కుదరక |
| | 27 | ప్రాశ్చాత్యుల | పాశ్చాత్యుల |
| ౨౫ | 3 | విజానము | విజ్ఞానము |
| ౨౮ | 4 | సద్గ్రథం | సద్గ్రంథ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౩౦ | 3 | హరహర | హర |
| | 8 | ప్రభుతిభిః | ప్రభృతిభిః |
| | 17-18 | సంశయావి | సంశయాని |
| ౩౧ | 17 | తోడుబదేవారు | తోడుపదేవారు |
| | 27 | స్వప్నశాస్త్రిము | స్వప్నశాస్త్రము |
| ౩౨ | 16 | డొరుకుతున్నది | దొరుకుతున్నది |
| | 17 | ఏశాస్త్రమెన | ఏశాస్త్రమైన |
| ౩౩ | 5 | నిర్మించట మొ | నిర్మించట మొక |
| ౩౪ | 11 | స కూర్చు | సమకూర్చు |
| | 26 | చదివెవారు. | చదివేవారు. |
| ౩౫ | 18 | నిమిత్తమాత్ర | నేను నిమిత్తమాత్ర |
| ౩౬ | 25 | విహీసులుగానే | విహీనలు గానే |
| ౩౭ | 1 | భాగ్యశాలురకు | అదృష్టవంతులకు |
| ౩౮ | 11-12 | పూజాపురస్కారములు | ఆదరణ |
| | 23 | ప్రకాశ | ప్రకాశం |
| ౩౯ | 10 | కేనలము | కేవలము |
| | 12 | జీవితావపరములను | జీవితావసరములను |
| ౪౦ | 7 | కెంపెట్టు | కెంపెట్టు |
| | 11 | మొదలగు | మొదలగువానిని |
| | | కథలు | కథలరూపంలో |
| | 21 | వేకుండా | లేకుండా |
| ౪౩ | 21 | కాతీయత | జాతీయత |
| ౪౪ | 18 | వినవషుడు | వినినపుడు |
| ౪౬ | 9 | వున | కావున |
| ౪౮ | 5 | నిప్పుడు | నిప్పుడు |
| ౪౯ | 8 | నోచుచుండును. | దోచుచుండును. |
| | 20 | ఆశయ | ఆశయు |
| | 21 | మునవారిలో | మనవారిలో |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౪౧ | 8 | తిప్పదారుల | తప్పుదారుల |
| | 21 | కలుండవచ్చును. | ఉండవచ్చును. |
| ౪౨ | 12 } 16 } | నీతివంతులు | నీతిమంతులు |
| | 22 | వెలతులేే | వెలుతురే |
| ౪౩ | 5 | వృద్ధిజేసుకొనుటకు | వృద్ధిజేసికొనుటకు |
| ౪౪ | 1 | వేరువరచిన | వేరు పరచిన |
| | 4 | వావినెల్ల | వానినెల్ల |
| | 5 | దభికుచి | దభిరుచి |
| | 10 | క్షిణించి | క్షీణించి |
| | 14 | మా షులు | మానవులు |
| ౪౬ | 5 | ఆయన శ | ఆయనశక్తి |
| ౪౭ | ౨ | గాడిచర్ల | శ్రీ గాడిచర్ల |
| ౪౮ | 14 | అట్టివారి పెరు | అట్టివారిపేరు |
| ౬౨ | 24 | అగారాది సూచి | అకారాది సూచీ |
| ౬౪ | 9 | 'ఎక్సెక్లో పీడియా | 'ఎన్సైక్లో పీడియా |
| | 15 | ఒకొక్క | ఒక్కొక |
| ౬౬ | 2 | నమోదై నది | నమోదైనదీ |
| | 5 | బ్రిటానికొముకు | బ్రిటానికాకు |
| ౬౭ | 1 | రామశాస్త్రి | రాయశాస్త్రి |
| | 11 | పొందగలడనము | పొందగలడనడము |
| | 17 | స్ఫురించడముతోనే, | 'స్ఫురించడముతోనే |
| ౬౯ | 17 | గ్ర థాలేల? | గ్రంథాలేల ? |
| ౭౦ | 14 | సంబంధించి | సంబంధించిన |
| ౭౧ | 10 | గ్రంథాలయమను | గ్రంథాలయ |
| | 13 | పారకుల | పాఠకుల |
| | 17 | సంతోషమున | సంతోషమును |
| | 21 | మెక్కువగ | యెక్కువగ |

| పుట | పంకి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨౧ | 17 | యుండును. | యుండదు. |
| ౨౪ | 8 | తగినవినియు, | తగినవనియు |
| | 21 | వా కి | వారికి |
| ౨౫ | 1 | గ్రామస్తులు | గ్రామస్థులు |
| | 3 | మెరిగి | ఎరిగి |
| | 19 | పెరుగాంచిన | పేరుగాంచిన |
| ౨౭ | 9 | కావలిసి | కావలసి |
| ౩౦ | 27 | ఆలయాకారులు | ఆలయాధికారులు |
| ౩౧ | 10 | వెల్లడచేయు | వెల్లడిచేయు |
| ౩౪ | 7 | మెకంజీమాను మాను క్రిప్ట్స్ | మెకంజీ మాను మానుస్క్రిప్ట్స్ |
| ౩౪ | 12 | పరిమాణామము | పరిమాణము |
| | 20 | సమగ్రి | సామగ్రి |
| | 26 | మోడుకూరు, | మోదుకూరు, |
| ౩౩ | 16 | ఆదియే సందర్భములే | అది యేసందర్భములో |
| | 19 | నేడే యే | నే డే యే |
| ౩౫ | 9 | వాని పేర్లు | వారి పేర్లు |
| ౩౩ | 1 | ప్రపంచములలోని | ప్రపంచములోని |
| | 8 | అవస్యకతను | అవశ్యకతను |
| | 9 | చారితార్థులు | చరితార్థులు |
| ౪౭ | 20 | భావభివృద్ధి | భావ్యభివృద్ధి |
| ౭౦ | 12 | రాజుచేసి వారి నిర్బంధముగ | రాజుచేసి, వాని నిర్బంధముగ |
| ౭౧ | 4 | పారశాలలో | పారశాలలలో |
| | 20 | ఉపాద్యాయు | ఉపాధ్యాయు |
| ౭౨ | 2 | గ్రంథభాండాగారాధికారిని | గ్రంథభాండాగారిని |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౯౪ | 13 | విధానం | విధానము |
| ౯౬ | 5 | స్త్రీలకు, | స్త్రీలకు, శిశు |
| | 15 | సునిశిత | సునిశిత |
| ౯౭ | 13,14 | పెరిగిపోయిది. | పెరిగిపోయినది. |
| ౯౯ | 2 | పెద్దవాయిపోయి | పెద్దవారయిపోయి |
| ౧౦౩ | 17 | విషయా | విషయ |
| ౧౦౬ | 19-20 | ఆత్మసు త్తియు | ఆత్మస్తుతియు |
| ౧౦౯ | 15 | నట్లానర్పవలె. | నట్లానర్పవలె. |
| ౧౧౨ | 14 | నిషోన్మామిదమునకు | నిమిషోన్మాదమునకు |
| ౧౧౩ | 15 | గ్రంథాలయములను | గ్రంథాలయములకు |
| | 17-18 | గ్రంథాలయోద్యోగులను | గ్రంథాలయోద్యోగులు |
| | 21 | అధ్యక్షుడిట్లున్నాడు | అధ్యక్షుడిట్లన్నాడు : |
| ౧౧౪ | 12 | తక్కగును, | తక్కువగును, |
| ౧౧౬ | 20 | అమాసుషత్వ | అమానుషత్వ |
| | 25 | గ్రంధభాండాగారికి | గ్రంథభాండాగారి |
| ౧౧౭ | 5 | చేని | చేసి |
| | 15 | గుమాసాగా | గుమాస్తాగా |
| ౧౧౯ | 4 | ఆదర్శ హితము | ఆదర్శసహితమగు |
| ౧౨౦ | 6 | తానెటుల మించునో | తానెటుల ప్రేమించునో |
| ౧౨౩ | 15 | దొరకపోవచ్చు. | దొరకకపోవచ్చు. |
| ౧౨౬ | 1 | పెల్లుపెట్టటం | పేర్లుపెట్టటం |
| ౧౨౭ | 1 | అప్రమత్తతవల్ల | ప్రమత్తతవల్ల |
| ౧౨౯ | 12,13 | అప్రాణులకు | అప్రాణులకు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| ౧౨౯ | 25 | కలిగించ | రేకెత్తించ |
| ౧౩౧ | 28 | ప్రవర్తించి | ప్రవర్తించ |
| | | సాహవంతుడో | సాహసవంతుడో |
| | 22 | లేకుంటే, | లేకుంటేను, |
| | | తనవిద్యుక్త | తనవిధ్యుక్త |
| ౧౩౩ | 26 | చౌరపారు | చౌకపారు |
| ౧౩౪ | 6 | నవ్యకవులు | సవ్యకవుల |
| | 12 | యీ క్రింద | యీ క్రింది |
| | 16 | వనురులు | వనరులుగల |
| ౧౩౫ | 15 | కారణమిని | కారణమని |
| ౧౩౬ | 2 | ఎల్లిన్, | ఎల్లిస్, |
| ౧౩౭ | 4 | ప్రశక్తియే | ప్రసక్తియే |
| ౧౩౯ | 22 | గజెషేరున్నో, | గజెటీరున్నో, |
| ౧౪౦ | 11 | అవశ్యకము | ఆవశ్యకము |
| ౧౪౨ | 24 | స్ఫుర్తిస్తే | స్ఫురిస్తే |
| ౧౪౩ | 12 | ఎటెనా | ఎట్లయినా |

---

# ౧. గ్రంథాలయోద్యమము

గ్రంథాలయోద్యమమనసేమి? దీని స్వరూపస్వభావము లెట్టివి? దీనికి ప్రాప్యమెద్ది? వ్యాప్తి ఎంతవరకు? ఈ యుద్యమముతో ప్రత్యేక సంబంధములేని సామాన్య జనులకు గ్రంథాలయమనగా పుస్తకములను భద్రపరచి యచ్చటి కరుగు పాఠకులకు వాని జదువనిచ్చు స్థానమనియు, గ్రంథపాలకుడనగా పుస్తకముల కాపరియనియు నర్థమగును. ప్రాచీన గ్రంథాలయములును, ప్రస్తుతము మనదేశమున దొరతనము వారిచే నిర్వహింపబడుచున్న గ్రంథాలయములును అట్టివే. కాని యాధునిక నాగరికత యందు నభివృద్ధిగాంచిన గ్రంథాలయ మట్టిదిగాదు. అది "సర్వజనీన విశ్వవిద్యాలయము". జనసామాన్యము నందలి ప్రతివ్యక్తికిని దేశకాల పాత్రముల ననుసరించి జ్ఞానదాన మొనర్చునది ఆధునిక గ్రంథాలయము. ఇట్టి గ్రంథాలయము వలన లాభము నొందుటకు వానివద్ద కరిగి తీరవలసిన పనిలేదు. గ్రంథాలయమున కరుగలేని వాని కడకు గ్రంథాలయమే అరుగుచుండును. మరియు గ్రంథాలయము వలన కలిగెడు లాభము కేవల గ్రంథపఠనము వలన నలవడు బుద్ధివికాసము మాత్రమే కాదు. సంపూర్ణ మనుష్యత్వమును వికసింపచేయుటకు తగిన సాధనములనన్నిటి నవలంబించి, తత్సిద్ధికొరకు కృషి సల్పుట యంతయు గ్రంథాలయోద్యమ కార్యములో చేరినదే. కావున మరియొకచో నేను చెప్పినట్లు 'మనుజుని జీవితమును పవిత్రవంతముగను పురుషార్థ సాధనముగను చేయుటయే' గ్రంథాలయోద్యమము యొక్క ప్రాప్యమై యున్నది.

ఈ యుద్యమ పక్షమున జరుగు కార్యములను రెండు భాగములుగ విభజింపవచ్చును. 1. ఉద్యమ వ్యాపనము

2. ఉద్యమ నిర్మాణము. మొట్టమొదట యీ విషయములను గూర్చి పాశ్చాత్య దేశముల యందును, ఆదేశముల ననుసరించి ఉద్యమ ప్రచారణ చేయుచున్న బరోడా దేశమందును జరుగుచున్న కృషినిగూర్చి కొంత ముచ్చటించెదరు.

## ఉద్యమ వ్యాపనము

ఉద్యమవ్యాపన మనగా గ్రంథాలయములను దేశమంతటను స్థాపించుటకు తగిన ప్రోత్సాహమును జనులయందు పురిగొల్పుట, స్థాపించిన గ్రంథాలయముల ఉపయోగములను గూర్చి జన సామాన్యమునకు బోధించి వారలను అట్టి లాభమును పొందునట్లు చేయుటయు. నిరక్షరకుక్షులు కలికమునకైన దొరకని పాశ్చాత్యదేశముల యందు కూడ నీ యుద్యమ వ్యాపనమును గూర్చి జరిగెడు కృషి యనంతము. ఇందుకొరకై ప్రత్యేకసభలు, సమావేశములు చేయబడుచుండును. ప్రత్యేక సంఘము లేర్పడును. వార్తాపత్రికలయందు ఉద్యమ ప్రాశస్త్యమును గూర్చి అనేక వ్యాసములు ప్రచురింపబడుచుండును. ఒక్కొక్క గ్రంథాలయము యొక్క విశేషాంశములను సమర్థులగు లేఖకులు పత్రికలయందు వర్ణించుచుందురు. బడిపిల్లలు సెలవు దినములయందు విహారములకొరకు జట్లుగాచేరి వెడలునపుడు వారలతో గ్రంథాలయముల నుండి విద్వాంసులు పంపబడుచుందురు. ఈ విద్వాంసు లాపిల్లలకు పనికివచ్చు విషయములనుగూర్చియుపన్యసించి, అవి విపులముగా నేయే గ్రంథములయందు వివరింపబడియుండునో ఆ గ్రంథనామములను వారికి తెలిపి, అవి గ్రంథాలయమున దొరకునని ప్రోత్సాహము చేయుచుందురు. కూలివాండ్రు పనిచేయు కర్మాగారముల యెదుట గోడ బల్లలమీద వారల కుపయుక్తములగు గ్రంథములపేర్లను, అవి దొరకు గ్రంథాలయముల పేర్లను వ్రాతురు. గ్రంథాల

యములయందుండు ప్రత్యేకపు గదులను పేరు పొందిన క్లబ్బుల పరమునందుంచి ఆమూలమున ఆ క్లబ్బులలో చేరిన సభ్యులకు గ్రంధాలయముల యందు తీవ్రమగు అభిమానము కల్పింతురు.

## ఉద్యమ నిర్మాణము

గ్రంధాలయములు సామాన్యముగా రెండు తరగతులని చెప్పవచ్చును 1. స్థాయి గ్రంధాలయములు 2. సంచార గ్రంధాలయములు. సంచార గ్రంధాలయముల మూలమున స్థాయి గ్రంధాలయములు స్థాపించుటకు వీలులేని స్థలములయందు జనసామాన్యమున కుపయుక్తముగా నుండునట్లు ప్రత్యేకముగా తయారుచేయబడిన పెట్టెలలో పుస్తకములు పెట్టి, అనేక ప్రదేశములకంపి, గ్రంధములను చదువునట్లు చేయుచుందురు. బడిపిల్లల కుపయుక్తములగు గ్రంధములు ఉపాధ్యాయుల పరముగా ఇత్తురు. మరియు, ప్రత్యేక భాండాగారి యొకడు బీదలు నివసించు కుటీరములకు గ్రంధములను గొనిపోయి చదువగలవారికి పుస్తకముల నిచ్చియు, చదువలేనివారికి స్వయముగా చదివిచెప్పియు జ్ఞానతేజమును వెదజల్లుచుండును. ఇట్లే వైద్యశాలలకును పుస్తకములను బంపుచుందురు. స్థాయి గ్రంధాలయముల యందు 'లోకో భిన్న రుచిః' అను న్యాయానుసారముగా అందరకు వారివారి రుచుల కనుకూలమగు జ్ఞానోపార్జన సాధనములను కల్పింతురు. పిల్లలకు బొమ్మల పుస్తకములు చూపుదురు. సాంకేతిక శాస్త్రజ్ఞులకు తగిన గ్రంధములు వారల ఉపయోగము కొరకు సేకరింతురు. స్త్రీల కుపయుక్తములగు గ్రంధములు ప్రత్యేకముగా నుంతురు. ఉద్గ్రంధములు కావలసినవారల కవియు సిద్ధముగా నుంతురు. ప్రతివ్యక్తికి తగిన గ్రంధము నొకదానిని, ప్రతిగ్రంధమునకు తగినవ్యక్తి నొకరిని సమ

కూర్చుటకు తగిన ప్రయత్నములన్నియు గ్రంథాలయమున చేయుదురు. గ్రంథాలయములన్నియు సంపూర్ణముగా నుండుట అసంభవమును అనావశ్యమును కనుక ఏక ప్రాంతమందు గల గ్రంథాలయము లన్యోన్యాశ్రయములుగ జేయ బడుచుండును.

## కేంద్ర గ్రంథాలయము

ఇందుకు ముఖ్యసాధనము కేంద్ర గ్రంథాలయ ప్రతిష్ఠాపన. బరోడా రాష్ట్రమందు గ్రంథాలయోద్యమము వ్యాపించినది ఇట్టి సంస్థ మూలముననే. బరోడా గాయకువాడ్ గారు అమెరికా ఖండమందు వర్ధిల్లుచున్న పౌరగ్రంథాలయోద్యమమును విచక్షణాబుద్ధితో పరిశీలించినారు. అందుకు ఫలితముగ బార్డెను అను పండితుని అమెరికా నుండి రావించి ఆయన యాజమాన్యమున బరోడా కేంద్ర గ్రంథాలయమును స్థాపించిరి. ఇందు నానాశాఖ లున్నవి. ఒకటి స్థాయి గ్రంథాలయశాఖ. సామాన్య గ్రంథాలయములందు దొరకని అమూల్యగ్రంథము లిందుండును. రాష్ట్రమందున్న ఏగ్రంథాలయమమునకు సంబంధించిన వారైనను తాము కోరెడి అమూల్య గ్రంథము కొరకు కేంద్రగ్రంథాలయ సంస్థాధికారులకు దరఖాస్తుచేసి కావలసిన పుస్తకమును పొందవచ్చును. ఇచ్చటనుండియే సంచార గ్రంథాలయములు రాష్ట్రమంతకును పంపునది. మరియు మ్యాజిక్ లాంతరు మొదలగు యంత్రములు, చిత్రపటములు మున్నగు పరికరములను ఇందు సేకరించియుంతురు. జనసామాన్యమున కంతకు వానిని ప్రత్యేకోద్యోగిద్వారా రాష్ట్రమంతటకు పంపి ఆ మూలమున విద్యాభివృద్ధిని చేయుచుందురు. మరియు ఈ సంస్థ రాష్ట్రమందున్న అన్ని గ్రంథాలయములకు సహాయము చేయుచుండుటయేగాక వానినన్నిటిని అన్యోన్యాశ్రయములుగా చేయును

గ్రంథాలయముల మూలమున తగిన లాభము పొందవలె నన్న భరతఖండమందలి భాషా ప్రయుక్త భాగమునకొక్క టికి అధమము ఒక కేంద్ర గ్రంథాలయసంస్థయైన యుండ వలెను.

ఇక ఆంధ్ర గ్రంథాలయములందు ముందు కావలసిన అభివృద్ధికి మార్గము లేవియో వివరించవలసియున్నది.

ఇంతకాలము నుండియు ఆంధ్రదేశ మందంతటను గ్రంథాలయోద్యమమునుగూర్చి జరిగిన కృషికి ఫలితముగ బ్రిటీష్ ఇండియాయొక్క ఇతర ప్రాంతములకంటె ఎక్కువ గాఢముగా పౌర గ్రంథాలయములను గూర్చిన పరిజ్ఞానము ఈ దేశమున వ్యాప్తి నొందినదని చెప్పవలసి యున్నది. జరిగి నపని తక్కువ, జరుగవలసినపని ఎక్కువ. ఇట్టితరి ఆంధ్రులు తమ కర్తవ్యమును బాగుగా గుర్తెరిగి కార్యవిధానములను నిర్ణయించుకొనుటయు, దానిని కార్యాచరణలోనికి తెచ్చు టయు అత్యవసరము లేనిచో ఇదివరకు జరిగిన కృషియం తయు గూడ నిష్ప్రయోజన మగును.

ఇదివరకు మన దేశమున మారుమూలలగూడ గ్రంథా లయములు స్థాపింపబడియున్నవి. పౌరగ్రంథాలయముల విధులేమో, అచ్చట గ్రంథాలయములను నడుపువారలలో చాలమందికి తెలియును. వీనిలో అచ్చటచ్చట కొన్నిటికి స్వంత భవనములున్నవి. కొన్నిటియందు వేలకొలది గ్రం థములున్నవి. ఏకొద్దిసంఖ్యగల వానికైనను నిశ్చితమగు ఆదా యమున్నది. మన మునిసిపాలిటీలును, లోకలు బోర్డులును గ్రంథాలయ నిర్వహణము తమ విధియని గుర్తెరింగిరి. దీని నంతను యాధారపర్చుకొని మనము ముందంజ వేయవలసి యున్నది.

ముందు జరుగవలసిన కృషియేదో ప్రథమమున నిర్ణ యించుకొని, అటుపిమ్మట అందుకు సాధన విధానమును సూచించవలసి యున్నది.

గ్రంథాలయము యొక్క ప్రాణము చదువరులు. వారి సంఖ్య అభివృద్ధినొందుచు, వారల విజ్ఞానము విశాలమగు చుండినగాని ఆ సంస్థ శోభాయమానముగా నుండుటకు బదులు నిరుత్సాహకరముగా నుండును. కాన గ్రంథాల యాధికారులు ముఖ్యముగా చేయవలసిన విధి చదువరుల సంఖ్యను హెచ్చించుకొనుట. ఇందుకు అనేక మార్గము లున్నవి. వాని నన్వేషించి కార్యాచరణలోనికి తేవలసి యున్నది.

విద్యాగోష్ఠులు, పోటీపరీక్షలు, తాత్కాలిక పాఠ శాలలు, లిఖిత మాసపత్రికలు మున్నగు సాధనముల మూల మున గ్రంథాలయపు చదువరుల యందు అనేక విధముల జ్ఞానాభివృద్ధిని చేయవచ్చును.

విద్యాగోష్ఠులన నేమో మొదట విచారింతము. కొం దరు చదువరులు సారస్వత గ్రంథములు చదువుటయందు అభిరుచి కలవారుగా నుందురు. మరికొందరు వేరొక విష యమునం దభిరుచి కలిగియుందురు. ఇట్లు ఏక విషయమునందు పరిశ్రమ చేయగోరువారు ఒక గోష్ఠిగాచేరి ఏదోయొక గ్రం థమును గాని లేక ఒక విషయమును గూర్చి వేరువేరు గ్రంథములనుండిగాని సవిమర్శకముగా విద్యాపరిశ్రమ చేయ వచ్చును అందుకు ఫలితముగ ఒకసభ సమావేశపరిచి,అందు సమర్థులైనవారు వ్యాసములు చదువవచ్చును. ఇట్టి వ్యాసములను కొన్నిటిని చేర్చి వానినన్నిటినీ ఆ గ్రంథాల యము యొక్క లిఖితపత్రికలో ప్రకటించవచ్చును ఎక్కువ సమర్థతను చూపగల వ్యాసములేవైన యున్నచో 'భారతి'

మున్నగు పత్రికలకు ప్రకటనార్థము వచ్చును. ఈ విధముగా గ్రంథాలయమునకు నూతనమగు వికాసము వచ్చును. ప్రత్యేక వ్యక్తులు వైదుష్యము నందు ప్రసిద్ధిజెందుదురు. ఇట్టి ఫలము సిద్ధించినపుడే గ్రంథాలయములు సార్థకము లగును; భాష యభివృద్ధి జెందును. గ్రంథస్థమగు విషయములు విద్యావంతుల మూలమున ప్రజాసామాన్యమున కూడ వ్యాపించును.

పోటీపరీక్షలు మన యాంధ్రదేశమందు మిక్కిలి పరిపాటిలో నున్నవే. "విజ్ఞానచంద్రికా మండలి" వారును నర్సాపురపు సంఘమువారును, రాజమండ్రియందలి కొన్ని గ్రంథాలయముల పక్షమునను పోటీపరీక్షలు జరిగినవి. సారస్వత విషయములను గూర్చియు తదితర విషయములను గూర్చియు పరీక్షలు జరుపుటయు. అందు తీక్ష్ణులైన వారిలో ఆగ్రేసరులకు బహుమతులొసంగుటయు, ఆమూలమున విద్యాభివృద్ధి చేయుటయు జరుగుచుండెను. నర్సాపురపు సంఘము వారు ఇప్పటికివి నిరంతరము పరీక్షలు జరుపుచునే యున్నారు. తక్కిన సంఘములవారు జరుపుచున్నట్లు కనబడదు. తగిన సావకాశములుగల గ్రంథాలయములు ఇట్టి పోటీపరీక్షలను నెలకొల్పి చదువరులయందు విద్యాభిలాషను వృద్ధిపరచవచ్చును. కొందరు సామర్థ్యము గల విద్యాంసులు వారిలోనుండి బయలుదేరుదురు.

ఇక తాత్కాలిక పాఠశాలలను గురించి స్థలాంతరముల వివరించి యుండుటచే ఇచ్చట తిరిగి వ్రాయలేదు. వీనిని సాగించుటకు మనకున్న సాధనములను గూర్చియే ఇచ్చట వివరించబడును. కృష్ణా మండలము నొకదానిని మాదిరిగా తీసుకొనవచ్చును. ఈ జిల్లాయందు 13 హైస్కూళ్లున్నవి. మరియొక ఆరుదారు అసంపూర్తి హైస్కూళ్లున్నవి. వీని యన్నిటిలో యేనాలుగైదో తప్ప వన్నియు పల్లెటూళ్లయందే

యున్నవి. ఈపాఠశాలలయందు భాషాసేవా పరతంత్రులను దేశోద్ధరణకై బద్ధకంకణులు నెందరో యున్నారు. వీరిసహాయముతో ఆయా ప్రాంతముల యందున్న గ్రంథాలయ సంఘముల వారు తాత్కాలిక పాఠశాలలను స్థాపించవచ్చును. ఆ గ్రంథాలయముల మూలమున విద్యాభివృద్ధి నొందించుకొను వారిసంఖ్య హెచ్చు చేయవచ్చును.

వీని కన్నిటికంటె ముఖ్యమగు విధి మరియొకటి యున్నది. దానిని వెంటనే ఆంధ్రగ్రంథాలయములు కార్యాచరణలోనికి తేవలసినవైయున్నవి గ్రంథాలయపు వ్యవహారములు చక్కగ కట్టుదిట్టముల ననుసరించి జరుగుచుండినగాని తగిన చదువరు లచ్చటకు ఆకర్షింపబడరు అభివృద్ధికూడ జరుగదు. ఇందుకు ముఖ్యసాధనము తగిన తరిబీతు పొందిన గ్రంథభాండాగారిని నియమించుటయే. వీరిని తరిబీతు చేయుట సామాన్య విషయమై యున్నది. మనదేశపు స్థితిగతులనుబట్టి మనకు కావలసిన విషయములను బోధించుటకు ఆంధ్ర గ్రంథాలయ పక్షమున తాత్కాలిక పాఠశాలను స్థాపించవచ్చును. ఈ తరిబీతు బొందుటకు యువకు లాకర్షింపబడరేమోనని సందేహింపవలసిన పనిలేదు. ఉద్యోగమున కన్న వేరు శరణ్యము లేదనుకొనువారిలో కొందరికి ఈ మూలముగ కొంత మార్గ మేర్పడును. భాషాసేవయు, దేశసేవయు చేసి ధన్యతగాం దలచిన యువకులెందరో మనదేశమందున్నారు. కావున వీరందరును తరిబీతుపొంది గ్రంథాలయములయందు భాండాగారిక స్థానములయందుండి మన గ్రంథాలయములను తగిన కట్టుదిట్టముల ననుసరించి నడుపుదురు.

కావున మన గ్రంథాలయములు తమ విధులను తృప్తి కరముగా నిర్వర్తించి తన్మూలమున దేశాభ్యుదయము చేకూర్చవలెనన్న పైన వివరించిన విషయములను గమనించి వెంటనే కార్యాచరణలోనికి తెచ్చుట ముఖ్యావసరము.

గ్రంథాలయములు చేయు పనులేవో యింతవరకు వివరించబడినవి. ఇట్లు చేసినచో మన దేశమును చీకాకు పరచుచున్న సమస్యలను సమన్వయించుటకును, మన దేశ ప్రజలను సౌఖ్యవంతులుగాను, ధనవంతులుగాను చేయుటకును గ్రంథాలయములు ముఖ్యసాధనములు కాగలవని దృఢముగా చెప్పవచ్చును.

కావున భాషారాధన చేయువారును, దేశ సేవకులును దేశమందంతటను గ్రంథాలయములను స్థాపించుటకును, వానిని సమర్థతతో నిర్వహించుటకును మిక్కిలి ప్రార్థితులు.

# ౨. గ్రంథాలయోద్యమం

— ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్య

ప్రస్తుతము మనచరిత్రయందొక నూతన శక మారంభమైనదను మాట అందరూ ఎరిగినదే. అనేక కారణములచే పూర్వకాలపు ప్రతిభను గోల్పోయిన మనము ఆ ప్రతిభను తిరిగి సంపాదించుటకేగాక దానిని మరింత వృద్ధిచేసుకొనుటకు ప్రయత్నించుచున్నాము. పాశ్చాత్య నాగరికతతోడను, పాశ్చాత్య ప్రతిష్ఠాపనలతోడను మనకుగల సంబంధము హెచ్చగుటచే మన స్థితికిని ఇతరదేశములందుండు వారి స్థితికిని గల తారతమ్యము మనకు చక్కగ స్పష్టమైనది. ఐశ్వర్యమందును, సాంఘిక కట్టుబాటులందును, మతమందును, రాజకీయములందును - ఇది యది అననేల - అన్ని విషయములందును మనమెంతో వెనుకబడి యున్నారమని మనము తెలుసుకొనుచున్నాము. శోచనీయమగు నీస్థితినుండి దేశమును తప్పించి, ప్రజలకు సమస్త సౌఖ్యము లొసగూర్చుట కెన్నియో యుద్యమము లీకాలమున బయలుదేరి పనిచేయుచున్నవి. వాటిలో గ్రంథాలయోద్యమము మిక్కిలి ముఖ్యమైనదని నిస్సంశయముగ చెప్పవచ్చును. దేశాభివృద్ధిలో నీయుద్యమమేవిధముగా తోడ్పడగలదో విమర్శించిన యెడలనిప్పటికంటె వేగము నిది దేశమంతట వ్యాపించగలదు.

ఎట్టి యభివృద్ధిని పొందవలయునని నను జ్ఞాన మత్యంతావశ్యమై యున్నది. ప్రస్తుత పరిస్థితులు తెలుసుకొని, వాటిని తగు విధముగ మార్చుకొనవలసిన మార్గములను గ్రహించినగాని ఏ ప్రయత్నము కొనసాగనేరదు. దీని కంతటికి జ్ఞానము మూలము. కూపస్థమండూకములవలె కాలము

గడుపుచుండు మనవారిలో మనమిప్పు డనుభవించుచుండు స్థితికంటె ఉన్నత మైనది మరియొకటి కలదని తెలిసినవారి సంఖ్య చాల తక్కువ. అట్లు తెలిసిన వారిలోకూడ ఉన్నత స్థితిని సంపాదించుటకు వలయు మార్గములును పద్ధతులును కొన్ని కలవని యెరిగినవారి సంఖ్య మరింత తక్కువ. క్రొత్త మార్గముల నడువవలయునను ఉత్సాహము గలవారి సంఖ్య ఇంతకంటెను స్వల్పము. ఇదంతయుమారి, కావలసిన జ్ఞానము, ఉత్సాహము మనవారియందు కలుగవలయుననిన గ్రంథాలయ స్థాపనము చాల ముఖ్యము.

జ్ఞానమును సంపాదించుట కనేక మార్గము లున్నవి. స్వానుభవమువలన మన యొక్కొకరము కొంతజ్ఞానము సంపాదించుచున్నాము. ఇది మంచిది, ఇది చెడ్డది; దీనివలన కష్టము కలుగును, దీనివలన సుఖము కలుగును అను నిర్ణయమును ప్రతి మనుష్యుడును వాని యనుభవమునుబట్టి కొంత వరకు చేసుకొనుచున్నాడు. మరికొందరు పెద్దల సాంగత్యము చేత క్రొత్త విషయముల నేర్చుకొనుచున్నారు. విద్యాలయములందును తదితర ప్రదేశములందును పండితులు లోనగు వారి మూలమున ఉపదేశముబొంది, వారితో నెక్కువ మైత్రినిసంపాదించి అనేకులు జ్ఞానవంతు లగుచున్నారు. కాని ఈ రెండు మార్గముల వలనను సంపాదించదగిన జ్ఞానము చాల తక్కువ. ఇవి కష్టములతోడను, వ్యయ ప్రయాసలతోడను కూడుకొనియున్నవి. స్వానుభవము వలననే మనకు కావలసిన జ్ఞానమునంతను నేర్చుకొనదలచుట వ్యర్థమని కూడ చెప్పవచ్చును. అట్లే ప్రతి మనుష్యుడును ఇతరుల దగ్గరకు వెళ్ళి వారి నాశ్రయించి వారి మూలమున సమస్తమును నేర్చుకొనుట దుస్సాధ్యము. గ్రంథపరిచయమును సంపాదించినవా

రిట్టి కష్టములు లేకుండగనే తమ జ్ఞానము నత్యంతము వృద్ధి పరచుకొనగలిగి యుందురు.

ఉద్గ్రంథముయొక్క లక్షణమెట్టిది? అట్టి గ్రంథమును వ్రాసిన వాడు మహనీయుడని చెప్పదగియుండును. మహనీయులయొక్క అనుభవములను, ఊహాలను, ఉపదేశములను గుర్తెరుగులకు గ్రంథము ముఖ్య సాధనము. గ్రంథము వీటి కన్నిటికి గనివంటిది. గ్రంథముల మూలమున ఇట్టి మహనీయులతోడి సాంగత్యము మనకు కలుగుచున్నది. ఎన్నడో గతించినవారి యొక్కయు, ఎంతటి దూరదేశమందో యుండినవారి యొక్కయు యుపదేశములు గ్రంథస్థములై యున్న కారణముచేత వారెల్లప్పుడు మనకు స్మరణీయులై యున్నారు. వారి గ్రంథముల పఠించుట వారి సన్నిధిని యుండుటయే కదా? మహాభారతమును చక్కగ చదువగల వాడు నన్నయ తిక్కన ఎఱ్ఱనల సన్నిధి యందున్న వాడనియే చెప్పవచ్చును. మహామహులతోడి మైత్రివలన ఎట్టి విజ్ఞానము మనకు చేకూరగలదో అట్టి విజ్ఞానమే ఈ గ్రంథముల వలన మనకు లభించుచున్నది. ఇట్టి గ్రంథముల చదువుటకు వలయు నవకాశము కలిగియుండుటకంటె వేరొక వినోదము కావలయునా?

ప్రతి మనుష్యునికిని ప్రాపంచిక జ్ఞాన మెంతో అవశ్యము. కుటుంబ భరణమునకై ఒక్కొక్కడుఒక్కొక్కవృత్తి నవలంబించుచున్నాడు. వ్యవసాయము, నేత, వడ్రంగము, కమ్మరము, వ్యాపారము లోనగు వృత్తులవలన కోట్లకొలది జనులు జీవించుచున్నారు. ఈ వృత్తులను గురించిన శాస్త్రీయ జ్ఞానము రోజురోజునకు మార్పుచెందుచున్నది. పరిశోధనాభివృద్ధిచే వ్యవసాయ విధానమం దెన్నియో నూతన పద్ధతులు కనుగొనబడి యున్నవి. పుట్టెడు పండుచోట ఒకటిన్నర పుట్టి

పండించుటకు వలయు సదుపాయముల నవేకులు కనుగొని యున్నారు. తక్కిన వృత్తులందుకూడ లాభకరములగు నిట్టి నూతన మార్గముల నెన్నిటినో కనుగొనుచున్నారు. పండిన పంటల నెచట విక్రయించిన లాభమువచ్చునో, ఎట్టి విక్రయ పద్ధతు లాదాయకరములో తెలుపువా రనేకు లున్నారు, కనుగొనబడిన క్రొత్త క్రొత్త యుపాయము లన్నియు గ్రంథ ముల మూలమున ప్రచారములోనికి వచ్చుచున్నవి. మన దేశ మందు కూడ వ్యవసాయశాఖవారు, పారిశ్రామిక శాఖ వారు, సహకారశాఖవారు, తదితర ప్రభుత్వశాఖల వారం దరు వారు కనుగొనిన నూతన విషయములను గ్రంథములు, కరపత్రములు లోనగువాని మూలమున ప్రజలకు తెలియ పరచుచున్నారు. ఎక్కువ ధనమును సంపాదించి, ఎక్కువ సౌఖ్యము ననుభవించవలయుననిన, ఈ క్రొత్త విషయముల తెలియపరచు గ్రంథములను చదివి తీరవలెను.

ఇట్లే లోక వ్యవహారముకూడ నానాటికి మార్పు నొందుచున్నది. ఆ మార్పులయొక్క క్రమమును గుర్తెరిగిన గాని ప్రస్తుత స్థితిగతు లెట్లువచ్చెనో చెప్పుటకు వీలుండదు. ఈ క్రమమును తెలుపు వాఙ్మయమే దేశచరిత్రము. ప్రాచీనకాలపు సాంప్రదాయములు, కాలానుగుణముగ వాటి యందు గలిగిన మార్పులు మున్నగువాటిని పూర్వాపర సంబంధముంతో స్పష్టపరచుచు బోధించుశక్తి దేశచరిత్రమున కున్నది. జ్ఞానము సంపాదించగోరువారెల్లరు చరిత్రగ్రంథము లను చదువవలెను. రాజకీయవ్యవహారములందును, రాజ్యాంగ తత్త్వములందునుకూడ ఎన్నియో నూతన విషయము లాచరణలోనికి వచ్చుచున్నవి. ప్రజాప్రభుత్వము, వ్యక్తిస్వాతంత్ర్యము, సమష్టియనుభవము మున్నగు మాటలు విరివిగ

ప్రచారములోనికి వచ్చుచున్నవి. వీటియొక్క యథార్థ స్వరూపమును తెలుసుకొనుట మనకందరికె విధి. ఇట్టి జ్ఞానము కూడ గ్రంథముల మూలముననే సంపాదింపనగును.

ఎలాటి జ్ఞానము సంపాదింపవలెనన్నను గ్రంథములకంటె నుత్కృష్టములగు సాధనములు లేవను మాట స్పష్టమగుచున్నది. గ్రంథముల చదువగలవాడు వృత్తిని లాభకరముగ చేసికొనును, లౌక్యవ్యవహారముల జయప్రదముగ నడుపుకొనగలవాడగును; కాలమును గొప్పవారి సాన్నిధ్యమున గడుపగలుగును. ఇంతకంటె కావలసిన దేమున్నది? వివిధ గ్రంథముల నొకచోట జేర్చి ఎవరెవరి కెట్టి గ్రంథములు కావలెనో వారి కట్టి గ్రంథములు దొరుకుటకు వలయు నవకాశముల నేర్పరచు గ్రంథాలయములయొక్క ప్రయోజనమును గురించి వేరుగ జెప్పవలసినది లేదు.

గ్రంథాలయ మొకచోట నున్నయెడల దాని నుపయోగించుటకై అనేకులు వచ్చుచుందురు. గ్రంథపఠనమందాసక్తి లేనివారికి కూడ గ్రంథాలయమును దినదినము చూచుటచేత కొత్తగ గ్రంథముల చదువుటయందాసక్తి కలుగును. ఆసక్తి కలిగియు గ్రంథముల కొనుట కవకాశము లేనివారి కిప్పుడట్టి యవకాశము కలుగును. ప్రజలను జ్ఞానవంతులుగ చేయగోరి దానికితగిన మార్గము తెలియక నూరకుండు వారందరికి గ్రంథములమూలమున నిట్టి తెలివి కలుగును. నాయకులు, పరిశోధనమందారితేరిన శాస్త్రవేత్తలు, పండితులు-అందరికి గ్రంథాలయము లత్యంత ప్రయోజనకారులు. ఇతర దేశములందు నాయకులేమి చేయుచున్నారో తెలుసుకొనుట ప్రతినాయకునకు అత్యావశ్యము, శాస్త్రములందితర పండితులు ఎట్టి పరిశోధనను గావించుచున్నారో తెలిసికొనిన

గాని పరిశోధకు డెవడును తనపనిని చక్కగ చేయజాలి యుం డడు. అందరికిని గ్రంథాలయము లుపచరించగలిగియున్నవి.

మనదేశమందలి సామాన్యజనులు రెండు తెరగులుగ నున్నారు. కొందరికి అక్షరజ్ఞానము మాత్రము కలదు. అనే కుల కట్టి జ్ఞానము కూడ లేదు అక్షరజ్ఞానము కలవారిలో ననే కులకు గ్రంథపరిచయము చాల తక్కువ. ఈ కారణముచే కొంతకాల మగుసరికి వారికిగల అక్షరజ్ఞానముకూడ నదృశ్య మగుచున్నది. దీనివలన దేశమున కెంతో నష్టము సంభ వించుచున్నది. లక్షలకొలది ద్రవ్యము ఖర్చుపెట్టి ప్రారంభ పాఠశాలలు స్థాపించి పిల్లలకు చదువుటయు వ్రాయుటయు నేర్పుటకై ప్రభుత్వమువారు, ప్రజలు ప్రయత్నించు చున్నారు; కాని పాఠశాలల వదలిన తర్వాత గ్రంథములు చదువు అలవాటు మనవారికి విస్తారముగ లేకపోవుటవలన బాల్యమున నేర్చుకొనిన అక్షరములను తర్వాత కొంతకాలము నకు మరచిపోవుట సంభవించుచున్నది. గ్రంథాలయములను స్థాపించినయెడల ఇట్టి యవకాశమందరికి లభింపగలదు. కొద్దిగ విద్యను నేర్చుకొనినవారు తామునేర్చుకొనిన దానిని మరువ కుండుటయేగాక, క్రమక్రమముగ దానిని వృద్ధిజేసికొనుట యందు గ్రంథాలయములు తోడ్పడగలవు.

గ్రంథాలయములవలన నిజముగ దేశమందు జ్ఞానము వ్యాపించవలయుననిన గ్రంథముల నన్నిటిని ఒకచోట చేర్చుట మాత్రము చాలదు. ఆగ్రంథముల నుపయోగించు వారి సంఖ్యను వృద్ధిపరచుటకు కూడ తగిన ప్రయత్నములు జరుగవలెను. ఈప్రయత్నములు రెండు రకములుగ నున్నవి. గ్రంథపఠనము చేయగోరువారి యభిరుచులను కనుగొని తదనుగుణముగ గ్రంథములను చేర్చుచుండవలయును. ఒకే

విధమైన గ్రంథములను చదువుట కందరు ఇష్టపడరు. కొందరికి పురాణములు, కొందరికి నాటకములు, కొందరికి శాస్త్ర గ్రంథములు, కొందరికి లోకవ్యవహారమునకు సంబంధించిన గ్రంథములు ఇష్టము. దీనిని గుర్తెరిగి నానావిధములగు పుస్తకములను గ్రంథాలయముల చేర్చుటకు తగిన ప్రయత్నములు చేయవలెను. వార్తాపత్రికలు, మాసపత్రికలు లోనగునవి కూడ గ్రంథాలయములం దుండవలెను. ప్రస్తుతమున ప్రపంచ వ్యవహార మెట్లు జరుగుచున్నదో తెలుసుకొనగోరియే అనేకులు గ్రంథాలయములకు వచ్చుచుందురు. దానిని తెలుసుకొనుటకూడ ప్రతిపౌరునికి అవశ్యము. గ్రంథాలయములపై ప్రజల కభిమానము కుదురవలయునన్న ఇట్టి విధములగు గ్రంథములను చేర్చుట మరువకూడదు.

అక్షరజ్ఞానము లేనివారికి కూడ గ్రంథాలయమందు అభిమానము కలిగించుట అత్యావశ్యము. ప్రతి గ్రంథాలయము నొక పండితుని అధీనమం దుండవలయును. ముఖ్యముగ పల్లెయందలి గ్రంథాలయముల విషయములో నిది గమనింపదగియున్నది, ఆపండితుడు వార్తాపత్రికలను, పురాణములను చదివి గ్రామస్థులకు వాటి యర్థమును బోధించుచుండవలెను. అట్లే అప్పుడప్పుడు గ్రంథాలయము తరపున ఉపన్యాసములు నిప్పించుచుండవలెను. అట్లే గ్రంథాలయమున కనుబంధముగ నొక రాత్రిపాఠశాల యుండవలెను బాల్యము దాటిన వారెవరైన చదువు నేర్చుకొనగోరిన మొదల వారికి ఈపాఠశాల మూలమున విద్య నేర్పవలెను. ఈ పనులన్నియు చేసినయెడల క్రమక్రమమున గ్రంథాలయము నుపయోగించువారి సంఖ్య వృద్ధియగును. గ్రంథములను చేర్చిపెట్టుట మాత్రముచే తమకార్యము సాఫల్యతే

గా ం చి న ద ని గ్రంథాలయోద్యమాభిమాను లనుకొన
గూడదు.

విద్యకు అంతములేదు. పరిపూర్ణ పాండిత్యము నొక్క శాస్త్రమందు గడించుటకు కూడ నెవరికి సాధ్యము కాదు. పెక్కు శాస్త్రములలో నుత్తీర్ణుడగుట ఈకాలమందు దుస్సాధ్యము. విద్యావంతులని యనుకొనువారికికూడ గ్రంథాలయము లత్యంతావశ్యములు. ఈ యుద్యమమునకు తోడ్పడి ప్రతిగ్రామమందు గ్రంథాలయముల స్థాపించుటకై ఎల్లరు పాటుపడవలయును. ప్రజలయందు నవీన విజ్ఞానము వ్యాపించుట కింతకంటె నుత్తమమగు మార్గము వేరొకటి లేదు.

# 3. గ్రంథాలయోద్యమము - విద్యాప్రచారము

— శ్రీ కోరాడ రామకృష్ణయ్య

గ్రంథాలయోద్యమ మనునది యీ కాలపు టనేక విధములగు సాంఘిక రాజకీయోద్యమములవలెనే యాధునిక యుగచిహ్నముగా గనబడుచున్నది. కార్మికోద్యమము, సహకారోద్యమము, అస్పృశ్యతా నివారణోద్యమము, మొదలగున వీకాలమున రాజకీయ, సాంఘిక విషయములం దెట్లు ప్రాధాన్యమును వహించుచున్నవో, అట్లే విద్యా విషయమున గ్రంథాలయోద్యమము కూడ ప్రాధాన్యమును వహించుచున్నది. విదేశీయ ప్రభుత్వము, ప్రజాస్వామ్యత్వభావము ప్రబలుచున్న యీ కాలమున మనదేశమున విద్య కూడ రాజకీయ సంబంధము కలదే యగుటయు, ప్రతి వ్యక్తియు పరిపాలనా విధానమున పాల్గొని యద్దాని గడపవలసియుండుటచే, రాజకీయవిద్య సార్వజనీనం బగుట యావశ్యకం బగుటయు తటస్థించినది. ఐహిక ప్రభుత్వవిషయమున ప్రజాస్వామ్యత్వభావ మాదరింపబడుచున్నట్లే, యాధ్యాత్మిక తత్త్వ విషయమున బాహ్యప్రకృతి పరిశీలనము, తద్విజయము పరమావధిగా గ్రహింపబడుచున్నవి. మొత్తము మీద జనుల విజయదృష్టి బాహ్యవృత్తులపై బ్రసరించినట్లు అంతరంగిక వృత్తులపై బ్రసరించుచున్నట్లగపడదు. చతుర్విధ పురుషార్థములలో నర్థకామములు బలవంతములై తమ యధి

కారము నవ్యాహతముగ నెరపుచు నొకదాని నొకటి మీఱ దమలోతాము స్పర్ధించుచున్నవున్నవి. ఇట్టిది ప్రజాస్వామ్యత్వ ఘానముచే నడుపబడుచుండు నార్థిక యుగమగుటచే ప్రతి యుద్యమము నద్ధిసహాయమున సంఘముచే నడుపబడవలసి యున్నది. కావుననే 'సంఘేశక్తిః కలౌయుగే' అనుమాట సార్థత్వమును బొందుచున్నది. ఇట్టికాలస్థితి కనుగుణముగ విద్యాదానము, జనసామాన్యమున విద్యావ్యాపనము సంఘముచేతనే నడుపబడవలసి యుండుటచే, తత్కార్య సాధనకు గ్రంథాలయోద్యమ మత్యంతావశ్యకమై నెగడుచున్నది.

విద్యావిషయమున ప్రాచీనకాలపు స్థితికిని ఆధునిక స్థితిగతులకును విశేషభేద మగపడుచుండుటచే, గాలప్రవాహమున బడిపోవుచు, చేతికి దొరికిన సాధనముల బ్రయోగించుచు నీకార్యసాధనకై యత్నింపవలసినదేగాని వానిని బోల్చిచూచుటవలన లాభమును విశేష మగపడదు. ప్రాచీన స్థితిగతులు మారినవి. అవి ఇప్పుడు రావు. మనము వెనుకకు పోలేము. కావున వానిని గూర్చి తలపోయనేలయని విసుగుకొనువారు కూడ కలరు. కాని ప్రాచీన హైందవ నాగరకతయు విజ్ఞానము అనన్య సామాన్యములని మాత్రం సర్వజనాంగీకారమును బడసియున్నవిగదా. అవి ప్రాచీన మహాత్ముల యతీంద్రియ జ్ఞానశక్తులచే పెంపొందింపబడినవని తలచువారు పలువురు కలరు. అతీంద్రియ జ్ఞానశక్తులయందపనమ్మకము కలవారు ప్రత్యక్షమునే పరమ ప్రమాణముగా గ్రహించి, ఆధునిక ప్రకృతిశాస్త్ర విజ్ఞానము నాగరకత ముందు ప్రాచీన విజ్ఞాననాగరకతలకు స్థానము లేదనియు, నవి కల్పితగాథలతో గూడినవిగాని సత్యసమ్మతములు గావనియు దలంచువారు మఱికొందఱు కలరు. కాని యిటీవలికాలమున

జె. సి. బోసు, ఆలివర్ లాడ్జి, మొదలగువారు ప్రకృతిశాస్త్ర మునందును మానసికశాస్త్రము నందును సలుపుచుండెడి పరిశోధనల ఫలితములు, ప్రాచీనమహర్షులు సాధనాంతరము లచే సాధించిన విజ్ఞానాంశములనే పునరుద్ధరించుచున్నట్లున్నవి చూడుడు.

చేతనంబులవోలె నచేతనముల
జీవకళజూపి బ్రహ్మాండ సృష్టియెల్ల
పరమ పురుషుని ప్రతిబింబ బావమగుట
జూటుచుండడె జగదీశచంద్ర బోసు.

ఇట్లీతడు "ఈశావాస్యమిదం సర్వం" అను ప్రాచీన మహర్షుల యుపనిషద్వాక్యార్థమునే ప్రత్యక్ష ప్రమాణ సిద్ధముగా జేయుచున్నట్లున్నాడు. అంతరింద్రియం బొక మహాసముద్రము వంటిదనియు, సాధనచే తెలిసిన కొలం దియు నత్యద్భుతములు ననంతములు నగు శక్తులు దీనినుండి బయలుదేరగలవనియు, మానసిక శాస్త్ర పరిశోధకుండగు అలివర్ లాడ్జి అనునాతడొక యుపన్యాసమున ప్రకృతిశాస్త్ర జ్ఞుల సభలో పలికి యున్నాడు. బ్రహ్మాండమునందెట్టి యత్యద్భుత నిర్మాణ చాతుర్యము వ్యక్తమగుచున్నదో అట్టి నిర్మాణకౌశల మంతయు పరమాణువుకంటె గూడ పరమాణువుగా నిటీవల గ్రహింపబడిన 'ఎలక్ట్రాన్'లు అనబడు సూక్ష్మాతిసూక్ష్మంబులగు పదార్థాంశములు కూడ శక్తిస్వరూప ములేయని యాధునిక ప్రకృతి శాస్త్రము చెప్పుచుండుటచే, నిది శక్తిస్వరూపుడేయగు భగవంతుడు, ఇచ్ఛామాత్రంబగు సంకల్ప శక్తిచేతనే జగత్స్వరూపమును బొందెనని తెల్పెడు శ్రుతివాక్యములను వ్యాఖ్యానము చేయుచున్నదివలె నున్నది. కావున ప్రాచీనార్య విజ్ఞానము నాధునిక ప్రకృతి శాస్త్రజ్ఞాన

ముతో మేళవించి, యద్దానిని జనసామాన్యమునకు బోధ పఱచినచో నది విశేషలాభకారి కాగలదు.

స్వీయాభివృద్ధి కనువగు నంతవఱకు పాశ్చాత్య విజ్ఞానము నలవఱచుకొని యుపయోగించుకొనుట యావశ్యకమే యైనను, ప్రస్తుత మీదేశము యొక్క యార్థిక స్థితిని బాగు పఱచుటకుగా యంత్ర సహాయమున వస్తునిర్మాణము చేయు పద్ధతికంటె, చేతిపనుల నభివృద్ధి పఱచుట లాభకరమనియు, ఆధునిక రాజకీయ సంస్థలకంటె, ప్రాచీన గ్రామ సంస్థలే యీ దేశమునకు దగినవగుటచే, గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమము కొనసాగించుటయే యవశ్యకర్తవ్య మనియు దలంపబడు చున్నది గావున, విద్యావిషయమునగూడ, ప్రాచీన హైందవ విద్యాపద్ధతుల నాధునిక స్థితిగతులకు తగిన రీతిని పునరుజ్జీవింపజేయుట దేశ క్షేమమునకు దోడ్పడగల దను విషయమునుగూడ మనము గుర్తింప వలసియున్నది.

విద్యయొక్క ఆదర్శప్రయోజనముల విషయములోనే ప్రాచీనకాలమునకు నిప్పటికి విశేషభేద మున్నది. ఆ దృష్టి పథము కొంతవరకైనను మారినగాని ప్రాచీనపద్ధతుల యుత్కృష్టతను మనము గ్రహించలేము. ప్రాచీనకాలమున నీదేశమున విద్యకు పరమార్థజ్ఞాన సంపాదనమే ప్రధానఫలంబుగ దలంపబడినట్లు కనబడుచున్నది. బ్రహ్మచర్య, గురుశుశ్రూష, గురుకులవాసములే ప్రధాన సాధనములుగ నుండెడివి. బాహ్యప్రకృతిని స్వాధీనపఱచుకొని, మానవకోటి వాంఛ సంతర్పణంబున కుపయోగపడునట్లు చేసికొనుటకంటె ఆంతరంగిక శక్తుల నింద్రియ నిగ్రహము మూలముగా వికసింపజేసికొని, అతీంద్రియ జ్ఞాన సంపాదనమునం దత్యంత శ్రద్ధ వహించుటయే యవశ్యకర్తవ్యముగా నెంచబడినది.

జనసామాన్యమున వృత్తివిద్యలు ప్రబలి కులక్రమాగతములై యుండుటచే వీరు విద్యకై యొక కోటికి బోవలసిన యావశ్యకతగాని, జీవనోపాధికై తాపత్రయ పడవలసిన యావశ్యకత గాని కలిగెడిదికాదు. ఈ కారణముచే నాకాలమున నిరుద్యోగ సమస్యయే లేదు. ఇది యాధునిక యుగచిహ్నమే. విద్య జీవనోపాధికి సాధనముగా గ్రహింపబడెడిదికాదు. ఎంత సత్వరముగ పరీక్షయందు కృతార్థతను బొంది ధనసంపాదనోద్యోగమున బ్రవృత్తుడగునో అంత ధన్యుడని తలంపబడు రోజు లవికావు. వీనివాంఛలు స్వల్పములగుటచే వీడద్దానికి లక్ష్యపెట్టెడువాడును గాడు. విద్యార్థులు గురుకులవాసము చేయుటకు, గురువు లాయా విద్యార్థుల మేధాసంపత్తికి దగిన రీతిని విద్యాదానము చేయుచుండుటయు సంభవించెడిది. ఆవిద్య గ్రంథములనుండి గ్రహింపబడినదికాక గురుముఖముననుండి గ్రహింపబడి విద్యార్థుల మనోఫలకములందే ముద్రితమై యుండెడిది. విద్యాభ్యాసకాలము చిత్తప్రశాంతిని ఏకాగ్రతను పెంపొందించు బ్రాహ్మముహూర్తకాలము (తెల్లవారుజాము). ఆవిద్య ధనసంపాదన కొరకునుగూడ కాక, ఆశ్రమధర్మరక్షణము మూలముగా, ధర్మానుచరణము మూలముగా, నాత్మజ్ఞాన సాధనకొరకే వినియోగపడుచుండెడిది. బౌద్ధయుగమున ప్రతివ్యక్తియు మోక్షజ్ఞానమున కర్హుడను భావము వ్యాపించుటంజేసి, జనసామాన్యమునందు విద్యావ్యాపనము చేయవలయునను నుద్యమము, దానికై గ్రంథరచన అనునది యీ యుగముననే ప్రారంభించినట్లగపడుచున్నది కాలక్రమమున గ్రంథరచన పెరిగినది. మాతృకళకు ప్రతికలను వ్రాయించి గ్రంథములు శిథిలముకాకుండ గాపాడుట యొక పవిత్రధర్మముగా నెంచి రాజులు, మహారాజులు నావ్రాతను ప్రోత్సహింప దొడంగిరి. వారి యాస్థాన

ముల నిట్టి గ్రంథసమితి పెరుగుటచే నచ్చట గ్రంథాలయము లేర్పడుచు వచ్చినవి. తంజావూరు నందలి సరస్వతీభాండా రము మొదలగు గ్రంథాలయములే యిందుకు దార్కా-ణము. ప్రతివిద్యార్థియు దాను చదువు గ్రంథములను వ్రాసి కొని చదువుచుండుటచే నందలి విషయమంతయు మనో గతంబగుటయేగాక లిఖితగ్రంథములును పెరుగుచు వచ్చినవి. కాని యిటీవలి కాలమున ముద్రణాసౌకర్యములు కలుగుటచే గ్రంథములను మనోగతము చేసికొనవలసిన యావశ్యకత తగ్గి పోయినట్లే, గ్రంథములు సులభ్యంబులగుటచే, విద్యాసంపా దనకు గురువుయొక్క యావశ్యకతయు తగ్గిపోయినది. ఈ దేశమున పాశ్చాత్య ప్రభుత్వము నెలకొనినకొలది, విద్య కుద్యోగాధికారసంపాదనము, తన్మూలమున ధనార్జనముచే పరమలక్ష్యంబులు కాజొచ్చినవి. ప్రాచీనకాలమున జన సామాన్యమంతయు కులక్రమాగతములగు తమతమ వృత్తి విద్యలను విడిచి యుద్యోగాధికార సంపాదనలోలురై యితర విద్యల నభ్యసించుట కేపట్టణములందో గుమిగూడెడువారు కారు. ప్రస్తుత మీయార్థిక యుగము యంత్రబలముపై నాధారపడిన దగుటచే వృత్తివిద్యలు క్షీణింపజొచ్చినవి. ఇం తకుపూర్వము వృత్తులచే స్వతంత్రముగ జీవయాత్ర నడుపు చున్న జనమంతయు కూలిపనికి దిగవలసి వచ్చినది, లేదా రాజకీయవిద్య నభ్యసించి యుద్యోగాధికార వ్యామోహ ముచే సేవకావృత్తినే మరియొక విధముగా నవలంబింపవలసిన వారైరి. ఇట్లు యంత్రములకు దాసులు కొందరు, విదేశీయ ప్రభుత్వ యంత్రమునకు దాసులు కొందరు, పాశ్చాత్య నాగ రకతా భావమునకు దాసులు కొందరు నగుటచే నీదేశమున దాస్యము, భావదాస్యము నొండొంటికి సహాయంబై జను లను పీడించుచున్నవి.

ఆర్థిక వాతావరణం బిట్టిదైయుండ, పాశ్చాత్య సంసర్గముచే. రాజకీయ విషయమున ప్రజాస్వామికత్వ భావములు గూడ వ్యాపించినవి. ప్రజాస్వామికము ప్రభుత్వమైనతోడనే ప్రజాసామాన్యమునకు రాజకీయ విషయజ్ఞాన మావశ్యకం బగుచున్నది. ప్రతివ్యక్తియు దేశముయొక్క స్థితిగతులను దెలిసికొని, దేశాభ్యుదయమునకు దోడ్పడగల పౌరుడై, తన యెన్నిక శక్తిని సవ్యముగా వినియోగింపగలవాడై యుండ వలసిన యావశ్యకతయు గలుగుచున్నది. ప్రతి వ్యక్తియు నీవిధముగా దేశాభ్యుదయమునకు దోడ్పడగల పౌరునిగా జేయుటయే యాధునిక విద్యావిధానము యొక్క పరమ లక్ష్యము. ఇట్టి మహోద్యమమునకు కాలానుగుణముగ యంత్రసహాయమున ముద్రితమగుచున్న గ్రంథసమితి విశేషోపకారంబగు ననుటలో సందేహము లేదు. జన సామాన్యమున విద్యను వ్యాపింపజేయుటకేగాక విద్యార్థియగువాడనేకవిధ విషయజ్ఞానమును సులభముగ సంపాదించుకొనుటకు బూర్వము వృత్తివిద్యల నభ్యసించినవా డిప్పుడు యంత్రములకు దాసుడైనట్లే యింతకాలమునుండి గురువునొద్ద విద్యనభ్యసించి జ్ఞానసంపాదనము చేసినవా డిప్పుడు ముద్రిత గ్రంథములకు దాసుడై, స్వీయ ప్రవర్తనను విశేషముగా దిద్దజాలని వివిధ విషయజ్ఞానమును మాత్రము విశేషముగా సంపాదింపగలుగుచున్నాడు. ధర్మమార్గప్రవర్తకుడగు గురుని యొద్ద సక్రమశిక్షణము లేక, సాధనకు మొదటినుండియు నలవాటు పడకుండుటచే, తరువాతికాలము గ్రంథముల మూలమున సంపాదించిన జ్ఞానమునకును చిన్ననాటినుండియు నలవడిన ప్రవర్తనాపద్ధతికిని సంబంధము నుదరక తీర్థమునకు దీర్థము, ప్రసాదమునకు ప్రసాదము నన్నట్లగుచున్నది. ఆ ప్రాశ్చాత్యుల విజ్ఞానము, ముఖ్యముగా వారు సాధించిన

ప్రకృతిశాస్త్రజ్ఞానము, జనసామాన్యమున వ్యాపించి దేశీయుల జీవితముల శుభప్రదముగ జేయుటకు దగిన యవకాశమును కలుగజేయుట లేదు. ప్రాచీన మహర్షుల విజ్ఞానము, అప్పటి సాంఘికనియమములు, అంతరంగిక సాధనలు, శక్తులు కాల క్రమమున క్షీణించి గతించినవి. ఆధునిక ప్రకృతిశాస్త్ర సాధనకు, ఆర్యమహర్షుల విజ్ఞానసాధనకు ప్రాప్యం బొక్కటియే యైనను మార్గములు భిన్నములుగా నున్నవి. కాని ప్రస్తుత మీ దేశమున నొకటి క్షీణించిపోవుట, రెండవది లభింపకుండుటయు తటస్థించుటచే దేశస్థితి యుభయభ్రష్టమై నట్లున్నది. కావున నాధునిక ప్రకృతిశాస్త్ర విజ్ఞానమునకును ప్రాచీనార్య మహర్షుల వైదికోపనిషద్విజ్ఞానమునకును సమన్వయము చూపుచు, నాధునిక ప్రకృతిశాస్త్ర జ్ఞానమును దేశమున వ్యాపింపజేయు గ్రంథ సముదాయమును బయలు దేర దీసి, జనసామాన్యముయొక్క మనోనేత్ర మధ్యమునందు కంటె ధర్మమునందు సంలగ్నంబగునట్లు చేయు మార్గముల నన్వేషించి కృషి సలుప గలిగినచో నీగ్రంథాలయోద్యమము తప్పక దేశకల్యాణంబునకు దోడ్పడగలిగి యుండును.

సామాన్యముగా నిపుడు గ్రామాదులలో బయలు దేరియున్న గ్రంథాలయము లన్నియు చాలవరకు నవలలు. నాటకములు, కథలు మొదలగువానితో నిండిపోవుచున్నవి. ఆగ్రామములందు చదువు వారికికూడ నిట్టివానియందే యభిలాష మెండుగా నుండును. జనసామాన్యమున చదువుటకు తీరికగలవారుగాని, అభిలాషగలవారుగాని, చదువ గలిగినవారుగాని చాలతక్కువగనే యుందురు. ప్రాథమిక విద్య

నభ్యసించినంత మాత్రమున పల్లెటూరిజనులు గ్రంథపఠనమునం దాసక్తి కలవా రగుదురని మనము తలంచుట కవకాశము లేదు. అట్టివారికి గ్రంథపఠనమునం దాసక్తి కలుగజేయవలసి యున్నది. గ్రంథపఠనాసక్తి కలవారికైనను విజ్ఞానాభివృద్ధికరములగు గ్రంథములను లభింపజేసి, వానిని జేపట్టి చదువుటలో జనులకు రుచి పుట్టింపగలిగిన మార్గముల నన్వేషించు భార మీ గ్రంథాలయోద్యమ ప్రచారకులపై నున్నది.

గ్రంథాలయములం దేవో కొన్ని యుత్తమ గ్రంథములున్నంతమాత్రమునగూడ ప్రయోజన ముండదు. ఆగ్రంథములు చిరకాలము తెరువబడకనే యుండుటయు సంభవించుచుండును. ప్రాచీనకాలమునందు జనులకుగల పురాణపఠనశ్రవణాదుల యందుగల శ్రద్ధకూడ నీకాలమున నడుగంటినది. ధనికులకు ధనాభివృద్ధి మార్గముల నన్వేషించుట యందును, బీదలకు జీవనోపాధి మార్గముల నన్వేషించుకొనుట యందును కాలము సరిపోవుచున్నది. పరమార్థచింతకు, సత్కాలక్షేపమునకు, జ్ఞాన సంపాదనకు కాలము దొరకుట దుర్లభమగుచున్నది. పట్టణములోని విహారస్థలములందో, క్లబ్బులయందో పలువురు కూడినపుడే రాజకీయ విషయముల గూర్చియో, యేపరమార్థ విషయముల గూర్చియో చర్చలైననప్పుడప్పుడు సాగుచుండును, కాని పల్లెటూళ్ళలో నెవరిపని వారిదే. సామాన్యముగా కొన్నియూళ్ళలో నలుగు రొకచోట సమావేశమగుటన్నే కష్టము. ఒకవేళ కూడిరో, యేసంసారగోష్ఠియో, ఏకుటుంబ కలహములో, ఏవివాహసంబంధవిచారణయో, ఏవడ్డీ వ్యాపా

రపుమాటలో, ఈ మొదలగువానిని గూర్చిన సంభాషణమే బయలుదేరునుగాని, యున్నత భావములను పురికొల్పు సంభాషణలు, చర్చలు, ధర్మవిచారణలు నీరోజులలో సామాన్యముగా గానవచ్చుచుండుటలేదు. ఇట్టి గ్రామములలో గ్రంథాలయములను నెలకొల్పినందువలనను విశేషలాభ ముండబోదు. ఈ ప్రదేశములందు వీనిని నడిపి ప్రచార ములో దెచ్చు కార్యదర్శి మిగుల సమర్థుడై యుండవలయును. పాశ్చాత్య విజ్ఞానతత్త్వము నవగాహన చేసికొని, హైందవ విజ్ఞానము నం దభిమానము కలవాడై, సాధ్యమైనంతవరకు వానిని సమన్వయించుచు, గ్రామములందలి పూర్వాచార పరాయణులనుగాని, నవనాగరకతావాసన గలిగిన యువజన మునుగాని రెచ్చగొట్టక, యొక్కొక్క విషయమునుగూర్చి యుపన్యాసరూపముననో, పురాణముగనో, హరికథారూపము ననో జనసామాన్యమునకు రంజకంబగు నటుల బోధించి, వారి కాయావిషయములగూర్చిన గ్రంథము లనందచేయవలెను. ఈ పద్ధతియే జనుల మనములనాకర్షించుటకు త్తమమైనది. సాహిత్య గ్రంథము లనేకము లిదివరకే కలవు గాన, వివిధశాస్త్రవిజ్ఞాన మును బోధించు గ్రంథములు సులభశైలిని, పదములు, పాటలు, కథలు, వచన గ్రంథములుగను దేశభాషలలో రచింపబడ వలయును. గ్రామజనులదృష్టి వీనిపై బ్రసరించునట్లు చేయు టకుగా మ్యాజిక్ లాంతరు ప్రదర్శనములతో గూడిన యుప న్యాసములు జరుపవలసి యుండును. లేనిచో సర్వాకర్షణ తంత్రములందును, కోర్టు వ్యాపారములందును వ్యాపృతులై యున్న వీరి గ్రంథాలయముల పొంతకే పోరు. అర్థపరత్వము మాన్పి ధర్మపరత్వమునను, ఆముష్మిక చింతయందును,

నూతన జ్ఞానసంపాదనా పరత్వమునను జనమాన్యముయొక్క దృష్టి ప్రసరించునట్లుచేసి, ధర్మోపదేశకుండగు గ్రంథాలయ కార్యదర్శి వీరి కీకాలమున గురుస్థానము నాక్రమించి, సత్ప్ర వర్తనమందువలెనే సద్గ్రంథపఠనమందును రుచి పుట్టింపవలయును. ఇట్టి కార్యమును సాధింపవలయునని కొంతవర కైన ప్రాక్ పశ్చిమ విద్యలయం దారితేరి లోకానుభవము గలిగిన సమర్థులే కావలయును. అట్టివారు ప్రస్తుతస్థితిలో దొరకుట కొంతవరకు కష్టమేగాని, పట్టణములం దున్నతోద్యోగముల నుండి యుపకారవేతనములతో విరమించిన విద్యాధికులగు వారు, కళాశాలోపాధ్యాయులు మున్నగువారు నిట్టి పనికి బూనినచో దేశాభ్యుదయ కార్యము సులభసాధ్యము కాగలదు. ఆయా గ్రామములయం దిట్టి గ్రంథాలయ కార్యదర్శియే ప్రాచీనకాలమునందలి గురుస్థానము నాక్రమింపగలడు. మరియు ప్రచారశాఖ కార్యమును సెలవులలో విశ్వవిద్యాలయములందలి విద్యార్థి బృందములు పూనుకొనినచో ఉభయతారకంబై యుండును. పట్టభద్రుడైన ప్రతి విద్యార్థియు తనయభిమాన శాస్త్రమున కళాశాలలో నేర్చిన విషయములను గూర్చి గ్రామాదులలోని గ్రంథాలయముల తరఫున గొన్ని యుపన్యాసముల నిచ్చితీరవలసినదిగా విశ్వవిద్యాలయాధికారులు లొక నియామకము చేయుటయు, నిట్టి వారిలో సమర్థులగువారికి జిల్లాబోర్డులు, తాలూకాబోర్డులు, గ్రామ పంచాయతులు మొదలగు స్థానికసంస్థలు తగిన వేతన మిచ్చి, వీరి నాయా గ్రామములలో గంథాలయ ప్రచారకులుగ నియమించి పోషించుటయు దటస్థించినచో, నీ గంథాలయోద్యమము చక్కగ కొనసాగుటయేగాక, నిరుద్యోగ

సమస్యకూడ కొంతవరకు సాధింపబడిన దగును. ఇట్లే గ్రంథాలయ కార్యదర్శియే ఆయా గ్రామములందలి జనసామాన్యమునకు విద్యాగురువై గ్రామపునర్నిర్మాణ కార్యక్రమమును తగురీతిని కొనసాగింప గలిగియుండును. గ్రంథాలయోద్యమ ప్రచార మీవిధముగ దేశమున విద్యావ్యాప్తికిని, దేశకల్యాణమునకును గూడ తోడ్పడగలదు. ఏతదుద్యమ ప్రచారమునం దభిమానము గలవారందరీవిషయమును గమనించి యాచరణలోనికి దెచ్చుటకు యత్నింతురుగాక.

# ౪ సరస్వతీ పూజ

— ఆచార్య పుచ్చా వెం॥ట్రామయ్య

శ్లో॥ యాకుందేందు తుషార హార ధవళా
యాశుభ్ర వస్త్రాన్వితా
యా వీణా వర దండ మండిత కరా
యా శ్వేత పద్మాసనా
యా బ్రహ్మాచ్యుత శంకర
ప్రభుతిభిః దేవై స్సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ
నిశ్శేష జాడ్యా పహా-

చిరకాలమునుంచి శరన్నవరాత్రులలో నేమి, ఇతరకాలములందేమి సరస్వతీ విగ్రహాన్ని పెట్టి, పటాన్ని పెటి, పుస్తకాలను బెట్టి, షోడశోపచార విధిగ పూజచేసి శ్రీదేవి కటాక్షమును పొందుట కద్దు అవి యన్నియు పరోక్ష పూజా విధానములు, లేదా ప్రాతినిధ్య పూజావిధానములై యున్నవి. నేనీ వ్యాసములో చెప్పబోయే పూజా విధానం కేవలం ప్రత్యక్ష పూజా విధానం. ఫలము కూడ ప్రత్యక్షమే. సంశయాని కేమీ తావులేదు. విస్మరింపబడిన ఒక ప్రాచీన పూజా విధానం నాచే జ్ఞాపకం చేయబడుచున్నదే గాని యిది నవీన విధానమున్నూ కాదు.

భారతదేశములో చిరకాలమునుండి పండితులు విద్యను ముఖస్థముగానే వుంచుకుంటూ యుండేవారు. ఇప్పటి వలె అప్పుడు ముద్రణాది సౌకర్యములు లేకపోవుటవలన అతి ప్రాముఖ్యములయిన గ్రంథములే తప్ప మిగతా గ్రంథములు శాశ్వతముగా గ్రంథరూపముగా నిలిచేవికావు. శాశ్వతముగా

నిలవటానికి పనికిరాని యిప్పటి మన రైల్వే వాఙ్మయము వంటి గ్రంధములు మచ్చునకుకూడ దొరికేవికావు. అప్పుడుత్తమ గ్రంధములు సంపన్నులయొద్దను, పండితులయొద్దను మాత్రమే లభించేవి.

సామాన్యజనానికి శ్రుత పాండిత్యమే ఆధారముగా నుండేది. సర్వ శాస్త్ర పారంగతులైన పండితులు షడ్దర్శనములను ప్రవచనము చేసేవారు. పౌరాణికులు పురాణములను చదివి త్రివర్గాలను ప్రబోధించేవారు. హరికథలు చెప్పి, కృష్ణ భాగవతమాడి భాగవతులు హరిభక్తిని ప్రబోధించేవారు. వీధి నాటకాలు, జంగంకథలు, తోలుబొమ్మలు, పల్నాటి కథలు, వీరుల కథలు విని ప్రజలు ధర్మాన్ని, నీతిని నేర్చుకొనేవారు. సాతానులు, దాసరులు, జంగాలు, గురువులు మొదలైన పేర్లు గలవారు చదువుకోని ప్రజలకు నీతిని, నియమాన్ని బోధించుతూ వుండేవారు. వేదవేదాంగములు చదివిన పండితుడు మొదలుకొని మాలదాసరి వరకు అందరూ సంఘ జీవనము నియమవంతంగాను, ధార్మికముగాను నడవటానికే తోడుబడేవారు. విద్యలు చదువుకొని ప్రబోధముచేసే వారందరిని ప్రజలు అన్నవస్త్రములిచ్చి సత్కరించేవారు. అందువల్ల అక్షరాలు నేర్చుకోనివారుకూడా అక్షరమైన పరబ్రహ్మాన్ని చేరడానికి వీలుండేది.

ఇప్పుడు కాలం మారింది. పరిస్థితులు మారినవి. ప్రాచీనమైన సాంప్రదాయాలమీద ఏవగింపు కలిగింది. తెల్లవారేదాకా భాగవతము, తోలుబొమ్మలు చూచే ఓపిక ప్రజలకు తగిపోయింది. సినీమాలుకూడ మూడుగంటలకంటె ఎక్కువ ఆడితే మోటుగా భావించుతున్నారు. పూర్వకాలములో ఒక భాగవతమో, తోలుబొమ్మలాటో చూస్తే అందులో నిఘంటువులు వచ్చేవి. స్వప్నశాస్త్రము, సాముద్రిక శాస్త్రము, శకునశాస్త్రము, యుద్ధతంత్రము, ధర్మము,

నీతి, అర్థశాస్త్రము, కామశాస్త్రము, అలంకార శాస్త్రము, కవిత్వము, చిత్రలేఖనంకూడా వచ్చేవి. అప్పుడీ ప్రదర్శనాలన్నీ విద్యాప్రబోధకాలుగా ఉండేవి. ఇప్పటివలె కేవలం వేడుక ప్రధానంగా ఉండేవి గావు. సంగీతము, నృత్యము, నాట్యము, అభినయము మొదలైన విద్యలకు ఎక్కువ ప్రాధాన్యం ఉండేది. నిత్య పరిచయము వలన ప్రేక్షకులకు గూడా రాగము, తాళము, లయ, భావము, హావము బాగుగా గ్రహించే సామర్థ్య ముండేది. అభినయశాస్త్రంలో ఒక ముద్ర ఎందుకు ప్రదర్శించుతున్నారో సామాన్యుడుకూడ గ్రహించేవాడు. అవసరము మాలిన విద్యలు అప్పు డుండేవి కాదు.

కాలం మారింది. కనుక ఇప్పటి కాలానుగుణ్యముగా మన అలవాట్లుకూడా మారుతున్నాయి. మునుపటివలె గాక ఇప్పుడే గ్రంథమైనను స్వల్పవెలకు లభించుతున్నది. ప్రజలకు కూడ అన్న వస్త్రాలు అంత కష్టపడకుండానే లభించు తున్నవి. అందువలన ఎంతో తీరిక కాలము దొరుకుతున్నది. ఇప్పుడు ఏ శాస్త్రమైన చదువుకోవలెనంటే శ్రద్ధగలవారు చదువుకొనుటకు వీలైనరీతిగా వ్రాసిన గ్రంథము లున్నవి. ఐతే ప్రజలంతా ఆ సౌకర్యముల నుపయోగించుకొనుట లేదని మాత్రము అనుభవముమీద మనకు తెలియుచున్నది. సామాన్యముగా చూచి చదువను వ్రాయను నేర్చినవారు భారతదేశము మొత్తంమీద నూటికి ఏడుగురుకంటె *లేరు. మహా నాగరకులమని విర్రవీగే బ్రిటిషు ప్రభుత్వములోనే 40 కోట్లకు 3 కోట్లమంది చ-వినవారు లేకపోతే ఇంక ఎప్పటి కైనా 40కోట్ల భారతీయులు విద్యావంతులయ్యేదరా యని

* ఇది చాలకాలము క్రిందటి మాట. ప్రస్తుత మీసంఖ్య 4 రెట్లు పెరిగినది.

భయము కలుగుచున్నది. రష్యా, జపాను మొదలైన దేశాలు చూస్తేమాత్రము ఆశకలుగుచున్నది.

ప్రతి విద్యావంతుడు తన జీవితకాలములో ఇంకొ కొంతమందిని అక్షరాస్యులుగా చేయుటకు పడేపాటునకే సరస్వతీపూజయని పేరు. గ్రంథాలయములు నిర్మించట మొ' విధము. అందులో ఒక భాగమే పూర్తియైనది కాని రెండవ భాగ మట్లే యున్నది. గ్రంథాలయములోని పుస్తకములను చదువుటకు తగిన పాఠకులను సమకూర్చనిదే గ్రంథాలయ ముల పని పూర్తికాదు. ప్రతి పాఠకునకు తగిన గ్రంథాన్ని సమకూర్చుటముకూడ గ్రంథాలయము పనే యైయున్నది. గ్రంథాలయ సభ్యులందరు పాటుపడినగాని యీ పని నెరవే రదు. ఇంతకన్న గ్రంథాలయాలను గురించి వ్రాయను. గ్రంథాలయ శాస్త్రమునకు సంబంధించినవారు దానిని వ్రాయుదురు. ఇది అంతా కూడ సరస్వతీ పూజలోనే చేరు తుంది.

ఇంకొక నిత్య పూజావిధాన మున్నది. అది వ్యక్తులకు సంబంధించినది. ప్రతి విద్యావంతుడు తాను పోయిన చోటున కెల్ల, తన వెంట కొన్ని బాలశిక్షలు, కొన్ని కథల పుస్తక ములు, కొన్ని పద్యాల పుస్తకములు కొనిపోవును. దొరుకుట లేదు గాని కొన్ని బొమ్మల పుస్తకములున్న మరీమంచిది. తానుపోయిన చోటునెల్ల బడిచదువు వదలిపెట్టినవారు కొంద రును, వారిలో కొంతమంది అక్షరాలు వచ్చినవారు, కొంత మంది గుణింతమంతా వచ్చినవారు, కొంతమంది పేర్లుచదువ గలవారు, కొంతమంది కూడబలికి కథలు చదువగలవారు కూడా ఉందురు. వారు తమకువచ్చిన చదువువలన ఏమియు లాభము లేదని నిరుత్సాహము చెందియుందురు, ఇట్టివారు మనము ప్రయత్నించినచో ప్రతిదినము తండోపతండములుగా

లభింతురు. వారిలో శక్తి గలవారికి మనము తీసికొనివెళ్ళిన పుస్తకములు చూపించినచో తమతరగతికి తగిన పుస్తకములు తీసికొందురు. మరీ శక్తిలేనివారికి తనశక్తి ననుసరించి వెల తగ్గించియో, ఉచితముగానో కొన్నిపుస్తకము లీయవచ్చును, ఇంతటితోనే తన పని తీరిపోయిందని భావింపక, నెల కొకసారియో, రెండునెలల కొకసారియో ఆగ్రామమునకు పోయి ఎవరెంతవరకు అభివృద్ధి నొందినారో కనిపెట్టి అభివృద్ధి పొందినవారిని ఇంకను అభివృద్ధినందుటకును, ఏవిధాన అభివృద్ధి పొందనివారిని తిరిగి ప్రోత్సాహపరచియు రావలెను. మరియును అభివృద్ధి పొందినవారి కనుగుణ్యమైన తరగతి గ్రంథములను వారికి సహాయ్యచుండవలెను. మొదట మనము చేసిన పని యంతయు వ్యర్థమైనదని నిరుత్సాహము కలుగుతుంది. కాని అది సరస్వతీపూజ అనే దృష్టితో చేసే యెడల మనకెంత జయము కలిగేది తరువాత తెలియును.

నేను చేసిన ఒకటి రెండు పనుల నిచ్చట వ్రాయుచున్నాను. దానితో మీకుకూడ కొంచెము విశ్వాసము కలుగుతుంది. మాయూరిలోనే నాకుమాత్రెయీడుగలపిల్లలు ఏడెనిమిది మంది ఉండేవారు. వీరందరుకు కూడా కూడబలికి చదువుటవలనే వచ్చును. బస్తీకి పోయినప్పుడెల్ల సి. కుమారస్వామినాయుడు కంపెనీవో, రామా అండ్ కో వో కొన్ని కథల పుస్తకములు బొమ్మలున్నవి తెచ్చేవాడిని. అందరికీ తలో పుస్తక మిచ్చేవాడిని. ఎవరు తీసికొని వెళ్లిన పుస్తకము వారు తిరిగి యిచ్చేవారు. పుస్తకములు తిరిగి యిచ్చుటకు కాల నియమ ముండేదికాదు. ముందర పుస్తకాలు తిరిగి యిచ్చినవారు తిరిగి ఆ పుస్తకములే ఒకరుచదివిన వింకొకరు చదివేవారు. పుస్తకాలు వాపసు చేయనివారిని ప్రతి దినము హెచ్చరించుతూ ఉండేవాడిని. ఆ హెచ్చరింపులో నిందకా

కుండ ప్రోత్సాహమే ఉండేది. ఎవరైన పుస్తకములు పారవేసిన, తిరిగి యిచ్చినయెడల వారికి శిక్షయుండేది కాదు. నేను బస్తీనుంచి వచ్చినప్పుడెల్ల ఈ పిల్లలు నా చుట్టూ మూగేవారు. వాసుదాసు*గారి చిన్న పుస్తకాలు శకుంతల, నలుడు, ప్రహ్లాదుడు, ఆర్యకథానిధి అవి అన్నీ నాకు నోటికి జ్ఞాపకము లేవు - పట్టికవచ్చి పిల్లలకిచ్చేవాడిని. ఆ పిల్లలలో దాదాపు అందరు ఆ పుస్తకములు చదివినారు. దీని తరువాత బంగారు సరస్వతీ నికేతనమువారి సతీసావిత్రి, అనసూయ, మల్లికాగుచ్ఛము మొదలైన కథలే గాకుండా వాల్మీకి విజయం, భక్తియోగముకూడ వారిచేత చదివించినాను. క్రమక్రమముగా వారే చెలియలికట్ట, ఏకవీర, వేయిపడగలు మొదలైన పుస్తకాలు చదువుకున్నారు. ఇప్పుడు వారిలో చాలమంది ఏ వచన గ్రంథమైనను సులభముగా చదువుకోగలరు. నా కుమార్తె చి॥ సౌ॥ సీతారామమ్మ భాగవతములోని పద్యములు ధారాళముగా చదువుతుంది. తిరుపతి వెంకట కవుల పాండవ నాటకాలు చదివి, తోడియువతులకు వినిపించుతుంది మిగిలిన పిల్లలుకూడ ఇంతకంటె తక్కువగా ఎవ్వరూ లేరు. నిమిత్తమాత్రమైనానే గాని విద్య నేర్చుకుందామనే అభిలాష వారిలో ఉండనేయున్నది. ఈ పరిశోధనలో నేను 30, 40 రూపాయలకన్నా ఖర్చుపెట్టలేదు. ఈ వ్యయానికి నేనెప్పుడూ విచారపడలేదు. ఏమంటే విడిగా చదువు చెప్పించుటకు ఒక పిల్లకుకూడ ఈ డబ్బు చాలదు.

ఇంకొక్క విషయముకూడా వ్రాస్తాను. మా తోబుట్టువు. అత్తవారింట్లో నున్నది. ఆమెకు కూడా గుణింతము వచ్చీ రాకుండా ఉన్నది. నేను ఇంకో తోబుట్టువు కుమారునికొరకు కొన్ని బొమ్మల పుస్తకములు కొని వారింటికి

---

* వావిలికొలను సుబ్బారావు

వెళ్ళినాను. ఆమె నావద్దనున్న బొమ్మల పుస్తకములు రెండు తీసికొని కొన్నాళ్ళకు చదివి తిరిగి యిచ్చినది. అటు తరువాత నేను వారియూరు వెళ్ళినపుడెల్ల కొన్నిపుస్తకములు తీసికొని వెళ్ళుతుండేవాడిని. 1911 వ సంవత్సరమునుండి నేను కొని, యాచించి కూడా చాలాపుస్తకములు సేకరించి యుంచి నాను. ఆమె భర్తగారివద్దకూడ ఆర్. వెంకటేశ్వర కంపెనీవారి వచన భారతము, వచన రామాయణము ఉండేవి. అవికూడా ఆమె నెమ్మదిగా చదివినది. యోగవాశిష్ఠము, భగవద్గీత మీాద వ్రాసిన తెలుగు వ్యాఖ్యానాలు, తెనుగులో వ్రాసిన ఉపనిషత్తులు ఆమె సులభముగా చదివి అర్థము చేసికొన గలదు. దీనికి నేను ధనరూపముగా ఖర్చుపెట్టినదేమియు లేదు. దీనికి ముఖ్యముగా కావలసినది శ్రద్ధ, విశ్వాసము. విశ్వాసము దేనికంటే, మనయెదుట నున్నవారు మొద్దులు కారనియు, వారికి కూడ అనుకూల పరిస్థితులు కలిగించిన యెడల వారుకూడ మనవలె విద్యావంతు లగుదురనియు నమ్మిక లేకపోయిన పై పనులు చేయజాలము. ఇది అంతా సరస్వతీ పూజయే.

తెనుగు దేశములో ధన దారిద్ర్యముకన్న భావ దారిద్ర్యమెక్కువగా నున్నట్లు కనబడుతుంది. ఎంతమందికీ డబ్బు రూపాయలు, అణాలు, పైసలలోనే యుంటుంది గాని పుస్తకాల రూపములో ఏమియు నుండదు. అనేక ధనిక గృహాలలో ఒక్క పుస్తకము కూడా దొరకదు. ఆ ఇండ్లలో నుండే ఆడవారు కర్మముచాలక ఏదైన పుస్తకము తెమ్మన్న మగవారికి ఎక్కడలేని కోపము వస్తుంది. ఆ ఇండ్లలోని స్త్రీలు పుస్తకముల లేమిడివలన విద్యా విహీనులుగానే యుండి పోతారు. విద్యలేని యింట్లో పుట్టిన పిల్లలు చదువుకోవలసి వస్తే అంతా క్రొత్తగానే యుంటుంది. విద్యావంతుల యిం

ల్లో పుట్టిన భాగ్యశాలురకు విద్యలుకూడ బాగానేవస్తవి. ధర్మార్థకామములు సంపూర్ణ సుఖప్రదముగా నుండవలె నంటే స్త్రీ విద్యావతిగా నుండుట చాల అవసరము. పురుషుని విద్యకన్న స్త్రీ విద్య పిల్లలకు చాల అవసరమైనది. అందువలన ప్రయత్నము చేసి ప్రతి విద్యావంతుడు చదువదగిన వారికి కొన్ని పుస్తకములు లభింపజేయవలెను. ఇది కూడా సరస్వతీపూజయే. తీరిక చేసుకొని ప్రతి విద్యావంతుడును తనచుట్టుపట్టులనుండే విద్యా విహీనులను పోగుచేసి వారికి తీరిక సమయములో కొంతకాలము రాత్రులయందు చదువు నేర్పుటయును సరస్వతీ పూజయే. ధనవంతులుగా ఉండేవారు ఉచిత పాఠశాలల నేర్పఱచి విద్యావిహీనులుగా నుండేవారికి చదువు చెప్పించుటయును సరస్వతీ పూజయే.

ఇన్నివిధాల చేసినాకూడా ప్రభుత్వము ప్రజలదై ప్రజలకు విద్యగరపుట ప్రభుత్వమువారి పరమ ధర్మము అయ్యేవరకు దేశములోని ప్రజలందరును అక్షరాస్యులు కావటము అసంభవమే. అందువలన ప్రజలు అక్షరాస్యులగువరకు వారికి విద్యరాకుండా ఉండటము కోరదగినదికాదు. నేను పైన వ్రాసిన విధముగా వారికి పూర్వము పాండిత్యము శ్రవణముద్వారానే లభించేది. ఇప్పుడుకూడా ఆ సంస్థలను తిరిగి ఉద్ధరింపవలసిన ఆవశ్యకత కన్పించుచున్నది.

వేద వేదాంగవేత్తలై భాష్యత్రయ ప్రవచనము చేయగల పండితులు మనదేశములో ఇప్పటికిని అచ్చటచ్చట బీజ మతుగా లభించుచున్నారు. వారికి ఆహార వస్త్రములకు లోటు లేకుండ సత్కరించి వారిచేత అనుష్ఠాన వేదాంతమును ప్రవచనము చేయించుటయును సరస్వతీ పూజయే యగును. సరస్వతీస్వరూపులైన పండితపూజ సరస్వతీపూజ గాక మరేమగును?

త్రివర్గములను బోధింపగల ధర్మశాస్త్రములు, పురాణములు, సాంప్రదాయకముగా చెప్పగలిగియు, అన్నవస్త్రములకు లోటుగలిగి ఆదరించువారు లేక, పురాణము చెపితే వినువారున్నూ లేక యెందఱో పండితులు మూలవోయి యున్నారు. వారిని సత్కరించుటయు, వారిచేత పురాణములు, ధర్మశాస్త్రములు చెప్పించుటయు, వినుటయును గూడ సరస్వతీపూజ క్రిందనే జమ.

ఇట్లే భాగవతులు, హరిభక్తులు, జంగంకథ చెప్పేవారు, వీధినాటకములాడువారు, తోలుబొమ్మలాటవాండ్లు, పల్నాటి వీరుల కథలు చెప్పువారు, సాతాని జియ్యరులు, మొదలగు ప్రాచీన సాంప్రదాయకు లెందరో పూజా పురస్కారములు లేక మూలబడియున్నారు. ఈ సంప్రదాయములనన్నిటిని పునరుద్ధరించి వారందరిని గౌరవించి, వారికి తగినభృతిని, గౌరవము (Status) ను ఒసంగి, వారిచేత సామాన్య జనములో తిరిగి విద్యను వ్యాప్తిచేయవలసి యున్నది. ఈ సంస్థలు యిప్పటికీ శిథిలావస్థలోనున్నవి.

బీజరూపముగానున్న యీ సంస్థలను, పండితులను మనముచేకొని వారివలన పొందవలసిన లాభమును పొంది సంస్థలను పెంపు చేసినయెడల మనపై సరస్వతీ కటాక్షము ప్రసరించును. గాడిచర్ల హరిసర్వోత్తమరావు, మానికొండ సత్యనారాయణశాస్త్రి, భావరాజు వెంకటకృష్ణారావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, దిగవల్లి వెంకటశివరావు, టంగుటూరి ప్రకాశపంతులు మొదలగువారిచేత రాజనీతి శాస్త్రములు, చరిత్రలు, కాళీపట్నం కొండయ్య, గొబ్బూరి వెంకటానంద రాఘవరావు, వేమూరి శ్రీనివాసరావు, వేమూరి విశ్వనాథ శర్మ మొదలగువారిచేత భౌతిక శాస్త్రములు, ఆచంట లక్ష్మీపతి, మల్లాది రామమూర్తిశాస్త్రి, వాడపల్లి మురహరిరావు

మొదలగువారిచేత ఆరోగ్యశాస్త్రములు. ఈవిధముగా ఆధునికులగు పండితులచే వివిధశాస్త్రములు సులభశైలిలో ప్రజలకు వినిపించియో, బ్రాడ్‌కాస్టు చేయించియో ప్రజలను విద్యావంతులుగా చేయవలసియున్నది. వ్యాసములో నేను పేర్కొనని యెంతోమంది పండితులు మన దేశములో నున్నారు. వ్యాసము విసుగు కలిగింపకుండా ఉండేకొఱకు ఆజాబితా అంతా వ్రాయలేదు. అంతేకాని ఆ పండితులకు ప్రాముఖ్యము లేకకాదు.

ఇప్పుడున్న ఇంగ్లీషు పద్ధతిని చదువు చెప్పు సంస్థలు కేవలము సర్కారు నౌకరులను తయారుచేయుటకే యేర్పడినవి. ఇందులో చదువుకొన్న పండితులు అదే విద్యను నేర్పగలరేకాని యితర జీవితావసరములను కలిగించు విద్యనునేర్పజాలరు జీవిత పరమార్థమును, లక్ష్యమును బోధించు పాఠములు ఆ పాఠశాలలలో మనకు లభింపవు. మరియును ఆ పాఠశాలలలోని చదువు భాగ్యవంతులకే తప్ప పేదవారికి అందుబాటులో లేదు. ఇప్పటి విధానమే మార్పులేకుండ అవలంబింపబడే యెడల కొన్ని వేల సంవత్సరములవరకు భారతీయులు విద్యావిహీనులుగానే యుంటారు. కనుక చౌకయైన పూర్వ విద్యాసాంప్రదాయములను చేపట్టి ప్రతి భారతీయుడును విద్యావంతుడు అగువరకును మనము నిరంతరము పరిశ్రమ చేద్దాము. తప్పక సరస్వతీకటాక్షము మనపై ప్రసరింపగలదు. భారతదేశము సరస్వతీ నాట్యరంగమై విలసిల్లగలదు.

ఈ సందర్భములో ఇంకొక విషయముకూడ తెలుపవలసియున్నది. చిన్నపిల్లలు చదువుకునే పుస్తకములు మనకు తగినన్ని లభించుటలేదు. 2,3 రంగులలో పెద్ద అక్షరములతో అచ్చువేయబడి అనేకరంగులతో కూడిన బొమ్మలు

చేర్చిన పుస్తకములు ఇంగ్లీషు భాషలో మన కెన్నో లభింప గలవు. ఒక పెద్ద పుస్తకములోని విషయములు తేలిక భాషలో వ్రాసిన బొమ్మలుగల చిన్న పుస్తకములున్నూ ఇంగ్లీషుభాషలో దొరకగలవు. ఒక పిల్ గ్రిమ్స్ ప్రోగ్రెస్, ఒక గలివర్సు ట్రావెల్సు కావలెనంటే తక్కువఖరీదులో కూడ దొరుకుతుంది; అందులోగూడా ఎన్నో బొమ్మలుం టాయి. టెంపెస్టు లాంటివి చిన్న పిల్లలకు ఇచ్చేందుకు ప్రెజంటేషన్ ఎడిషన్ లున్నవి.

ఆవిధంగానే మన రామాయణము, భారతము, భాగవతము, శాకుంతలము, విక్రమోర్వశీయము మాళవికాగ్ని మిత్రము, నాగానందము మొదలగు రసవంతములగు కథలు, చిన్న సచిత్ర పుస్తకాలుగా వ్రాయించవలెను. ఇప్పుడు ప్రఖ్యాతులుగా ఉన్నకథకులు వానిని వ్రాయవచ్చును. లేదా ఇప్పుడు వ్రాసే రసవంతములైన కథలకు తోడుగా మంచి బొమ్మలు కూడ చేర్పించవచ్చును. మనదేశములో ఎంతో మంది రసవంతములైన కథలు వ్రాయగలవారున్నారు అడవి బాపిరాజు, నజ్జుల బాబురావు, బ్రహ్మ, అ. సోమేశ్వరరావు, దామెర్ల సత్యవాణి, అంకాల సుబ్బారావు, మంత్రవాది వెంకటరత్నం మొదలయిన వారెందరో చక్కని బొమ్మలు వ్రాయగలవారున్నూ ఉన్నారు. 5000 ప్రతులకు తక్కువ వేకుండా అమ్ముడు పోదగిన ఆకర్షవంతమైన చిన్న పుస్తక ములు ఒక సంస్థ ద్వారా ప్రచురింప గలిగెదమేని మనము లాభమున్నూ గడింపవచ్చును మరియు ఎంతోమంది ఇట్టి ఆకర్షవంతమైన గ్రంథములను తమ బిడ్డలను విద్యావంకకు త్రిప్పుట కుపయోగించుకొందురు. మన తెలుగులో ఇట్టి పని చేసినవారిలో వావిలికొలను సుబ్బారావుగారు మొదటివారు. వారి చిన్న గ్రంథములలోని చిత్రములు అనేకములు ధురంధర్ గారు వ్రాసిరి. సరస్వతీ నికేతనము వారిట్టివి కొద్దిగా

వ్రాయించిరి. సీరిపి ఆంజనేయులు గారు కొంత పరిశ్రమచేసిరి. ఎంకిపాటలు అంతబాగా ఆకర్షించుటకు అందులోని బొమ్మలు యెంతైనా తోడుపడినవి. తలిశెట్టి రామారావు గారి హాస్యచిత్రాలు, వ్యంగ్యచిత్రాలు భారతికి అలంకారము లయినవి.

ఇప్పుడు మన వాచకాలు పరీక్షలకు చదువవలసిన పుస్తకాలేగాని సుఖంగా, కులాసాగా చదువుకునేందుకు పనికిరావు. చదువులోకూడా వినోదము అనుభవిస్తే పిల్లలు పెద్దలు ఇంకా బాగా పుస్తకాలు చదివి బాగుపడతారు. కనుక చిన్నపిల్లలకు పనికివచ్చే రెండు మూడు రంగులలో ముద్రించిన బొమ్మల పుస్తకాలు యెన్నో మనము ప్రచురించవలెను. ఇది అంతా లాభదాయకమైన సరస్వతీ పూజయే.

బుక్ ఆప్ నాలెడ్జి లాంటి ఉద్గ్రంధాలు తెలుగులో అదే విధంగా బొమ్మలతో తేలిక భాషలో వ్రాయించి ప్రచారము చేయగలిగెదమేని పయోజన విద్య చరితార్థం అవుతుంది. ఇవన్నీ చాలా ధనంతో కూడుకున్నవి. అంతే కాదు. శ్రద్ధతోను, ఉపజ్ఞతోను కూడుకున్నవి. తెలుగు దేశంలో డబ్బున్నది. ఎంతో డబ్బు ఎందుకూ పనికిరాని సంస్థలలో పెట్టుబడి పెట్టి మోసపోయినవారున్నూ ఉన్నారు. ఎకరము 1 కి వేలకు వేలు పెట్టి కొనేవారి తెలివిని ఏమనాలో ఊహించలేకుండా ఉన్నాను. అందుమీద 4, 5 అణాల వడ్డీ కూడ రాదు. ధరలు తగ్గిపోతే భారము అవుతవి భూములు. ఎన్నో ఫ్యాక్టరీలలోను, లిమిటెడ్ సంస్థలలోను డబ్బుపెట్టి నూటికి 2, 3 రూపాయలుకూడ డివిడెండురాక మూలాన్ని పోగొట్టుకున్న వారున్నూ ఉన్నారు. వారి ధనానికి ఇది మంచి పెట్టుబడిగా నుండగలదు. కిన్నెరసాని పాటలవంటి

పుస్తకాన్ని రంగులతో అచ్చువేసి, అందులో 30, 40 బొమ్మలు చేర్చి 2, 3 రంగుల బొమ్మలుకూడ చేరిస్తే ఎంతో మంది కొని చదువవచ్చును. పుస్తకం వ్రాయుట దానికి బొమ్మలు వ్రాయుట, అచ్చువేయుట, ప్రచురించుట, ప్రచారము చేయుట, కొనుట, చదువుట ఇవన్నీ సరస్వతీ పూజా విధానాలే.

ఇంకొక పూజావిధానము శేషించి యున్నది. భాగ్యవంతుల డబ్బుకు సార్థకమైన పూజా విధానమిది. సరస్వతీదేవి అవతారము ధరించిన పండితులు, కవులు, గాయకులు, హరిభక్తులు, నటకులు, చిత్రలేఖకులు, వ్యాసకర్తలు, ఉపన్యాసకులు, భౌతికాది శాస్త్ర పండితులు, చారిత్రికులున్నారు. అందులో లక్ష్మీకటాక్షము గలవారు చాల అరుదుగా ఉన్నారు. ఎంతోమంది దినబత్తెములు జరుగక యున్నారు. ఎంతోమందికి వృద్ధాప్యము నరకముగా గడచుచున్నది. కొంతమంది చనిపోయిన తరువాత ఊర్ధ్వ దైహిక క్రియలకు ఏమిన్నీ మిగులుటలేదు. వీరందరి యోగక్షేమము ప్రభుత్వము, ప్రజలు చూడవలసియున్నది. ఇది అన్నిటికన్న గొప్ప సరస్వతీపూజ. ఈ పూజా విధానాలలో ఒక విధానమైనను నేను అవలంబించితినా ధన్యుడను అని మనలో ప్రతియొక్కరమూ భావించి పూజించి ధన్యులమయ్యెదముగాక!

# ౫. గ్రంథాలయముల కర్తవ్యము

— డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి

నేను పండితుడనుగాను. కావలయునను కోరికయు నాకు లేదు. మనలో పండితు లనేకులు గలరు. కాని పాండిత్యమున కంటె ముఖ్యముగా కావలసినది రచనా శక్తి. పుస్తక భాండాగారములు పెంపొందింపవలసినది పాండిత్యముగాదు. ఉన్నశక్తినెల్ల వినియోగించిన జనులకు మేలు కలుగునో అట్టి అభ్యాసములను కలిగించవలెను. ఈ కాలమున జాతీయ భావము ప్రబలుచున్నది. నాగరకత గల దేశములలో మత సాంఘిక విభేదము లెన్నియైననున్నవి. కాని ఆ దేశములలో నందర నొక్కటిగా కట్టివైచు జాతీయతా భావ మున్నది. ఇతర దేశముల వ్యవహారములలో పాల్గొనుచు, ప్రత్యక్షముగా స్వదేశ లాభమును గడించు విధానమును మనము నేర్చుకొనవలయును. ఇతర దేశీయులు తమ దేశౌన్నత్యమును దృష్టియందుంచుకొనియే పనులు చేయుచుందురు. ఐరోపాయం దంతటను మనకు తెలిసినట్లుగ త్వరలోనే ఆకాశ విమానములు వ్యాపించినవి. అందునకు కారణము యుద్ధమునందు తమ దేశము పైచేయిగా నుండవలయునని వారిలో నొక్కొక్కరును భావించుటయే. మనము దాస్యభూమిలో నున్నాము.* కావున ఇతరులకంటె మిన్నగా నుండవలయునను భావము మనలో దట్టముగా లేదు. మనలో జాతీయత లేదు. ఎదుటివారి నాదర్శముగా గొని శాశ్వతాభివృద్ధి మార్గ

* ఈ వ్యాసము మనము బ్రిటీషువారి పరిపాలనలో నున్నప్పుడు వ్రాసినది. రాజకీయదాస్యము వదలినను జాతీయ భావము మనకు పూర్తిగా అబ్బలేదు.

ములకు ప్రయత్నించుట లేదు. గ్రంథాలయములు ముఖ్యముగా జాతీయతను ప్రోత్సాహ పరచవలయును.

మానవుని యభివృద్ధికి కావలసిన సాధనములు రెండు. జ్ఞానము మొదటిది. ఇది మంచి, ఇది చెడ్డ, ఇది సక్రమము అది అక్రమము అను వివేచనాశక్తి యున్నగాని మన శీలము చక్కబడదు. రెండవది ఆచరణ. జ్ఞానము కలిగినను దాని ననుసరించి నడుచువారు కొద్దిమంది. సత్యము, ధైర్యము మంచి గుణములని అందఱు నెరుగుదురు. కాని వాని నాచరణలో నుంచువా రరుదు. సిక్కులు సహజముగా ధైర్యశాలురు. కాని ధైర్యమును గురించి యుపన్యాసము నియ్యజాలరు. వ్యాసమును వ్రాయలేరు. కావున జ్ఞానము కలిగి యుండుట వేఱు, దానిననుసరించి ప్రవర్తించుట వేఱు. దేశీయుల శీలమును, జాతీయతా భావమును పెంపొందవలయునన్న జ్ఞానము ననుసరించి ప్రవర్తింపవలయునను ధైర్యమును, సత్యసంకల్పము నుండవలయును. ఇతరదేశములలో నీ లైబ్రరీ లెంత పని చేయునో చెప్పెదను.

జ్ఞానమునకు ఉత్పత్తి, వ్యాపకమునను రెండుదశలు కలవు. మహనీయులచే గొప్పసంగతులు విననపుడు జ్ఞానము ఉత్పత్తి యగును. కవులును, మహనీయులును తమ ప్రతిభచే జ్ఞానమును సంపాదింతురు. సాధారణులమగు మనము అట్టి వారిచే సంగతులను విని వానిని వ్యాపింపజేయనగును. ఇప్పు డున్న విషయములకు వ్యాపకము బాగుగ జరిగినగాని క్రొత్త సంగతు లుదయింపవు. మన ఆయుర్వేద వైద్యులవలె నున్నది మూసిపెట్టినచో జ్ఞానము వృద్ధిచెందక నశించును. ఎప్పుడు దాచిపెట్టబడినదో అప్పుడే జ్ఞానము యొక్క నూతనవికాసము చచ్చిపోయినది. నూతనసృష్టి ఇప్పుడున్నవాని పైననే

నూధారపడియుండును. కావున మనకు తెలిసిన సంగతు లెంతత్వరగా దేశమున వ్యాపించిన నంత మేలు. మన దేశపు పరిచయముగల అమెరికను డొక డిట్లు చెప్పెను. "హిందూదేశములో నేదైన యొక క్రొత్త సంగతి వ్యాపించుటకు 75 సంవత్సరములు పట్టును. అమెరికాలో నద్దానికి 6 నెలలుచాలును." వేడినీరు త్రాగుట మంచిదని యొకరు సిద్ధాంతీకరించి రనుకొనుడు. ఆసంగతి మన దేశీయుల కందఱకును తెలియుటకు 75 యేండ్లు గావలయునట! ఏమందురా? అమెరికాలో ప్రతి గ్రామమున నొక లైబ్రరీయున్నది. కాని లైబ్రరీలలో నెన్ని పుస్తకములున్నను వాక్కుమూలమునగాని జ్ఞానము వ్యాపింపదు. అందుకొరకై అమెరికన్ లైబ్రరీలలో వారమున కొకటి రెం డుపన్యాసములు జరుగుచుండును. మనవారింకను ప్రాచీనములైన భక్తి, భగవద్గీత, రామాయణములను గురించిన యుపన్యాసముల పెట్టుకొనుచుందురు. ఇట్టి విప్పు డనవసరములని చెప్పకతప్పదు. ఏమందురా? మన యొక్కజాతివారము కనుక ఇంచుమించుగ నందఱిలోను ఇట్టి భావములు ప్రసరించియుండును. వానినే పదిచోట్ల పదిమారులు వర్ణించినచో లాభములేదు. భారత భాగవత రామాయణములు మన జాతీయతా వృక్షమునకు మొదలువంటివి. ఎల్లకాలము వానికే ప్రదక్షిణము చేయుచుండుటలో నుపయోగములేదు. కాని ఆవృక్షమునకు కొమ్మలు, చిగుళ్ళు, ఆకులు, పుష్పములు, పండ్లు నుదయింపజేయవలెను. 10 వేల యుపన్యాసములైనను యిప్పుడున్న మీభక్తి హెచ్చుగాదు. లేనివారికుదయింపదు. చెప్పవచ్చిన దేమన, క్రొత్తసంగతులను జనసామాన్యమునకు వ్యాపింపజేయుటే లైబ్రరీలకు ప్రధాన కర్తవ్యమని. భక్తి, బాలగంగాధరతిలకులను మాటిమాటికి ప్రదర్శించుటకంటె, ఆధునిక దేశచరిత్రల విషయము చర్చిం

చుట లాభకరముగా నుండును. ఇతరదేశముల పరిపాలనమును గుఱించియు, వారి సంఘనిర్మాణమును గుఱించియు నప్పుడప్పు డుపన్యాసముల నిచ్చుచున్నచో జనులకు నిజమగు ప్రబోధ ముదయించును. గ్రామపురోభివృద్ధిని గుఱించి నేనెక్కువ ప్రచారమును జరుపదలచినాను. అందఱును ధర్మవరమువంటి పట్టణములకువచ్చి యుపన్యాసమును వినిపోవుట సాధ్యముగాదు. మనదేశములో గ్రామములసంఖ్య హెచ్చు. ఇంకను మనవారికి శ్రుతిప్రమాణము. కంటితో కంటె చెవితో డనే వారు జ్ఞానమునుసంపాదింతురు. కావున విద్యావంతులు వర్తమానమునకు సంబంధించిన రెండుపన్యాసములైనను నెల నెలకు నేదోయొక గ్రామమునకు పోయిఇచ్చునట్లు శపథము చేసికొని పనిచేయవలెను. కడచిన సంగతులే పలుమారు పారాయణముచేయుటవృథాప్రయాస, భూతము మనలపట్టియే యున్నది. ఆభూతమునే మరలమరల నాహ్వానించుట పనికి మాలిన పని. వర్తమానమును గలిపి భవిష్యత్తునకు దారి చూపవలెను. నానాటికి నభివృద్ధిజెందుటయే మన యాదర్శముగా నుండవలయును. మనముకూడ కాలప్రవాహములో పోవలయునుగాని స్తంభించి యొకచోట కూర్చున్నచో, ఇతర దేశీయుల పరిహాసమునకు పాత్రులగుదుము.

లైబ్రరీలలో గ్రంథములైనను వర్తమాన శాస్త్రములను గుఱించి హెచ్చుగా నుండవలెను. లైబ్రరీల యుద్దేశ్యము జ్ఞానవ్యాపకముగాని పాండిత్య ప్రకటనముగాదని తొలుతనే మనవి చేసికొంటిని. విద్యావ్యాపక శాఖ లితర దేశములలో గలవు. గ్రామ గ్రామములోను సభలుచేసి వారు బోధింతురు. ఇందునకు పాండిత్య మనవసరము. అందఱకు నుపయోగపడునది పాండిత్యముగాదు పై సంఘముల వారు యుపన్యాసకులను తయారుచేసి గ్రామములకు పంపె

దరు. వారికి కావలసినది సామాన్య జ్ఞానము. అట్టి లైబ్రరీలలో గూడ పాణిని, పతంజలి వ్యాకరణము లుంచపనిలేదు. వానికి స్థానము కళాశాలలు. వార్తాపత్రికలు, వర్తమాన పరిస్థితులకు సంబంధించిన గ్రంథములును లైబ్రరీలలో నుంచవలయును. వచ్చునాదాయములో సగమైనను వార్తాపత్రికలకు వ్యయము చేయుట దోషముగాదు. కళాశాలలో ప్రాచీన గ్రంథములును, లైబ్రరీలలో నవీన గ్రంథములు నుండుట న్యాయము. పూర్వపుకవులు గతించిపోయిరి. వారికి సంపాదనావశ్యకత లేదు. వర్తమానకవులకు ప్రోత్సాహము కావలసియున్నది కాని మన మెప్పుడును తక్కున కవిత్వమునకే తల ఆడించుచుండినచో శుష్కించి పోవుచున్న వర్తమాన కవులమాట యేమి? ఇదియా భాషాసేవ? లైబ్రరీలు కొంతమట్టుకు క్రొత్తకవుల నాదరింపకున్న నవియుండి ప్రయోజనమేమి? వారికి వ్యక్తులవల్ల పోషణము తక్కున. లైబ్రరీలు గూడ ఉచితముగా గ్రంథములు కావలయునన్న వారిగతియేమి? ఒక్కడు నూరు లైబ్రరీల కుచితముగా పుస్తకముల నిచ్చుట కష్టము. నూరు లైబ్రరీలొక్కని పుస్తకములు కొన్నచో వాని కెంతయో సహాయ్యము చేసినట్లుండును.

ఇదివఱకు నెట్టి జ్ఞానము వీనివలన విస్తరింపవలయునో చెప్పితిని. ఇట్లు జ్ఞానము విస్తరించినను దాని నాచరణకు దెచ్చు ధైర్యమును, ఉత్సాహమును ప్రజలకు కలిగింప వలయును. విద్యావంతులు ఈ యాదర్శకములను తమ జీవిత చరిత్రచే నుదహరింప జేయవలెను. విద్యావంతులు మేలైన పద్ధతులలో నడచు కొన్ననే గాని విద్యకు విలువయుండదు. మొదట నేను చెప్పినట్లు ధైర్యమునుగుఱించి యుపన్యాసము జెప్పిన జాలదు. దానిని ప్రకటించుటకు అనుభవము గావలయును. దక్షిణ హిందూస్థానములో మొదటు అభివృద్ధికి

వచ్చినదిగాని చేతలు రాలేదు. దేశభక్తి యందఱ కున్నది గాని దాని నాచరణకు తెచ్చినగదా ఫలితము. లోకలు బోర్డులలో మీ దేశభక్తి దైనందినముగా నెట్లభివృద్ధియగు చున్నదో కనుగొను పరీక్ష కిప్పుడెక్కువ యవకాశ మున్నది. అనగానిప్పుడు మీ సంకల్పముల అనుభవమునకు తేవచ్చును. అదిలేని వట్టి సంకల్పమును జ్ఞానమును నిష్ప్రయోజనము. 1. జ్ఞానమును విస్తరింప జేయవలయును. 2. దాని నాచరణకు తేవలయుననుటే నా యుపన్యాసము నందలి సారాంశము.

# ౮. గ్రంథ పఠనం

ఈ లోకములో నెట్టిమానవునికైన కాల మెల్లవేళల నొక్కటిగ నుండదు. కొన్ని సమయములందు ఆనందాంబుధి నోలలాడు మనుజుడే మరికొన్ని వేళల నిరాశా కష్టముల పాలై దుఃఖసముద్రమున మునిగియుండవలసివచ్చును. సంతోషముతో నుండు కాల మెంతయైనను లెక్కకురాదు కాని, కష్టసమయములందు నిముసమైనను ఏండ్లుగ తోచుచుండును. దుఃఖములపాలైనప్పు డెట్టి వానికైనను ధైర్యము చెడుట సహజము. అట్టివేళల మిత్రులుండినా ధైర్యము చెప్పి దుఃఖము నాపజూతురు. కాని, అట్టి స్నేహితులు సమయమునకు దగ్గరనుండుట తటస్థించవలెను. నీతిదాయకములును, సుబోధకములునగు గ్రంథములు సులభముగ దొరకును. అట్టి గ్రంథముల దుఃఖసమయములందు పఠించిన ధైర్యము నిచ్చి, సంతోషమును గలిగించును. గ్రంథములలో పెక్కుమంది మహావీయులు ఎన్నియో కష్టముల కోర్చి ధైర్యమే ప్రధానముగ గలిగి చివరకు సౌఖ్యముల బడసిరని మనకు దెలియును. నీతిబోధకములగు అటువంటి కథలను జరిపిన ఎంతటి విపత్తులో నుండినను మానవునికి ధైర్యమును, ఎన్నికష్టములొందినను ఇంకను సౌఖ్యముల నొందగలమను ఆశయ కలుగుననుటకు సందియము లేదు. మనవారిలో ననేకులు తమబంధువులకుగాని, మిత్రులకుగాని ఆపదలు వచ్చినప్పుడు దరిజేరి "పూర్వము ఋష్యాదులు సయితము కష్టముల నొందిరి. ఇక మనమా? రానున్న కష్టములు రాకమానవు. ధైర్యముచే నెన్నిపనులనైన సాధింపవచ్చును. చూడుడు! పాండవులు భార్యాసహితులై పద

మూడేండ్లు ఇడుమలపాలైనను చివరకు సౌఖ్యముల నొందిరి." అనిచెప్పి వారి దుఃఖము నాపజూతురు. అట్లితరులు చెప్పు టకుమారు తమరే ఆనీతికథలను జదువుకొనిన, వెంటనే దుఃఖమును మానివైతురు. కావున, కష్టసమయములందు స్నేహితులకంటెగూడ గ్రంధములే ఎక్కువ ఉపయోగకర ములని చెప్పవలెను.

పుస్తకములు చదివినంగాలది యెట్టివానికైనను తెలివి కలుగక మానదు. ఎల్లప్పుడేదియో గ్రంధమును జూచుచుండు టచే మూఢులు సయితము మిక్కిలి తెలివితేటలు గలవారు కావచ్చును. మొట్టమొదట తిన్నగా నాలుగు వాక్యముల సమకూర్పలేని వారయ్యును అనుదినమును గ్రంధముల జదువుచుండుటచే కొంతకాలమైన వెనుక చక్కనిశైలితో గ్రంధముల వ్రాసియు గొప్ప గొప్ప సభలలో ఉపన్యా సము లిచ్చియు పేరుగాంచినవా రనేకులు గలరు. కావున పుస్తకములు విస్తరించి చదువుటచే భాషాజ్ఞానము కలుగు నని తేలుచున్నది.

చరిత్రలు చదివిన పూర్వకాలమున ఎప్పుడే దేశములో జను లెట్టులుండిరో తెలిసికొనవచ్చును. పుస్తకములే లేక యుండిన గ్రీసు, ఇటలీ మున్నగు దేశము లెట్టి యున్నత స్థితి యందుండెనో, ఆయా దేశముల నట్టి గౌరవపదమునకు దీసి కొనివచ్చిన మహాపురుషు లెవ్వరో ఇప్పటివారికి ఏమియు తెలిసియుండకపోవును. అంతియకాక, తమ దేశచరిత్రమును చదువుకొనుచుండినప్పుడు ప్రతివానికిని పూర్వము తమ దేశ మేస్థితిలో నుండెనో తెలిసికొన వీలుండును. అప్పుడే తమ స్థితిని తమ పూర్వులస్థితితో బోల్చుకొనగలిగి, తమ పూర్వులకంటె తామెక్కువ స్థితిలో నుండిన సంతోషించుట

కును, హీనస్థితియందుండిన దుఃఖించి బాగుపడ ప్రయత్నించుటకును వీలుండును. ఇట్లే గణితము, తర్కము, శాస్త్రము మొదలగు విషయముల బోధించు గ్రంథముల చదువుచు వచ్చిన ఆయాశాఖలలో ప్రావీణ్యత చిక్కుననను టకు సందియముండదు.

మిక్కిలి తెలివిగలవారు సయితము కొన్ని సమయములందు ఏమార్గమున బోయిన ఉత్తమమో తెలిసికొనజాలక పలుమారు తప్పుదారుల వెళ్ళి విఫలమనోరథు లగుచుందురు. స్నేహితులుండినను అట్టి సమయములయందు సలహాలనిచ్చి వారికి తోడుపడవచ్చును. కాని, అట్టి సందర్భములలో స్నేహితులకంటెను పుస్తకములు ఎక్కువ సహాయకారులుగా నుండునని చెప్పవలెను. పుస్తకములలో అటువంటి సందర్భములయం దితరు లెట్లు ప్రవర్తించిరో, వారి జయమునకు కారణములెవ్వియో సులభముగ దెలిసికొనవచ్చును. అదేవిధముగ నడచుకొనిన మనముమాత్ర మేల జయము నొందకూడ దనెడు ధైర్యము కలుగును. కావున ఏదియే నొక విషయమునందు మానవుని కేమియు తోచని వేళలలో పుస్తకములు సలహానిచ్చుచుండును.

గ్రంథపఠనము లేకయే విషమసమయములందు సయితము తెలివితో సంచరించగల బుద్ధిశాలురుకూడ ననేకు కలుండనచ్చును. అట్టివారికి గ్రంథపఠనము అనవసరమని చెప్పుట మాత్రము యుక్తియుక్తముకాదు. మొక్క పుట్టినప్పుడు దానినెట్లు కత్తిరించి ఏవిధముగ బెంచిన బాగుండునో కనుగొని, అట్లుచేసినగాని వృక్షమగునప్పుడుచూచుట కింపుగా నుండదు. అదేవిధమున స్వాభావికముగ తెలివిగలవారైనను పుస్తకపఠనము లేనిది వారి తెలివి వన్నెకెక్క నేరదు. గ్రంథములు చదువుటవలన మానవునికి యుక్తా

యుక్త వివేచనాజ్ఞానము కలుగును. మంచిచెడ్డల నెరుగగలిగి నప్పుడే అతని తెలివి యెట్టి సమయములం దుపయోగింపవల యునో ఎట్టి సమయములందు ఉపయోగింపరాదో తెలియ నగును. అవసరమగు-చోటున ఉపయోగించిన తెలివియే తెలివియనబడును. గ్రంథపఠనమువలన తెలివిహీనులు తెలివి గలవారైనట్లు, తెలివిగలవారును వారి తెలివిని ఇంకను వృద్ధిచేసికొనవచ్చును. కావున ఎల్లవారును పుస్తకములు చదువుట ముఖ్యము.

పుస్తకములు చదువునప్పుడు నీతిని బోధించు విషయము లనేకములు వచ్చును. చదువురాని మూఢులు సయితము గ్రంథకాలక్షేపము జరుగుచుండినపుడు అతిశ్రద్ధతో వినుచుందురు. అట్లు వినుటచే గొందరు నీతివంతులు కావచ్చును. కాని వారందరును చదువు నేర్చినవారై నీతిబోధకములగు ఆ పుస్తకములను తామే యెల్లప్పుడును చదువుచుండిన, ఒకప్పుడు కాకుండిన మరియొకప్పుడైనను తాము కూడ నట్లే నీతివంతులై కీర్తినొందవలె ననెడు నిశ్చయము కలుగక మానదు. నిశ్చయమే కలిగిన కార్యాచరణ మతిశీఘ్రముగ నగును. హరిశ్చంద్రుని చరిత్రమును జదివి సత్యమును బలుక ప్రయత్నింపనివారును, శ్రీరాముని కథను విని తండ్రులయెడ విధేయులై యుండ నెంచనివారును మిక్కిలి అరుదు.

చీకటిలోని వస్తువుల బయలుపరచు వెలుతులే కొన్ని వస్తువుల మరుగుపరచును. అట్లే గ్రంథములు సామాన్యముగ మానవుని ప్రవర్తన చక్కజేయుటకు తోడుపడునవైనను, వానిలో దుర్నీతుల బోధించునవి కూడ లేకపోలేదు. అంత మాత్రమున గ్రంథపఠనమే మానివేయవలెననుట మంచిది

కాదు. హంస నీటినుండి పాలను వేరుపరచునట్లు బుద్ధిమంతు లైనవారు సుబోధకములును, నీతిదాయకములునగు గ్రంథములనే గ్రహించి వానినే పఠించుచుండవలెను.

గ్రంథములను జదివి వానిలోని సంగతులను గ్రహించుటయే మానవుని తెలివితేటలు వృద్ధిజేసుకొనుటకు ముఖ్య సాధనమని చెప్పియుంటిమి. అంతమాత్రమున మనము చదివెడు పుస్తకములలో గనబడు ప్రతివిషయమును దీసికొనవలెనని మా అభిప్రాయముకాదు. అనేకపుస్తకములు చదువవచ్చును. పెక్కు విషయములు కనుగొనవచ్చును. కాని ఏ విషయములు గ్రహింపదగునో, ఏవి గ్రహింపతగవో సమయానుకూలముగ నిశ్చయించుకొనవలెను. మంచి విషయములనే గ్రహించి చెడువానిని వదలివేయుచుండవలెను. అట్లు చేయుటకు అనుభవము లేనిది సాధ్యముకాదు. ఇదిమంచిదిదిచెడ్డదని అనుభవముచేతను నిర్ణయింపనగును. కావున, స్వభావజనితమైన తెలివిని వృద్ధిజేసుకొనుటకు సద్గ్రంథపరన మెట్లవసరమో, పుస్తకములలోని మంచిచెడుగుల వేరుపరచుటకు అనుభవమును అట్లే అవసర మగుచున్నది.

పుస్తకములు చదువునప్పుడు సాధారణముగ వానిలోని విషయములు సకారణముగ నున్నవా లేవాయని చూచెదము. కారణయుక్తముగా నున్న విషయములనే గ్రహించి, కారణరహితముగ నున్న వానిని వదలుచుందుము. ప్రతివిషయము నిట్లు పరిశీలించుటచే మనలో కారణముల గనుగొను శక్తి వృద్ధియగును. అప్పుడు ప్రపంచములో మనచుట్టును నుండు పెక్కు వస్తువుల ఉనికిని గూర్చి మనంతటమనము ఆలోచించి యేదియేనొక నిశ్చితాభిప్రాయమును ఏర్పరచుకొన గలుగుదుము. కావున ప్రపంచమునందలి విషయములను

బాగుగ పరీక్షించుటకు మానవునికి పుస్తకములు మిక్కిలి సహాయకారులని చెప్పవచ్చును.

ఏగ్రంథములనైనను నిర్మలమును, నిష్పక్షపాతమునగు బుద్ధితో జదువ నారంభించవలెను. ఒకానొక పుస్తకములోని విషయముల నెల్ల ఖండించవలెననిగాని, లేక దానిలో నుండు నదెల్ల వేదవాక్యములుగ శిరసావహింపవలెననిగాని తలచ రాదు. పచ్చని సులోచనములు పెట్టుకొనినవానికి చూచున దంతయు పచ్చగనె యుండునట్లు, ఖండించుటయే ముఖ్యోద్దేశముగ గలవానికి పుస్తకములో నెట్టి సువిషయము లుండినను అన్నియు లోపములుగనే కనుపించును. లేక భూషించియే తీరవలెననుకొనువానికి మన్నింపరాని దోషములుండినను, వాని నిజస్వభావము తెలియకుండును. సామాన్యముగ చదువరులకును గ్రంథకర్తలకునుగల పరిచితియే దీనికి కారణమని చెప్పవచ్చును. నిజముగ నొక గ్రంథములోని లోపాలోపములను పరిశీలించవెంచువాడు గ్రంథకర్త యెవరైనదియు, తన కాయనయెడగల గౌరవమెట్టిదైనదియు విచారించకుండ వలెను. ఏ పుస్తకము చదివినను దానిలోని విషయముల నెల్ల చక్కగ పరిశీలించి మంచిచెడుగుల విడదీసి, తన శక్తికి మించిన చోట తనకంటె తెలిసినవారి సలహాలను తీసికొని, పిమ్మట ఆ పుస్తకమును గురించి తన యభిప్రాయము నేర్పరచుకొనవలెను. కాని పరులయభిప్రాయమునే అనుసరించిపోవువారి యభిప్రాయముల నితరులు ప్రమాణములుగ గ్రహింపరాదు.

ప్రతివాడును తనకు తెలిసిన పుస్తకములన్నిటిని జదువుటకు వీలుండదు. అట్లు చదువుటయు యోగ్యముకాదు. ఇతరుల సహాయమువలనగాని తాను స్వయముగ ఆలోచించిగాని తనకు మిక్కిలి ఉపయోగములుగనుండు పుస్తక

ములనే చదువుట ప్రయోజనము. అట్లు వేరుపరచిన పుస్తకములలో నయితము అక్కడక్కడ అనవసరములగు భాగములు కొన్ని యుండవచ్చును. యుక్తా యుక్తముల నెరుగగలవాడు వాని నెల్ల చదువుచు కాలమును వృధ పుచ్చడు. ఒకానొక శాఖయం దభిరుచి కలవాడు. ఆ శాఖలో తన యభివృద్ధికి తోడుపడు పుస్తకములనే చదువుట మంచిది. గణితమునం దెక్కువ రుచిగలవాడు చరిత్రలు చదువు చుండిన తానొకడపటి శాఖలో సంపాదింపగలుగు విద్య స్వల్పమగుట యేగాక, తనకభిరుచిగల శాఖలో నుండు విద్యకూడ క్షీణించిపోవును. పాఠశాలలో బాలురకు విద్యగరపునపుడీ విషయమును ముఖ్యముగ గమనింపవలెను. ఏ బాలునికి ఏ శాఖలో ఎక్కువ రుచిగలదో తెలిసికొని, ఆశాఖయందే వాని కెక్కువ పరిశ్రమ యుండునట్లు చేయవలెను.

సామాన్యమానవులు మాత్రము తమ కెక్కువగ ప్రపంచజ్ఞానము నిచ్చుపుస్తకములనే చదువు చుండుట మంచిది. వారి కన్నివిషయములందును కొంచెమో గొప్పయో జ్ఞానముండుట అవసరమగుటచే వారికనుకూలమగు గ్రంథములనే జూచుచుండవలెను.

గ్రంథపఠనము కాలమునుబట్టికూడ మారుచుండును. దుఃఖసమయములందు సంతోషమును కలిగించి ధైర్యము నొసగు పుస్తకములనే చదువవలెను మనోవ్యధను కలుగ జేయు పుస్తకముల నట్టి సమయములందు తలచనే కూడదు. మనసెక్కువ పనిచేసియుండినప్పుడు, ఆ బడలికనుతీర్చునట్టి హాస్యరసముగల పుస్తకములు తప్పమనస్సునకు శ్రమనిచ్చెడు పుస్తకములను చదివి మరింత బాధ కలుగ జేసికొనుట యుక్తముకాదు.

పుస్తకము లెట్టివైనను చెడగొట్టక జాగ్రత్తగ కాపాడుట యెల్లవారికిని విధియైయున్నది. పుస్తకములు గ్రంథకర్తయొక్క మనోసామర్థ్యముల గనబరచును. అట్టియెడ గ్రంథకర్త మృతినొందినను ఆయన గ్రంథములు మాత్రము చెడకుండయుంచిన ఆయన శక్తి తరతరముల వరకును తెలియుచుండును. అంతియకాక కాల మెల్లప్పుడు నొక్కటిగ నుండదు. కాలముతో పాటు ప్రజల రుచులుకూడ మారు చుండును. అందుచే ఒకానొక కాలమునకు పనికిరాని త్రోసివేసిన పుస్తకములు సయితము మరియొక కాలమునకు మిక్కిలి ఉపయోగకరములుగ నుండవచ్చును. కావున పుస్తకములా కాలమునకు పనికిరాకుండినను, వానినంతతో అంతమొందింపక శ్రద్ధతో దాచియుంచవలెను.

# ౭. పుస్తకము చదువుట

— గాడిచర్ల హరిసర్వోత్తమరావు

'పుస్తకము చదువుట' అనే ఆచారము మన దేశములో కొంతకాలము క్రిందటివరకు సర్వసామాన్యంగా ఉండింది. కొంత అక్షరజ్ఞానము అలవడిన పిల్లలకు అవి జారిపోకుండా అభివృద్ధి కావడానికిని, అందరికీ హృదయాకర్షకంగా ఉండు భాగవత, రామాయణ, భారతాది గ్రంథసామగ్రి ప్రచారంలో ఉండడానికిని ఈ ఆచారం ఏర్పడి యుండేది. ఆకాలంలో వాఙ్మయమంటే పద్యకావ్యాలనే భావము. దాని లోను భాగవతానికి విస్తారప్రచారము. అందులోను గజేంద్ర మోక్షము, రుక్మిణీకళ్యాణము, ప్రహ్లాదచరిత్రలకు అగ్రస్థానం. సాధారణంగా వినికిడి ఉండడంచేత. అంతేకాదు, కొన్ని కొన్ని పద్యాలు అదివరలోనే ప్రార్థనరూపకంగా, ఇతరత్రా వల్లించడం రూపకంగా కంఠోక్తియయి యుండడంచేత చదువను ఆరంభించినవాండ్లు చాలా చిన్నవయసులోనే ఈ గ్రంథాలు ముందిడుకొని రాగయుక్తంగా పద్యాలు చదివేవారు. వారు చదువుతుంటే ప్రక్కనున్న అనుభవజ్ఞులైన పెద్దలు తాత్పర్యం చెపుతూ వ్యాఖ్యానాలు చేస్తూ ఉండేవారు. ఆసక్తికల వారు, మరి ఇతరులు వినడంకూడా ఉండేది.

చదువుల పద్ధతులు మారడంచేత, నాగరికాలు ముదరడంచేత ఆ 'పుస్తకం చదివే' ఆచారం అంతరించింది. ఈ ఆచారంలోని సూత్రాలు గ్రహించి నేటికీ దీనికి సదవకాశం కలుగజేయడం జరుగదగిన పనులలో ఒకటి. అక్షరాలు అభ్యసించి త్వరలో చదవడం నేర్వదగినదని అందరినీ ప్రబోధించే ఈప్రజాయుగంలో అట్టి సదవకాశం ఏర్పడుతుం

దనే నా నమ్మకము. వయోజనునికి అక్షరం నేర్పడానికి అత నిని ఆకర్షించవలెగదా! అందుకు పాటలు, పద్యాలు విని యోగపడి తీరవలెను. ఆపాటలు, పద్యాలకు సంబంధించిన వాఙ్మయమునే వారికి 'చదువుగోష్ఠుల' క్రింద, రీడింగుసర్కిలులనే నవీనాచారముక్రింద నిర్ణయింపవచ్చును.

'పుస్తకము చదవడం' అనడాన్ని ఈమాత్రము అర్థముతో ఈనేటి కాలంలో పూర్తిచేయడం వీలుకాదు. నేడు వయోజనులయిన వారికి అనంత ముఖాల విజ్ఞానము అవసరమయినది. ముద్రణ కార్యాలయాలనుంచి వేనవేలు గ్రంథాలు అచ్చయి బయటపడుచున్నవి. భౌతిక శాస్త్రములు, వృత్తివిద్యలు, కళలు, దేహారోగ్యము, రాజకీయ ఆర్థిక సాంఘిక విషయాలు-అన్నిటిలోను ప్రజాసామాన్యానికి అభిరుచి కలుగుచున్నది. ఆయభిరుచిని తీవ్రంగా కలిగించి వ్యాపింప జేయడము దేశ హితుల ముఖ్య కర్తవ్యముగా ఏర్పడియున్నది. ఈ కార్యము సాధించడానికే గ్రంథాలయాలు ఏర్పడుచున్నవి. ప్రతియూరను ఏర్పడవలసి యున్నవి. విశ్రాంతిగా కాలము పుచ్చడం కొరకు చదువుకొనువారు, తమ స్వాభిరుచులను తీర్చుకొనడానికి చదువు కొనువారు, తమకుండే వృత్తి కౌశలాన్నిగాని కళాకౌశలాన్నిగాని పెంపు చేసుకోవడానికి చదువుకొనేవారు వగైరా అన్నిరకముల వారును గ్రంథాలు చదవడము అవసరమగుచున్నది. ఒకే విషయమును గురించి వందలపుటల గ్రంథాలు వేనవేలుంటే తాను కోరిన సంగతి కనుగొనుటకు-ఒక్కొక్కప్పుడు చాల చిన్న సంగతే కావచ్చును-ఇంత సముద్రంలోను మునిగి అవస్థ పడవలసిందేనా? అనేది ప్రశ్న. పుస్తకమంటేయేమో, అందులో ఏయే బాపతు తెలివిడి ఉంటుందో, ఫలానా విషయము కావలెనంటే ఫలానాచోట వ్రేలుపెట్టి తీయవచ్చును

అనే సంగతి తెలిసి ఉంటే ఈ ప్రశ్న కలుగనే కలుగదు. అట్లు తెలిసికోడానికి నేటి దినము చదువరికి తగినంత సహాయం గ్రంథంలోనే ఉండవలెననే నీతి గ్రంథకర్తలు, ప్రచురణ కర్తలు అంగీకరిస్తున్నారు.

## ముఖపత్రము

అచ్చయిన ఏ పుస్తకం తీసుకొన్నా ఎంత కాలం క్రిందట అచ్చయినదయినా, ముఖపత్ర మొకటి ఉంటుంది. దాని మీద పుస్తకంపేరు, గ్రంథకర్త పేరు, ఒక్కొక్కప్పుడు సంపాదకునిపేరు, ప్రచురణ కర్తలపేరు, ముద్రాపకులపేరు, ముద్రించిన స్థలము, ముద్రించిన సంవత్సరము, వెల, ఈ వివరాలన్నీ ఉంటాయి. వీటిలో కొన్నిటినిగాని అన్నిటినిగాని అట్ట మీద వేసి అన్నిటినిలో ముఖపత్రమునందు వేతురు. చదువుకొనే వారికి కొందరు గ్రంథకర్తలంటే, ప్రచురణకర్తలంటే ఎక్కువ గౌరవముంటుంది. అట్టివారి పేరు లేకపోతే వెంటనే ఆ గ్రంథాన్ని దూరము నెట్టి ముందుకు సాగవచ్చును.

నేటి పరిస్థితులలో అచ్చైన సంవత్సరము చాల ముఖ్యమగుచున్నది ఉదాహరణం తీసుకోండి. ఆకాశ విమానాల సంగతి చదువదలచిన వారికి నిన్న నేడు వ్రాసిన గ్రంథాలే ముఖ్యము. 20 ఏండ్ల క్రిందట వ్రాసిన గ్రంథంలో ఏమీ ఉండదు. ఈ 20 ఏండ్లలోనే ఏడాదికేడాదికి ఎంతో ఎక్కువ అభివృద్ధి అయిపోయింది. కాబట్టి సంవత్సరం చూచుకొంటే ఎంత దగ్గర సంవత్సరమయితే అంత మేలని ఆ గ్రంథ ముపయోగింపనగును. గ్రంథము తాను సంపాదించ దలచిన వానికి ఇతర వివరాలు ఆవశ్యకము. అయిన కూర్పులు, వాని సంవత్సరాలు, ముద్రాపకుల పేరు, ఆ కూర్పునందు అచ్చువేసిన

ప్రతుల సంఖ్య వగైరా కొన్ని వివరాలు లోముఖపత్రానికి వెనుక వైపున అచ్చువేయడ మిప్పుడిప్పుడు ఆచారమవుతున్నది.

## పీఠిక

లోముఖపత్రమునకు, తరువాత ప్రతి గ్రంథము లోనూ "పీఠిక" అని గ్రంథకర్త వ్రాసే కొద్దిపాటి వ్యాఖ్యాన మొకటి సాధారణంగా ఉంటుంది. అందులో గ్రంథకర్త గ్రంథము వ్రాయడానికి హేతువేమి కలిగినదో, ఎవరు తన్ను ప్రోత్సహించినారో, ఎవరెవరికి తాను గ్రంథము తయారు చేయడములో ఋణపడి యున్నాడో వగైరాలు వ్రాసి వందనాలు కూడ చెల్లించడము కలదు. ఇట్టి పీఠికలో కొందరు కొందరు తమకు సాయపడిన ఇతర గ్రంథాలు-చాల కొద్ది సంఖ్యగా ఉంటే ఏవో తెలుపడంకూడా ఉంది.

ప్రతి కూర్పుకు పీఠిక వ్రాసే అలవాటు ఉంది. కూర్పుకు కూర్పుకు మధ్యా విజ్ఞానం ఆ గ్రంథవిషయమున క్రొత్తదీ పెరిగి ఉండవచ్చు. లేదా అసలు గ్రంథకర్త అనుభవములు విస్తారతరమయి యుండవచ్చు. మొదటి కూర్పులో కంటె గ్రంథము పెరిగి యుండవచ్చు. పూర్తిగానే మారి యుండవచ్చు. తోడ్పడినవారు వేరయి యుండవచ్చు. ఇట్టి వన్నిటిని తెలియపరుస్తూ "రెండవ కూర్పునకు పీఠిక" 'మూడవ కూర్పునకు పీఠిక' అని వ్రాస్తూ వస్తారు.

## ఉపోద్ఘాతము

పీఠికకు తరువాత పుస్తకాలలో చాలవరకు కానవచ్చేది "ఉపోద్ఘాతము" కొందరు గ్రంథకర్తలు "పీఠిక" అనేది వ్రాయక అందు రాదగిన విషయాలను "ఉపోద్ఘాతము"

లోనే చెప్పివేయడం కలదు. మరి కొందరు గ్రంథకర్తలు తమ గ్రంథములో క్రొత్తపోకడ లవలంబించి యుంటే, లేదా గ్రంథనిర్మాణంలో క్రొత్త సూత్రాలు వేసుకొని ఉంటే, లేదా ప్రకటించే గ్రంథము ప్రాతకాలమునాటిదయి కవి, కావ్యమూలను గురించి చెప్పదలచివుంటే, లేదా తమచరిత్రే తెలుపదలచుకొంటే "ఉపోద్ఘాతము" వ్రాసుకొందురు. ఈనాడు "ఉపోద్ఘాతాలు" అను భాగాలను గ్రంథకర్తగాక సంపాదకుడో లేదా మరిఇతరులో వ్రాయడం పరిపాటియయి నది. అందులో గ్రంథకర్త ప్రశంస, గ్రంథకాల ప్రశంస ఉండడము సాధారణాచారము. "మున్నుడి", "తొలిపలుకు", "ఒకమాట", "ఇంట్రో" ఇటువంటి శబ్దసృష్టి ఇటీవల జరిగినది. ఇవి "పీఠిక"కుగాని "ఉపోద్ఘాతము" నకుగాని అన్వయించు చున్నవి.

పీఠికను, ఉపోద్ఘాతమును చదివితే సామాన్యంగా గ్రంథములో విషయమేమిటి? గ్రంథకర్త ఎట్టివాడు? అతని అభిప్రాయాలు ఏ మార్గములో నడచినవి? అతడు పండితుల కొరకు వ్రాసినాడా? పామరులకొరకే వ్రాసినాడా? వగైరా తెలిపోవును. ఇందులో ఏది తనకు నచ్చకున్నను చదువరి ఆ గ్రంథము నవతలబెట్టి మరి తన యభిరుచికి అనువయిన గ్రంథాన్ని వెతుకుకొనవచ్చును.

పీఠిక, ఉపోద్ఘాతాల ఉద్దేశాలు మన ప్రాచీన వాఙ్మయములో "అవతరణిక" గ్రంథకర్త, కృతిపతివంశాదిక వర్ణనము వగైరాలతో తీరుచుండినది.

# విషయానుక్రమణిక *

ఉపోద్ఘాత మయిన వెనుక విషయానుక్రమణిక అచ్చువేయుట ఆచారము. ఇందులో గ్రంథములో ఏమేమి విషయాలను గురించి వ్రాసియున్నదీ కొంత వివరం తేలుతుంది. ప్రతిపుస్తకమును అధ్యాయాలుగానో, ప్రకరణాలుగానో, ఆశ్వాసాలుగానో విభాగించి ఉంటారు. కొందరు గ్రంథకర్తలు అధ్యాయాదుల సంఖ్యనిచ్చి దానిదానికి తామిచ్చిన శీర్షికలను మాత్రము ఈ విషయానుక్రమణికలో చేర్చడం సాధారణ పద్ధతి. కాని యిటీవల ఈ పద్ధతి కొంత మారుతూ ఉంది. అనేకులు గ్రంథకర్తలు, ప్రచురణకర్తలు ఈ అధ్యాయాదికాలలో మధ్యేమధ్యే విషయాన్నిబట్టి తామిస్తూవచ్చు ఉపశీర్షికలను విషయానుక్రమణికలో విపులంగా చేరుస్తున్నారు. శ్రీ దిగవల్లి శివరావుగారు ప్రకటించిన ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్రచరిత్రలోనేమి, శ్రీ గోటేటి జోగిరాజుగారు ప్రకటించుచుండే వ్యవసాయ గ్రంథాలలోనేమి ఈ ఏర్పాటు చాలా చక్కగా అమర్చినారు. దీని ఫలితం చదువరికి చాలాముఖ్యము. చెఱకుపైరుచేసే చదువరి అనుకొందాం. ఎముకలఎరువు ఈ పంటకు వేయవచ్చునా? అనేప్రశ్న అతనికి తట్టింది. "ఎరువు" అనే శీర్షికక్రింద ప్రకరణమంతా చదువనక్కరలేకుండా ఎరువుకు సంబంధించిన విషయానుక్రమణిక చూడడముతో అతనికి కాలహరణంలేకుండా సంగతి తేలిపోతుంది. "అకారాది సూచి" వేయని గ్రంథాలలో- మనదేశభాషలలో అకారాది సూచి లుండడము సర్వసాధారణంగా అలవాటు కాలేదు. ఇట్టి విపులవిషయానుక్రమణికలు చదువరికి చాల

---

* 'విషయసూచిక' ప్రచారములోనున్న పదము

సహాకారులు. గ్రంథకర్తలీమార్గాన్ని అనుసరించడము అత్యా వసరంగా తోచుచున్నది. ఈవిధంగా గ్రంథాదినే విస్తార విష యాను క్రమణిక వేయడం మనపురాణాదులలో ప్రాచీన కాలమునుంచి వచ్చినది. భారతభాగవతాదులేవి తీసుకొన్నా ఆశ్వాసము సంఖ్యయిచ్చి ఏయే కథలు, నీతులు వగైరాలు అం దులో వరుసగాయుండునో వివరించియుందురు. ఇట్టిఏర్పాటు ప్రబంధాలలో లేదు; అవశ్యకముకాదు కాబోలు. ఇంగ్లీషు మొదలగు భాషలలోను కావ్యనాటకాల కిట్టి ఏర్పాటుండదు. నవలకును విస్తారత విషయ వివరణ వీలుకాదు. ఈ సందర్భ మున మన పూర్వ వాఙ్మయములో మరియొకచక్కని ఏర్పా టటనట గలదు. భారతము ఆరంభములోనే భారతకథ అంత టినీ సంక్షేపముగా చెప్పినారు. మరికొన్ని చోట్ల పూర్వకథ సంక్షేపించి చెప్పడము కానవగును. విషయానుక్రమణికకు ప్రాణము వివరములకు ఎదుటిప్రక్కన వచ్చునట్టి పుటల సంఖ్య. దానినిబట్టి ఏసంగతి ఎచ్చటనున్నదీ ఎక్కువ తడుము కోకుండ కనిపెట్టవచ్చును.

## చిత్రపటముల పట్టిక

చిత్రపటములు చేర్చియుండే గ్రంథములలో వీటి పట్టి కను-ఏపుటలో ఏపుట కెదుట ఏ పటమున్నదను వివరా లతో-ఇత్తురు. ఇచ్చుట ఆవశ్యకము. "గంప్రడ గుద్దలి" అనే ఉపకరణము వ్యవసాయములో ఉపయోగ పడుతుంది. చదు వరికి దాని స్వరూపము తెలియవలెను. జోగిరాజువంటి వారి వ్యవసాయ గ్రంథములలోని ఈ చిత్రపటముల పట్టికను చూచుకొంటే పనికుదరవలె. అవసరమయినచోట ఆ పట ముల క్రిందనే దాని వివర మెచ్చటకలదో గ్రంథము పుట సూచించడ మావశ్యకము. నేడు పాశ్చాత్య సీమలలో చిత్ర

పటాల కీరితి వివరణ లిచ్చుచున్నారు. చిత్రపటములకు విషయ వివరణము నందు చాల ప్రాముఖ్యము కలుగుచున్నది.

## మూలగ్రంథముల జాబితా

కథలు, కల్పనలు, కావ్యము లేవో కొన్నిట దక్క గ్రంథకర్త వ్రాసే విషయమంతా అతని బుర్రలో నుంచే పుట్టుక రావడములేదు. ఇదివరలోని మూలగ్రంథాలు, ఇతరులు చేసిన పరిశోధనలు, వ్యాఖ్యానాలు ఎక్కువగా ఉపయోగించుకొనకుండా తప్పదు. అట్టి గ్రంథాలు, వ్యాఖ్యానాల జాబితాలివ్వడము, ఆయా రచయితలకు కృతజ్ఞత చూపడానికవసరమనడము నీతికి సంబంధించినది. చాలమంది గ్రంథకర్త లానీతి కనుబరచరు. అది యెట్లున్నా చదువరి కృషి కొరకట్టివివరము చేర్చడము గ్రంథకర్త ధర్మమని కనిపించుతుంది. ఎందువల్లనంటారా? గ్రంథకర్త వ్రాసిన విషయము గ్రహించి ఆవిషయములోనే ఇంకా యెక్కువ విజ్ఞానం సంపాదింపదలచినా, లేదా గ్రంథకర్త వ్రాతచే తనకుండే సంశయము చదువరికి తీరకపోయినా అతడు మూలగ్రంథాల నవలోకించి తనమనస్సంకల్పాన్ని తీర్చుకొనవచ్చును. అట్టి సహాయము తాను చేయక తన సర్వజ్ఞత్వమును చదువరి అంగీకరింపవలె ననడము గ్రంథకర్తకు ధర్మముగాదు. ఆ విషయమున తెలుగులో బోగిరాజుగారెన్నదగియున్నారు. తాము విషయము వ్రాసేటప్పడే వాక్యము పూర్తికాగానే ఒక అంకె గుర్తువేసి మూలగ్రంథాల జాబితాలో అదే యంకెగల వ్రాత తమ కాధారమని సూచించుచు పోయినారు. తాము పరిశోధన చేయని చోట ఇది తాము పరిశోధించిన విషయము కాదని తెల్పినారు.

మూలగ్రంథములజాబితాను కొందరు గ్రంథాంతమున ఇచ్చుటయు గలదు.

## అకారాది సూచి లేక అనుక్రమణిక

ఈ తంతంతా ముగిసిన పిదప గ్రంథ మారంభ మవుతుంది. కాని అసలు గ్రంథభాగమును గురించి చెప్పుటకు ముందు "అకారాది సూచి"ని గురించి వివరింపదగును. దీనిని గ్రంథాంతమున ప్రకటించుట యాచారము. ఇంగ్లీషు వగైరా పాశ్చాత్య భాషలలో ఇది సర్వేసర్వత్ర వాడుకయందున్నది. దీనివల్ల ప్రయోజనము గొప్పది. 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' అనునది ఆంగ్లభాషలో మహత్తమమైన విశ్వకోశము. ఇప్పుడు దాని సంపుటముల సంఖ్య 36. ప్రతి సంపుటమున రమారమి 1000 పుటలుండును. ఇందులో విషయ శీర్షికలు అకారాదిగా ఏర్పడియున్నవి. కాని ఇన్ని సంపుటాలలో ఏ విషయ మెక్కడ నున్నదో తెలియడం కష్టము. ఒకొక్క వ్యాసము దీర్ఘంగా ఉండి అందులో ఎన్నో ఉప శీర్షికల క్రింద వేరువేరు వివరాలుండడము కలదు. అంతే కాదు. ఇందులోని వ్యాసా లెంత సమగ్రంగా వ్రాసినా పరస్పర సంబంధముకల సంగతులు అనేక శీర్షికల క్రిందరావడము సంభవించుతుంది. దేశాన్ని గురించి వ్రాసే వ్యాసకర్త ఆ దేశ వాఙ్మయాన్ని గురించి సంక్షేపంగా వ్రాసి యుంటాడు. వాఙ్మయమును గురించి వ్రాసే వ్యాసకర్త ఇతర వాఙ్మయాలతో దానినిపోల్చి దేశానికి ప్రాముఖ్యమిాయని రీతిని వ్రాసి ఉంటాడు. ఒకవ్యాసకర్త ముఖ్యము కాదనుకొన్న సంగతులు రెండవవ్యాసకర్త ముఖ్యమని విపులీకరించి ఉంటాడు. అంతే కాదు,ఒక మహద్విషయమునుగురించి వ్రాసేటప్పుడు ప్రాస్తావికంగా అనేక విషయాలు అందులో కలిసిపోయి యుండును. ప్రాస్తావికంగా దొర్లినమాటలే ఒకొక్కప్పుడుచాల విలువ

గలవిగా ఉండవచ్చును. ఈ కారణములచేత ఏముఖ్యపదము, ఏ విషయము, ఏ వ్యాసములో నమోదైనది తెలియగలిగితే చదువరి తప్పకుండా దానిని చూడవలెననే అభిలాష కల వాడవుతాడు. కాబట్టి 'అకారాది'గా ఉండే ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికాకు మళ్ళీ అకారాదిసూచి ప్రత్యేక మొక సంపుటము. అంటే 5,6 వందలపేజిల గ్రంథము ఏర్పడియున్నది. ఇందులో యిచ్చే ఆచూకీ చాలా బాగుంటుంది. ఈ సంపుటాములోని సూచిలో ఒకపదంతీసి చూస్తే అదిఏయేసంపుటములో ఏయేపుటలో తటస్థించేదీ తెలుస్తుంది. ప్రతిపుటలోను రెండు కలములుగా గ్రంథము అచ్చయి ఉన్నది. ఆ రెండుకలాలను నాలుగు భాగాల క్రింద ఆలోచించి ఎ, బి, సి, డి అని ఎడమ కాలం పై సగము ఎ, క్రింది సగము బి, కుడికాలం పై భాగము సి, క్రింది సగము డి, అని సంకేతాలేర్పరచి, ఆ నాలుగు సగాలలో ఏ సగంలో చూడవలసింది కూడ సూచించుతారు. మరి సూచించిన స్థలంలో ఆ పదము సందర్భమున ఏ వివరముందో టూకీగా వ్రాస్తారు. "ఇండియా" అనే పదం క్రింద సంపుటము 8 పుట 359 భాగము 'ఎ' అని ఉంటుందనుకోండి. అచ్చట "బరుకుబిల్లు" అని వ్రాస్తారు. అంటే ఆవివరముందని తెలుస్తుంది. ఇంత చక్కని ఆచూకీ దొరికినప్పుడు చదువరి వేల కొలది పుటల గ్రంథాన్ని తన పనుల కెంత సులభంగా వినియోగించుకోవచ్చునో వేరే వర్ణించవలసిన పనిలేదు. అన్నిటిలోను ఇంత విస్తార ప్రయత్న మక్కరలేకున్నా, సాధారణంగా ప్రతి ఇంగ్లీషు గ్రంథంలోను ఇటువంటి "అకారాది సూచి" ఉంటుంది. మనభాషల గ్రంథాలలో ఇది ఉండడము చాలా అరుదు. భగవద్గీతాది సంస్కృత గ్రంథాలలోని శ్లోకాల మొదటి పదాలకు అకారాది సూచీ ప్రకటించడము కలదు. దానియనుకరణంగా ఇటీ

వలె శ్రీ వేదము వేంకట రామశాస్త్రి గారు ఆముక్త మాల్యదేత్యాది గ్రంథాలకు తెలుగున పద్యాల సూచీ ప్రకటించినారు. అకారాది సూచీ నాకు ఎరుకయున్నంతవరకు చాలా చక్కగా ఇటీవల ఏనుగుల వీరాస్వామయ్యగారి 'కాశీ యాత్ర చరిత్ర' ప్రకటిస్తూ శ్రీ దిగవల్లి వెంకట శివరావు గారు చేర్చినారు. అంతకు మించి మరి ఏ గ్రంథకర్తగూడ అకారాది సూచీ ఇచ్చుటలేదు. ఇది తెలుగు గ్రంథకర్తలు జాగ్రత్తగా ఆలోచింపదగిన విషయము.

సహాయభూతమైన ఎన్నిహంగులు కుదిరినా, చదువరి అసలు గ్రంథము చదివితే పొందగల ఫలము ఇతరత్రా పొందగలడనము కుదరదు. కాని మహత్తమంగా గ్రంథాలచ్చవుతుండే ఈ దినాలలో అన్ని గ్రంథాలు మేమెక్కడ చదువుకొందమనేవారు ఉండకతప్పదు. వీరికేమి సలహా? అయ్యా, కొన్ని గ్రంథాలైనా మొదట చక్కగా చదువుకోండి. అంతవరకు మీదృష్టి అక్షరాలు, పదాలమీద త్వరగా ఆనడము, ఆనడముతోనే అచ్చటి భావము మెదడుకు స్ఫురించడము స్ఫురించడముతోనే, రచయిత ముందు కేమి చెప్తాడో ఊహించుకోవడము, ఆ ఊహతో ముందు వాక్యాల చదువు గబగబా పరుగెత్తడము సంభవింపదు. ఇది కొంతవరకు సంభవము చేసుకొంటే వేల పేజీల గ్రంథాలను కూడా గంటల కాలంలో త్రిప్పివేసి మీరు పట్టుకోదగిన అంశము అందులో ఎక్కడుందో కనిగొని వివరంగా దాన్ని చూచుకొనే అవకాశం కలుగుతుంది. సాధారణంగా చక్కగా వ్రాసిన గ్రంథాలలో-ఇది భావకవిత్వాలకు, ప్రబంధాలకు కథలకు అంతగా అన్వయింపదు-విషయము పేరాలు పేరాలుగా విడదీసి యుంటుంది. సాధారణంగా ఒక్కొక్క పేరాలో ఒక్కొక్క భావము విపులీకృతమై ఉంటుంది. పైన

చెప్పిన రీతిని త్వరగా చదివే అలవాటు పడినవారు పేరాలోని మొదటి వాక్యము తుదవాక్యములమీద కన్ను ఆనడంతో అందులో తమకు కావలసిన భావవస్తువు దొరికిందా లేదా అనేది నిర్ణయించి. ముందుకు కంటిని పరిగెత్తించగలరు. నేటి దినము చదువు అభ్యాసం అనేదానిలో ఉన్నంతలో ఉన్నతమైన మెట్టు ఇది. ఈ మెట్టెక్కిన చదువరికి పైపాంగంతా కొంతవరకు పనికివచ్చినా ఈ త్వరిత స్ఫురణ శ్కి మహాత్తముముగా ఉపయుక్త మవుతుంది.

గ్రంథమెందుకుంది? మీ ఉపయోగంకొరకు; బీరువాలోనే పెట్టడానికి కాదు. దాని బైండింగు సౌందర్యము, బంగారునీటి అక్షరాల సౌందర్యము చూచిచూచి ఆహాహా! గ్రంథాన్నెంత చెదరకుండా మాయకుండా పెట్టినామని మురిసేటందుకు కాదు. పైవిధంగా అన్ని ఉపకరణాలను ఉపయోగించి త్రిప్పిత్రిప్పి పలుమారు పలువురు చదివి జీర్ణం చేసుకోవడానికే గ్రంథం. ఈ ప్రయత్నంలో గ్రంథము జీర్ణమయినా నష్టంలేదు. క్రొత్తదిమళ్ళీ సంపాదింపవచ్చును. చనునకుండా దాచుకోడానికి గ్రధాలేల?

# ౮. దేవాలయములు :

## గ్రంథాలయములు

### ఆగమం-అనుభవ ప్రమాణములు

— శ్రీ పీతాంబరం వెంకటకృష్ణమాచార్యులు

౧. దేవాలయమును పవిత్రమగు [ఉన్నతమగు] స్థానము నందు కట్టవలెను. గ్రంథాలయభవనము గ్రామమందలి భవనములకంటే మిన్నగా నుండవలెను.

౨. చీకటియందు వెలుతురును చూడవలెనను ఉద్దేశముతో గర్భాలయము చీకటిగ నుండునటుల నిర్మింపవలెను. అజ్ఞానతిమిరమును పారద్రోలి విజ్ఞానజ్యోతిని ప్రకాశింపజేయుటకే గ్రంథాలయ పేటికల యందలి గ్రంథరాజములు నిక్షేపింపబడవలెను.

౩. దేవళమునకు అంటువ్యాధులు గలవారు పోగూడదు. గ్రంథాలయమును వీరట్లే ప్రవేశింపరాదు.

౪. దేవాలయమందు చుట్ట, బీడి మొదలగునవి త్రాగరాదు. గ్రంథాలయమునందును నివి వర్జనీయములే.

౫. స్నానము చేయనిదే దేవాలయమునకు పోరాదు. నిర్మలుడయ్యే గ్రంథాలయమునకు పోవలెను.

౬. దేవాలయములందు త్రికాలార్చన జరుగవలెను. గ్రంథాలయములందును అన్నివేళల గ్రంథపఠనము జరుగుచుండవలెను

౭. దేవాలయములం దవిచ్ఛిన్నముగ అఖండ దీపారాధన వెలుగునీయవలయును.

గ్రంథాలయములందు విజ్ఞానజ్యోతి విడువకుండ ప్రకాశించవలెను.

౮. దైవచింతనవినా ఇతర సంభాషణలు దేవళమందు చేయరాదు.

జ్ఞాన సముపార్జనకు వ్యతిరేకమగు సంభాషణలు గ్రంథాలయమందు పనికిరావు.

౯. దేవాలయము విద్యావంతులకు కల్పతరువు (పోషించునది)గా నుండవలెను.

గ్రంథాలయము విద్యావంతులను తయారుచేయు కళాశాలగా నుండవలెను.

౧౦. దైవారాధనకు పరిమళముగల పుష్పములే వాడవలెను. గ్రంథాలయము సద్గ్రంథములనే ప్రచారము చేయవలెను.

౧౧. దేవాలయము నృత్యగీత వాద్యాది వివిధ కళల కుపకరించు మంటపముతో విరాజిల్లుచుండవలెను. గ్రంథాలయము సమస్తకళలకు సంబంధించి శాస్త్ర గ్రంథములతో నిండియుండవలెను.

౧౨ సర్వజన సమ్మేళనమునకు దేవాలయము కేంద్రస్థానముగ నుండవలెను.

సర్వమానవ సౌభ్రాతృత్వమును గ్రంథాలయము పెంపొందించవలెను.

౧౩. దైవసేవకు భక్తి, శ్రద్ధ ముఖ్యము.
గ్రంథాలయసేవకు యుక్తి, నిలకడ అవసరము.

౧౪. సాత్త్వికుడై జగత్కల్యాణము కొరకు పాటుబడుటయే దైవారాధకుని విధి.

సర్వజ్ఞుడై సర్వప్రపంచమును ప్రేమించుటయే గ్రంథాలయారాధకుని విధి.

# ౯. గ్రామప్రజలు - గ్రంథాలయాలు

— శ్రీ గోటేటి జోగిరాజు

ఆంధ్ర దేశమున గ్రంథాలయములున్న గ్రామముల సంఖ్య బహుస్వల్పముగ నున్నది. మన గ్రంథాలయముల సంఖ్యను, వీని ఉపయోగమును పెంచవలసిన అవసరమెంతేని గలదు. వీలగునన్ని గ్రామాలలో గ్రంథాలయములను నెలకొల్పుటయేగాక యవి గ్రామప్రజలకు తగినంత ప్రయోజనకరములుగ నుండునటుల జేయుటకు గూడ గ్రంథాలయోద్యమ వ్యాపకులు శ్రద్ధవహించవలసి యుండును. గ్రంథాలయము ఉపయోగము పాఠకుల సంఖ్యను బట్టియే గాక, వారల కవి కలుగజేయు నీక్రింద వివరింపబడు మూడు విధములగు మేలునుబట్టి కూడ నుండును.

### 1. పాఠకుల మనసును రంజిల్ల జేయుట

గ్రామస్థులు పనిపాటలు చేసి విశ్రాంతిగా నున్నపుడు వార్తా పత్రికలు, కథల పుస్తకములు, నవలలు, ఇతిహాసములు మొదలగునవి చదువుచో గొంత చిత్తవిశ్రామము, శాంతియు, సంతోషమునగలిగి సేదదీరును. భాషయం దభిరుచిగల చదువరులకు చదువు విషయములే గ్రంథమునందలి భాషా చాతుర్యమును, భావ సౌందర్యమునుగూడ నాహ్లాద మొనగూర్చును. తొలుత పాఠకుల నాకర్షించుట కిట్టి వాఙ్మయమే మెక్కువగ దోడ్పడును. గ్రంథాలయ నిర్వాహణకు నిట్టి వాఙ్మయమును సేకరించుటలో అశ్లీలతను, నైచ్యభావమును పెంపొందించు పత్రికలు, నవలలు మొదలగు వానిని పరిశీలించి త్యజింపవలెను.

## 2. పాఠకులు తమ ఆర్థి కారోగ్యాదికములం దభివృద్ధి గలిగించుకొనుటకు తోడ్పడుట

గ్రామస్థులు తమ తమ జీవనవృత్తులకు సంబంధించిన ఆయా పనులందు నిపుణతను పెంచుకొని, అందువలన తమ ఆర్థిక స్థితి నభివృద్ధి చేసికొనుటకును, వారల ఆహారవిహారములను క్రమపరచుకొనుటకును వలయు జ్ఞానము నొసగు సాంకేతిక గ్రంథములును, శాస్త్రగ్రంథములును ఈవిధమగు మేలు నొనగూర్చును. ఇట్టి గ్రంథము లాంధ్రమున కొలదిగనే యున్నవి. లభించినంతవరకు గ్రంథాలయనిర్వాహకులు వీనిని సేకరించి వానివలన పాఠకులు తమంత లాభమును బొందుటకు కొంత ప్రత్యేక కృషిచేయుట యావశ్యకము. నిర్వాహకవర్గమున నొకరైనను, నీవిషయమున ప్రత్యేక సామర్థ్యతను గలిగి యుండవలెను. ఆర్థికాభివృద్ధియు, ఆరోగ్యాభివృద్ధియు దేశాభ్యుదయమునకు బునాదులు.

## 3. ఆత్మవికాసమునకు, ఉన్నతికిని తోడ్పడుట

కేవల ఆర్థిక, ఆరోగ్య సంపత్తి మీదనే సంఘౌన్నత్య మాధారపడియుండును. ఇప్పటి పాశ్చాత్య నాగరకత యీ రెంటిమీద మాత్రమే కేంద్రీకరించుటయే ప్రస్తుత ప్రపంచ కల్లోలమునకు ముఖ్యకారణము. కావున గ్రామప్రజల మనసులందలి సంకుచితమగు వ్యక్తి సౌభాగ్య ప్రాధాన్యతను తగ్గించి, సంఘౌన్నత్యమునకు వలయు విశాల దృష్టిని గలిగించు చారిత్రక, సాంఘిక, నైతిక, ఆధ్యాత్మిక గ్రంథములను గూడ గొన్నిటిని సేకరించి, వాని పఠనమును, నందలి బోధలను నిత్యజీవితమున ననుసరించుటయు ప్రోత్సహింపదగును. గ్రామాభివృద్ధికైననేమి, దేశాభ్యుదయమునకైననేమి, ప్రపంచ శాంతికైననేమి మానవస్వభావమునందు విశాలదృష్టియు,

ఆత్మజ్ఞానమును గలుగుటయే ప్రధానము. వీనిని గలిగించుటయే గ్రంథాలయోద్యమ పరమావధిగ నెంచదగును.

పైన సూచింపబడిన త్రివిధ ప్రయోజనములకును దగిన గ్రంథములు, పత్రికలు వగైరాల పట్టికలను తయారుచేయించి గ్రంథాలయ నిర్వాహకుల కందజేయుటకు ఆంధ్ర గ్రంథాలయ సంఘమువారు పూనుకొనదగును. చిన్న, నడిమి, పెద్ద గ్రంథాలయములు వానికి లభించు మూల ధనమునుబట్టియు, సాంవత్సరికపు రాబడినిబట్టియు మొదటనే గాని, పిమ్మట నేటేట కొంతగాని వెచ్చింపదగు కొద్ది అనగా రెండువందలు, మధ్యమ అనగా అయిదువందలు, పెద్ద అనగా వేయిరూపాయల మొత్తములను పెట్టికొనదగు గ్రంథాదికములను పట్టికలను వేర్వేరుగ దయారుచేయుట మంచిది.

గ్రంథాలయ నిర్వాహకులు కేవలము పుస్తకములను, పత్రికలను సేకరించి, పాఠకులకు లభ్యముచేయుటయే గాక పై త్రివిధ ప్రయోజనములను సాధించుటకు దోడ్పడు కొన్ని యితర సాధనములనుకూడ నవలంబింపదగును. వీనిలో నీ క్రిందివి ముఖ్యములు.

౧. ఉల్లాసకరమగు నాటపాటలు, పాటకచ్చేరీలు, వ్యాయామములు, వానిలో పోటీలు, సన్మానములు మొదలగువాని నేర్పాట్లుగావించుట.

౨. విజ్ఞులచే నుపన్యాసము లిప్పించుట, బొమ్మల (మ్యాజిక్) లాంతరు ప్రదర్శనములు, సామాన్య చిత్రప్రదర్శనములు మొదలగునవి జరుపుట ఇట్టివి చదువువచ్చిన వారికేగాక యితరులకు గూడ జ్ఞానము గలుగజేయును.

౩. వ్యవసాయక, పారిశ్రామిక ప్రదర్శనములు, పోటీలు, సన్మానములు ఏర్పాటుచేయుట.

౪. పురాణ కాలక్షేపములు, భజనలు, ఉత్సవములు, గ్రామ నాటకములు ఏర్పాటుచేయుట.

౫. ఇట్టిపనులలో ఆయా గ్రామములందుగల అంగ బలమునుబట్టియు, ఆర్థికబలమునుబట్టియు యథాశక్తి చూచుకొనదగును.



గ్రంథాలయములు

# ౧౦. గ్రంథాలయము - గ్రామచరిత్ర

— శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

నవీన ప్రాచీన గ్రంథముల సంపాదించి ఒకచోటచేర్చి ప్రజల జ్ఞానము నభివృద్ధి చేయుటకై అనేకులు ఆంధ్రదేశ మందు గ్రంథాలయములు స్థాపించుకొనుట జూచి, ఈ ఆలయములు మరికొన్ని విధముల ప్రజలకు తోడ్పడుట కవ కాశమున్నదనియు, ఆ సహాయమును చేయుటకు ఇవియే తగినవనియు, నేనిప్పుడు మనవి చేయుచున్నాను. ఇదివరకు ఆంధ్రదేశమందున్న గ్రంథముల సంపాదించుటయేగాక, ఇప్పటి వరకు మనభాషలో లేనట్టియు, ఇప్పుడు మన మత్యావశ్యకములని అనుకొనునట్టియు గ్రంథ విశేషముల సృష్టించి, ఈ ఆలయములు పలువుర కుపకారముచేయుట కవకాశ మున్నది.

దేశచరిత్రము లవశ్యములనుటయు, వాటివలన భాష యేగాక మనస్థితిగతులుకూడ బాగుపడుననుటయు యెల్లరికిని తెలిసిన విషయమే. కాని మనదేశచరిత్రమును వ్రాయుటలో చరిత్రకారు లెన్నియో కష్టముల పడవలసి యున్నారు. మన పూర్వులు చరిత్రగ్రంథములను వ్రాయని కారణముచే శాస నములు, నాణెములు, పురాణములు, కథలు, ప్రాచీన ప్రబం ధములు మొదలగునవియే చరిత్ర గ్రంథములు వ్రాయు వా కి ప్రధానాధారముగ నున్నవి. వీటి సహాయముచేతనే మనవారు దేశచరిత్రను వ్రాయవలసి యున్నారు. ఈ సాధన ముల నన్నిటిని మనమొక్కటగ సంపాదించగలిగిన యెడల మన చరిత్ర జ్ఞాసము కూడ అభివృద్ధి కాగలదు. ప్రతిసంవత్స రమును కొంతద్రవ్యము ఖర్చుపెట్టి దొరతనమువారు శాసన

ములను సంపాదించుచున్నను, ఇంకను ఎన్నియో శాసనములు గ్రామములందు కలవు. ఈ విషయమై గ్రామముల లోని గ్రంథాలయ కార్యదర్శులు శ్రద్ధవహించిన యెడల యెక్కువ లాభము కలుగ గలదు. ప్రతి గ్రంథాలయము తరఫునను ఒక మ్యూజియం (అనగా వస్తు ప్రదర్శనశాల) ఉన్న యెడల దాని యందు ఆ గ్రామములోగాని, దాని చుట్టు పట్లగాని దొరకిన శాసనములు, నాణెములు, పూర్వ కాలమునుగురించి ఏ విషయమునైన తెలుపు ఆయుధములు మొదలగు ఇతర వస్తువులను ఉంచవచ్చును. ఇట్లు ఒక్కొక్క గ్రామమందు ఒక్కొక్క గ్రంథాలయమును, ఒక్కొక్క మ్యూజియమును ఉండిన యెడల పూర్వకాలమును గురించి మన జ్ఞానము విశేషముగ అభివృద్ధి కాగలదు.

ఇదిగాక, ప్రతి గ్రామమునందును పూర్వకాలపు చరిత్ర సంబంధమైన కథల నెరింగిన వారెందరో యుందురు. ఈ కథలలో అనేకములుకల్పితములుగనుండిన నుండవచ్చును. అట్లు కల్పించుటకు కూడ ఏవియోకొన్ని హేతువులుండక తప్పదు. వాటివలన చరిత్ర వ్రాయు వారికి విశేష లాభము కలుగగలదు. వాటిలో కొన్ని కల్పితములుగాక నిజమైనవిగ నుండవచ్చును. ఇట్టి సందర్భములో వాటిని మనము గ్రంథస్థము చేయనియెడల కొంతకాలమునకు వాటిని మరచిపోవుట సంభవించును. కనుక గ్రామమందు ఏయే కథలు ప్రాచుర్యమందున్నవో వాటినన్నిటిని ఒక పుస్తకమందు వ్రాయించి గ్రంథాలయములో ఉంచుట అత్యావశ్యకము.

ప్రతి గ్రామములోనివారును వారి గ్రామముల యొక్క చరిత్ర నెరిగియుండవలయును. స్వకులగోత్రములు తెలియని మనుష్యుడెట్లు గౌరవానర్హుడో, అట్లే స్వగ్రామ

చరిత్రను తెలియని గ్రామస్థులుగూడ గౌరవపాత్రులు కారని చెప్పవచ్చును. రాజులు, మహాపురుషులు, యుద్ధములు మొదలగువాటిని గురించి తెలుపు దేశచరిత్రమును ఎరిగి యుండుట మంచిదిగాని, గ్రామచరిత్రలో వ్రాయుటకుగాని, తెలిసికొనుటకుగాని ఏమియున్నదని అనేకులకు సందేహము కలుగవచ్చును. ఈ సందేహమున కవకాశమే లేదు. మహాపురుషుల చరిత్రలను, యుద్ధములను వర్ణించుట మాత్రము చేతనే గ్రంథము దేశచరిత్ర అనిపించుకొనదు. సామాన్య ప్రజలయొక్క సుఖ దుఃఖములను, వారిలో అప్పుడప్పుడు కలుగుచుండిన మార్పులను, వారి స్థితిగతులను తెలుపు గ్రంథమే దేశచరిత్ర అని అనిపించుకొనును. ఇదియే దేశ చరిత్రయొక్క నిజమైన స్వభావము. ఇట్టి చరిత్ర ప్రతి గ్రామమునకును గలదు. ఒక గ్రామమును తీసికొని అది ఎంత కాలమునుండి యున్నది? దానిని కట్టినవారెవరు? అది ఏ సందర్భమున ఆ ప్రదేశమందు కట్టబడినది? అది ఎట్లు వృద్ధియైనది? ప్రప్రథమమున గ్రామమందు చేరిన వంశముల వారందరు ఇప్పుడున్నారా? లేక క్రొత్తవారెవ్వరైన చేరిరా? గ్రామము వృద్ధిగాంచుటలో ఎవరు తోడ్పడిరి ? ఆ గ్రామములోనివారిలో ప్రముఖులని పేరుగాంచిన వారెవరు? వారెట్లు ప్రాముఖ్యతను సంపాదించిరి? ఆ గ్రామమునకు క్షామములు, చోరులు, దోపిడిగాండ్రు మొదలగువారివలన అపాయములు ఎప్పుడెప్పుడు కలిగినది? మొదలగు ఎన్నియో విషయములను చేర్చి గ్రామ చరిత్రను వ్రాయుట కవకాశమున్నది. గొప్పగొప్ప రాజులకు పరస్పర కలహములు సంభవించినట్లే ప్రతి గ్రామమందును పెత్తనదార్లకు వారిపార్టీలకు కలహములు కలిగి గ్రామస్థులకు విచారము గలిగించి యుండ

వచ్చును. ఇట్టి గ్రామచరిత్రను తయారుచేయించి గ్రామ గ్రంథాలయములో ఉంచుట అత్యావశ్యకము.

ఇట్లే గ్రామములో జరుగు దినచర్యను ఒక డైరీలో వ్రాయించి గ్రంథాలయములో ఉంచుట మంచిది, పూర్వులు వారికాలమందు జరిగిన విషయముల గురించి చరిత్ర గ్రంథముల వ్రాయని కారణముచే మన కెంతయో కష్టనష్టముల కలిగించినారని మనము వారిని నిందించుచు ఇట్టినష్టమున కెంతయో విచారించుచున్నాముగదా? అట్లే మనము మన పూర్వుల వలె నుండిన యెడల మన తదనంతరము వచ్చువారు మనల నిందించుట కవకాశమున్నది. ఇంగ్లీషు నాగరికతతోను, విద్యతోను మనకు సంబంధము కలిగినప్పటి నుండి పట్టణములయందేగాక పల్లెలయందు కూడ ఆచార వ్యవహారములయందెన్ని మార్పులు కలిగినవి. మన వేషములు మారిపోవుచున్నవి, మన మతము, ఆచారము మారిపోయినవి. రెండువేల సంవత్సరములకు పూర్వము మన మెట్టి స్థితియందుంటిమో మనము చెప్పలేక పోవుట సరికదా, వందసంవత్సరములకు పూర్వము మన గ్రామ మెట్లుండినది, మనము చెప్పలేనట్టి స్థితికి వచ్చుచున్నాము ఇదియెంతయో విచారకరమైన విషయము. గ్రామములోని ప్రజలలో కలుగు మార్పులన్నియు దినదినము డైరీలో వ్రాయుచుండుట ఎంత ఆవశ్యకమో దీనిని బట్టి తెలియుచున్నది. ఉత్సవములు. వినోదములు, వ్యాపార విషయములు, వ్యవసాయమునకు సంబంధించిన అంశములు, అదియిది అననేల? గ్రామములో జరుగు చర్య అంతయు ఈ డైరీలో నుండవలయును. గ్రంథాలయములు చేయదగిన పనులలో ఇది యొకటి.

స్వీయ చరిత్రలను వ్రాయుటలో వీరేశలింగం పంతులు గారు మనకు ప్రధాన మార్గదర్శకులు. ప్రతి గ్రామమందును

పాండిత్యముచేతనో, అధికారముచేతనో ఘనత వహించిన వృద్ధులనేకులుందురు. అట్టి ముసలి వారు వారి స్వచరిత్రములోని అంశములన్నిటిని వ్రాయగలిగిన యెడల దానిని బట్టి గ్రామ చరిత్ర మనకు బోధపడగలదు. గ్రంధాలయాధికారులు ఇట్టి పనులను గూడ చేయవచ్చును.

గ్రంధముల సృష్టించుట యన్న ఇదియే. దీనికి విశేష పాండిత్యమవసరములేదు. వ్యాకరణ యుక్తముగ వ్రాయవలయునని లేదు. విషయమును ప్రజలు మరచిపోక పూర్వమే గ్రంధమందు వ్రాయుట మాత్రమే కావలిసియున్నది. ఈ పని చేయుటకు లోకానుభవము మాత్రమే కావలెను. మరి యేదియు అవసరములేదు.

దేశచరిత్రకు సంబంధించిన గ్రంధములను సృష్టించి దేశచరిత్రకారులకు తోడ్పడునట్లే, ఇతర విషయములగురించి గ్రంధముల తయారుచేసి, సాంఘిక శాస్త్రములకు గ్రంధాలయాధికారులు తోడ్పడుట కవకాశమున్నది. దేశ మభివృద్ధి యగుటకు మనకు మూడు విషయములను గురించి బాగుగ తెలియవలసియున్నది. మన ప్రస్తుత స్థితియెట్టిది? ఈ స్థితికి కారణములెవ్వి? ఈ స్థితికి మన మెట్లువచ్చితిమి? అను ప్రశ్నలకు మనము సరియైన జవాబు లివ్వగలిగి యుండవలెను. దేశ చరిత్ర సహాయముచే మన మీ స్థితిలోనికి ఎట్లువచ్చినది, ఇందుకు కారణము లేవో మనము చెప్పగలిగియుందుము; ప్రస్తుత స్థితిని తెలుసుకొనుటకు మార్గము మరియొకటి యున్నది.

ఒక ఉదాహరణము వలన ఈ విషయము స్పష్టము కాగలదు. మన దేశములోని ప్రజలకంటె పేదవారు మరి యెక్కడలేరనియు, ఈ కారణముచే మనవారనేకులు మూడు

పూటలు ఆహారములేక ఆకలిచే కృశించుచు, కట్టుకొనుటకు తగిన బట్టలుగాని, నివసించుటకు తగిన ఇండ్లుగాని లేక యున్నారనియు, గనుక దొరతనము వారు మనస్థితిని బాగు చేయుటకు తగిన ప్రయత్నముల చేయవలసి యున్నారనియు మనము చెప్పుచుందుము. ఇట్లే దొరతనమువారు భూమిపై విధించు పన్ను విషయమై మన అభిప్రాయము దొరతనము వారి అభిప్రాయము కంటె భిన్నముగ నున్నది. వ్యవసాయపు ఖర్చులను, వ్యవసాయ దారుని సంసారమును పోషించుటకు కావలసిన సొమ్మును తీసివేయగా, ఎకరా పొలములోని పంటలో ఏమిమిగులునో అందులో సగము మాత్రమే మేము తీసికొనుచున్నాము. కనుక రైతునకు మా వలన ఎట్టి నష్టము కలుగుటలేదని దొరతనమువారును, పన్నులను చెల్లించిన తర్వాత ఖర్చులుగూడ గిట్టుటలేదని రైతులు చెప్పుచున్నారు. ఈలాటి వివాదాంశము లెన్నియో యున్నవి. వీటిని గురించి సత్యమిదియని తెలియు వరకును మనము ముందు ఏమిచేయుటకును వీలుండదు. ప్రజలు నిజపేదలై యున్నారనుటకు నిదర్శనమేది? భూమిపై దొరతనము వారు విధించు పన్ను యెక్కువగ నున్నదనుటకును, రైతుపన్నుల చెల్లించుటకు తగిన స్థితిలో లేడనుటకును నిదర్శనములెవ్వి? అను విషయములగురించి యథార్థమేదో స్పష్టపడవలయును. ఈ విషయముల గురించియే అర్థశాస్త్రమును చదువువారును వ్రాయగలవారును ఆలోచించుచుందురు. ఈ విషయముల తెల్పుటలో గ్రంథాలయాధికారులు ఎంతయో విశేషముగ తోడ్పడవచ్చును.

ఒక చిన్న గ్రామమున్నదనుకొందము. అందులో ఒక గ్రంథాలయమున్నయెడల చరిత్ర విషయమై నేను పైన చెప్పిన విషయములు వ్రాయించి ఆలయాకారులు చరిత్ర

కావలెను తోడ్పడవచ్చును ఇట్లే ఆ గ్రామములోని ప్రజలు ధనవంతులుగనున్నారా, దరిద్రులుగనున్నారా? పన్నులవలన కష్టపడుచున్నారా, లేదా ? వృద్ధిదశయందున్నారా లేక నానాటికి క్షీణించుచున్నారా? అను విషయములను గురించి యదార్థమిదియని తెలుపు గ్రంథమును గ్రంథాలయము శీఘ్రమున తయారుచేయుటకు వీలున్నది. ప్రజలు ధనికులా, దరిద్రులా అనుటలో కొందరు ధనికులుగ నుండవచ్చుననియు, మరికొందరు దరిద్రులనియు చెప్పుటవలన ఏమియు స్పష్టము కాజాలదు. గ్రామములోని ప్రతి మనుష్యునియొక్కయు, సంసారముయొక్కయు స్థితిగతులను వెల్లడచేయు టవసరము. ఇట్లుచేయుట సాధ్యమైన పనియా? "నీకెంత డబ్బున్న" దని ఒక గ్రామస్థుని అడిగినయెడల అతడు సరియైన జవాబు నిచ్చునా? "నాగుట్టు నీకెందు"కని దూషించునుగదా? ఈ పనిచేయుటయెట్లని కొందరనవచ్చును. ఇందునకే లోకానుభవమును, కొంతనేర్పును కావలసియుండును. గ్రామము చిన్నదైనప్పుడు ఒకరిస్థితి మరియొకరికి సాధారణముగ తెలిసియే యుండగలదు గనుక విశేషశ్రమలేక ఈపని నిర్వహించవచ్చును.

కోఆపరేటివ్ సొసైటీలను స్థాపించుటలో దొరతనము వారు గ్రామస్థుల ఆస్తి అప్పుల వివరములను కోరుచుండుట మనము చూచుచున్నాము. ఇది యేవిధముగ ప్రజల నిజస్థితి తెలియగోరు మనము ఖర్చులు మొదలగువాని మొత్తము వివరములను ప్రతి గ్రామమందును తయారుచేయవలసి యున్నది. ఒక్కొక్కనికి యెంత భూమియున్నది? ఎన్నిపశువులు, బండ్లు, నాగళ్ళు మొదలగు పనిముట్లు? సాధారణముగ వాని సంసారమునకు అగుఖర్చెంత? వానికివచ్చు ఆదాయ

మెంత? అని తెలిసికొనవలసి యుండును. ఇట్టిపన్ను ఎక్కువా తక్కువా అనుటకు, పూర్వము ఆ గ్రామములో ఒక్కొక్క యెకరమునకు అగు సేద్యపు ఖర్చులెంత? ఎకరములో పండు పంటయెంత? ఈ ధాన్యము ఖరీదెంత? ఖర్చుపోను రైతులకు మిగులు లాభమెంత? మొదలగు అంశములను గురించి యదార్థమిదియని ఒక గ్రంథము తయారుచేయించి గ్రంథాలయములో నుంచవలెను. అప్పుడే మనకు ప్రతి గ్రామము యొక్క నిజస్థితి తెలియగలదు. లేనియెడల యదార్థమిది యని చెప్పుటకు వీలుండదు.

గ్రంథాలయములవారు ఈ పై జెప్పిన పనులు చేయ గలిగినయెడల, వారు దేశమున కెంతయో ఉపకారముచేసిన వారగుదురు. ప్రజల నిజస్థితి తెలుసుకొనగోరి ఇంగ్లండు మున్నగు దేశములలో ఇట్టిపనులు చేయువారెందరో యున్నారు. ఇందుకై ఎన్నియో సంఘములేర్పడియున్నవి.

# ౧౧. గ్రంథాలయము - గ్రామచరిత్ర

— పండిత గొఱ్ఱెపాటి వెంకటసుబ్బయ్య

గ్రామ చరిత్ర యొక్క ఆవశ్యకము ప్రతి నాగరిక దేశము తన దేశచరిత్రనేకాక ఇతర దేశచరిత్రలను కూడ చదువుటకు ప్రజలకు అవకాశము కలిగించుచున్నది. అట్టి స్థితిలో మనము నివసించు గ్రామ చరిత్ర తెలిసికొను ఆవశ్యకతను గురించి వేరే వివరించ నక్కరలేదు.

ఒక గ్రామము యొక్కగాని దేశము యొక్కగాని, మహాపురుషునియొక్కగాని సమస్త విషయాలు వివరించు దానినే చరిత్రయందురు. చరిత్రలో యథార్థ విషయాలే ఉండాలిగాని కల్పన లుండరాదు.

గత కాలాన్ని గమనించి, వర్తమానమును విమర్శించి, భవిష్యత్తును నిరూపించుకొన ప్రయత్నించుటే దేశము యొక్కగాని, గ్రామముయొక్కగాని చరిత్ర ప్రయోజనము.

స్వకుల గోత్రము తెలియని మనుష్యుడెట్లు గౌరవానర్హుడో, స్వగ్రామచరిత్ర తెలియని గ్రామస్థుడును అట్టి గౌరవానర్హుడు. దేశ చరిత్ర తెలిసికొనుట వలన ప్రయోజన మున్నదిగాని గ్రామ చరిత్ర వలన లాభమేమున్నదని కొందరకు సందేహము కలుగవచ్చును. దీనికి అవకాశమేలేదు. ఏలయన రాజుల పోరాటాలు, మహాపురుషుల వృత్తాంతాలే చరిత్రలు కాజాలవు. సాధారణజనుల కష్టసుఖములు, వారిలో కలుగు మార్పులు, ఆర్థిక విశేషములు, సాంఘిక పరిస్థితులు, సంస్కృతి పద్ధతులు మొదలగు స్థితిగతులే చరిత్రకు

ప్రధాన లక్ష్యములు. ఈ విషయములు వివరించునదే సరియైన చరిత్ర. అటువంటప్పుడు ఇట్టి చరిత్ర ప్రతి గ్రామమునకు ఉండును.

ఆయా గ్రామస్థులు తమ తమ గ్రామ చరిత్రలు వ్రాసిగాని, వ్రాయించుకొనిగాని ఉంచుకొనిన దేశ చరిత్ర రచనకు సహాయకారిగకూడ ఉండును.

## ప్రాచీన గ్రామ చరిత్రలు

భారత దేశమంటే గ్రామములే మన దేశములో అన్ని విషయాలకు గ్రామమే ప్రధానము. రాజ్యాలు పెరిగినా పోయినా, రాజులు ప్రబలినా నశించినా మన దేశంలోని గ్రామ జీవితం ఎట్టి అల్లకల్లోలంచెందక, అచంచలముగా యుగయుగాలనుండి సాగిందని అందరూ అంగీకరించిన విషయమే. అందుచేతనే యేమో మన దేశంలో దేశచరిత్ర రచన యందు శ్రద్ధచూపినట్లు కనుపించదు. కాని గ్రామాలకు సంబంధించి కథలనుండి, పుక్కిటి పురాణాలనుండి, మరి యేమైనా అనండి—స్థలపురాణాలని, క్షేత్ర మహాత్మ్యములని గ్రామకైఫీయతులని, ఇంకా వివిధనామాలతో రకరకాల రచనలు మన దేశంలో ఉన్నవి. ఇట్టివి ప్రతిగ్రామానికి లేకపోయినా, ప్రాచీన ప్రాముఖ్యంగల గ్రామాలకు లేకపోలేదు.

గతశతాబ్దిలో కల్నల్ కాలిన్ మెకంజీ [సర్వే జనరల్] మద్రాసు రాజధానిలో గ్రామచరిత్ర రచనను పూనుకొనెను. ఆయన ఆంగ్లేయుడైనా, అది తన ఉద్యోగధర్మము కాకపోయినా మన దేశచరిత్ర తెలుసుకొనవలెననే ఉద్దేశ్యముతో అధికవ్యయ ప్రయాసలకు లోనై యీ కార్యమును పూర్తి చేయించెను.

ఈ కార్యసాధనకు పలుభాషా కోవిదుడగు ఏలూరు కాపురస్థుడు కావలి బొర్రయ్యను నియమించగా, ఆయన మరి కొందరను తన చేతిక్రింద వేసుకొని, మద్రాసు రాజధాని అంతా సంచారముచేసి, ఆయా గ్రామములలో తెలిసినవారి వద్ద వారిగ్రామాలను గురించి కైఫియతులను తీసికొనెను. వాటినే గ్రామకైఫియతులని, స్థానిక చరిత్రలని, ఆంగ్లమున 'మెకంజీమాను స్క్రిప్ట్స్,' అని అంటారు. మెకంజీగారు వ్రాయించుటచేత వీనికాపేరువచ్చినది.

ఈ కైఫీయతులలోని అంశాలు యధార్థాలుగావు. చాలవరకు కల్పనలే. ఇవి కధలవలె నుండి చదువుటకు మనోహరముగా నుండును. ఇవి ఆనాటి మనపూర్వుల అకృత్రిమ విశ్వాసము, ఆంధ్రభాషా పరిణామము, ఆంధ్రదేశము లోని వివిధభాగములు, చరిత్ర సాధనాలను వెల్లడించగలవు. మద్రాసులోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో ఇవి భద్రపరుపబడి, చరిత్రకారులకు పెన్నిధివలె ప్రయోజనకరముగా నున్నవి.

మెకంజీగారు గత శతాబ్దంలో మద్రాసులో చేసిన కృషే యీ శతాబ్దిలో మహారాష్ట్రచరిత్ర చక్కగా వ్రాయుటకు ఉపకరణాలు చేర్చిపెట్టే దృష్టితో రాజ్వాడే అనే చరిత్ర పరిశోధకుడు గ్రామగ్రామముతిరిగి సమగ్రిసేకరించి అనేక సంపుటాలు సమకూర్చెను.

1946 వ సం. లో కృష్ణా పత్రిక సంపాదకుని ప్రేరణచే 'మాగ్రామం' అనే శీర్షికతో అనేక గ్రామాల చరిత్రలు సంగ్రహంగా ఆపత్రికలో ప్రచురింపబడెను. ఇంకను మరికొందఱు గ్రామముల చరిత్రలు రచించి ప్రచురించిరి- ద్రాక్షారామం, మోపుకూరు, కొండపల్లి, ఘంటసాల మొదలగునవి.

# గ్రామచరిత్ర రచనావిధానము

ఇక గ్రామచరిత్ర రచనకు నాకు తోచిన పద్ధతిఒకటి తెలిపెదను. ఇదికొంతవరకు ఉపయోగపడగలదు. ప్రతి గ్రామములోను పూర్వకాలపు చరిత్రకు సంబంధించిన కథలు ఎరిగినవారు కొందరుందురు. వీటిలో కొన్ని కల్పితములు కావచ్చు. అయినను అట్లు కల్పించుటకుకూడ ఏవో కారణా లుండవచ్చు. కనుక వాటివల్లకూడ చరిత్రకారులకు కొంత ప్రయోజనము కలుగును వీటిలో కొన్ని నిజమైనవి కూడ ఉండవచ్చును. కనుక వాటినన్నిటిని గ్రామచరిత్ర రచన కుప యోగించుకొనుట అవసరము. నేడు మనము వాటిని గ్రంథ స్థము చేయనిచో అవి పెద్దలతోనే పోవచ్చును. కనుక ఇతర సాధనాలు లేనపుడు పరంపరానుగతముగా ప్రజలు వాడుకొను పుక్కిటిమాటలే చరిత్ర కాధారములుగా తీసి కొనుట అవసరము.

ఒక గ్రామమును తీసికొని, ఆగ్రామ నామవ్యుత్పత్తి సంగతి ప్రథమంగా పేర్కొనాలి. అదియే సందర్భములో కట్ట బడినదీ, ఎంతకాలమునుండి ఉన్నదీ, దానిని కట్టినవారెవరు? తర్వాతవచ్చిన వారెవరు? మొట్టమొదట అక్కడ ప్రవేశించిన వారెవరు? నేడే యే కులములవారున్నారు? ఏయే వంశముల వారున్నారు? వారివృత్తులు, స్థితిగతులు, ప్రథమమున ప్రవే శించిన వారున్నారా? ఏయేకులములు, వంశములు క్షీణించి నవి? ఏవి అభివృద్ధి చెందినవి? అందులకు కారణములు, గ్రామ గృహసంఖ్య జనసంఖ్య ఎంత? వివిధ రాజుల కాల ములు, ఆగ్రామ పరిస్థితులు, పేర్లు పేర్కొనుటవసరము.

గ్రామ సాంఘిక, ఆర్థిక, నైతిక, విద్యా పరిస్థితులు, ఆచార వ్యవహారములు వివరించుట అవసరము. ఆగ్రామము

దేనికి ప్రసిద్ధి? ఆ గ్రామాభివృద్ధికి కారకులెవ్వరు? ఆ గ్రామములోని కవి గాయక శిల్పుల నామములు, వారి శక్తి సామర్థ్యాలు, ఆగ్రామములోని ప్రముఖుల పేర్లు, వారి ప్రాముఖ్యమెట్టిది? ఆ గ్రామములోని దేవాలయాల పేర్లు వాటిని కట్టించినవారి నామములు, నేటిస్థితి, వాటిఉత్సవాలు, ఆ దేవాలయాలలోని శాసనముల వివరములు తెలుపు టవసరము.

జాతీయోద్యమములోగాని, ఇతర ప్రజా ఉద్యమము లలో గాని పాల్గొనినవాని పేర్లు, ఆ గ్రామములో ఆధుని కంగా ఏర్పడిన సంస్థలు, సంఘములు, గ్రంథాలయము, సహ కార సంఘముల, పంచాయతీ బోర్డు మొదలగు ప్రజా సం స్థలు స్థాపించిన వారి చరిత్ర, వాని స్థాపన తేదీలు, వానిలో పాల్గొని పనిచేసినవారు, ఆ సంస్థల ప్రయోజనము వివరించుట ముఖ్యము.

గ్రంథాలయమే గ్రామ చరిత్ర రచనకేలగడంగవలెను? గ్రామ చరిత్ర ఆవశ్యకత అంగీకరించినదే. గ్రంథాలయానికి, దీనికి సంబంధమేమి? అని కొందరకు సందేహము కలుగ వచ్చు. గ్రంథాలయమంటే సభ్యుల దగ్గర చందాలుతీసికొని, వారికి గ్రంథాల నందించు సంస్థ మాత్రమే కాదు. అది పట్టణాలలో ఉద్యోగుల ఉబుసుపోక కచేరీ క్లబ్బు కాదు. పఠనమందిర మంతకంటేను కాదు. అది విశాల ప్రయోజన మును కలిగించు సంస్థ. గ్రంథాలయమంటే ప్రజల సాంఘిక, ఆర్థిక, నైతిక, విద్యా విషయ కాదుల అభివృద్ధికై నిత్యము పాటుపడునది. ఒకనాడు దేవాలయములు దేశమునకు ఎట్టి ప్రయోజనమును సాధించెనో నేడు గ్రంథాలయము అట్టి ప్రయోజనమును సాధించు టవసరము.

ఇంతేగాక, ప్రపంచములలోని పలువిధ గ్రంధములను పాఠకుల కందిస్తూ, స్వగ్రామచరిత్రను వారికందుబాటులో ఉంచుటకు ప్రయత్నించకపోవుట కంటె హాస్యాస్పదమైన సంగతి, అనాలోచిత విషయము వేరే ఉన్నదా? కనుక ప్రతి గ్రంధాలయాధిపతి దీనిని ప్రథమ కర్తవ్యంగాతలచి గ్రామ చరిత్ర రచనకు పూనుకొనవలెను. తనకవకాశం లేనిచో తెలిసినవారిచేత వ్రాయించవలెను. ఆంధ్రదేశ గ్రంధాలయ సంఘమువారు దీని ఆవశ్యకతను గ్రహించి ప్రచార ప్రబోధములు చేసి చారితార్థులు కావలెను.

# ౧౨. పాఠశాలలలోని గ్రంథాలయములు

— శ్రీ బులుసు వెంకటరమణయ్య

ప్రత్యేక జ్ఞానముల సంగతి యెటులున్నను, మానవునికి ప్రపంచ జ్ఞానము ప్రధానము.

లోకజ్ఞానమునకు పెక్కు మార్గములున్నవి. అందు దేశాటనము ప్రధానమైనది. అది ధనవ్యయమైన మూలమగుటను, ఇతర కార్యముల కడ్డంకియగుటను జనసామాన్యమునకు సులభసాధ్యము కాదు కాని అది చేయుపనిని చాల వఱకు గ్రంథాలయములు నెఱవేర్పగలవు.

ఔత్తరాహులకంటె దాక్షిణాత్యు లనేక విషయములలో వెనుకపడియుండుట మన మందర మెఱిగినదియే! అట్టి వానిలో గ్రంథాలయోద్యమ మొకటి. ఈ యుద్యమమును స్వీయసమస్యగా ఎంచి శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు వృద్ధిలోనికి తెచ్చినవఱకు - తెలుగు దేశమున - తెలుగు దేశముననే కాదు - యావద్దక్షిణ భారతమునను, ఈయుద్యమ మనిన ఏమో ఎఱుగనివారు విద్యాధికులలో గూడ పెక్కురుండిరనుట సాహసము కాదు. శ్రీ వారికృషి ఫలితముగ యావద్భారతదేశము నందును తెలుగువారు గ్రంథాలయోద్యమమున అగ్రస్థానమును వహించి యున్నది.

దేశముయొక్క భావ భివృద్ధి ఎక్కువగ పెద్దలకంటె పిన్నలపైననే ఆధారపడి యున్నది; ఆ పిన్నలు విద్యార్థులు లోకజ్ఞులగుటకు ఉపకరించునది గ్రంథాలయోద్యమ మొక్కటియే.

నేటి కాలమున విద్యాశాలలలో విద్యాభ్యాసముతో పాటు, వివిధ వస్తుజ్ఞానమును, వ్యాయామమును ప్రాము

ఖ్యము వహించినవి. బాలుర లోకజ్ఞానమును వృద్ధిపఱచుటకై పాఠశాలా గ్రంథాలయములు, వాఙ్మయ సంఘములు, అప్రధాన పఠనీయ గ్రంథములు (Non-detailed texts) ఏర్పాటుపబడినవి.

కాని మీాది పద్ధతులు బాలుర లోకజ్ఞానమునకు అనుకొనినంత సాయపడలేక పోయినవి.

ఆటలపై ఆసక్తిని జూపు బాలురు గ్రంథాలయముం తగినరీతి నుపయోగించుకొన లేకపోయిరి.

పై యంశములను బాగుగ గమనించి విద్యాశాఖవారు బాలుర కుపయుక్తమగు రీతిని ప్రణాళికలో కొన్ని మార్పులు చేసిరి. అనుపయుక్తములగు ప్రధాన పఠనీయములను త్రోసి రాజుచేసి వారి స్థానమున నిర్బంధముగ వివిధ గ్రంథపఠనమును విధించిరి. ఈ పద్ధతి ననుసరించి ప్రతి విద్యార్థియును వత్సరమునకు- పదునైదునుండి ఇరువది వఱకును ఉపయుక్తములగు పుస్తకములను చదివి లోకజ్ఞానమును సంపాదించవచ్చును. ఈ పద్ధతియు కొన్ని నియమములపై ఆధారపడి యుండుటవలన బాలురకు సుకరము.

బాలురకు ఏ గ్రంథము ప్రయోజనకారియో ఆలోచించి ఉపాధ్యాయుడే వారమున కొకొక్క పుస్తకము నొసగుచుండును. విద్యార్థి దాని నింటికి గొనిపోయి విరామ సమయములలో చదువును. తాను ఎప్పుడెప్పుడెన్నెన్ని పుటలు చదివినదియు అందుండి యేమి గ్రహించినదియు అర్థముకాని కఠినపదములను, క్రొత్తపదములను, జాతీయములను రికార్డు పుస్తకమున వ్రాసి విద్యార్థి ఉపాధ్యాయుని కొసగును. ఉపాధ్యాయుడు, అందలి మంచిచెడ్డలను, కఠినపదముల కర్థములను వివరించి, తెలియజేసి, వేఱొక పుస్తకము

నొసగును. ఈరీతిని గ్రంథపఠనమును సాగించిన యెడల లోక జ్ఞత అలవడుటకు సందేహము లేదుగదా!

ఇంకొక సంగతి. ఇప్పుడు జ్ఞానమార్జించిన విద్యార్థుల పరీక్షకొఱకు కొన్ని పాఠశాలలో లోకజ్ఞాన (General-Knowledge) ప్రశ్నపత్రములు, బుద్ధికుశలతా ( Intelligence tests ) పరీక్షాపత్రములును ఈయబడుచున్నవి. వీనివలన విద్యార్థులయందు ఉత్సాహము రేకెత్తి, వారు ఉత్తమ జ్ఞానమును సంపాదించుటకు ప్రయత్నింతురు. అందుకొఱకు వారు పాఠ శాలా గ్రంథాలయము నందలి పుస్తకముల నెన్నింటినేని చదివితీరవలయును. ఒక తరగతినుండి పెద్దతరగతికి మారు టకు, ఈ పరీక్షల మార్కులు లెక్కింపబడనందున- లోక జ్ఞానము తక్కువైన విద్యార్థులను విచారింపబనిలేదు. కాని ముందుముందు ఇట్టిపరీక్షలు నిర్బంధములయి, తక్కినపరీక్షలవలె ప్రాముఖ్యమును వహించినయెడల విద్యార్థుల కెంతయో మేలు కలుగగలదు. పాఠశాలా గ్రంథాలయములు బాగు పడగలవు.

విద్యార్థులు లోకజ్ఞులగు భారము కేవలము వారిపైన లేదు; ఉపాధ్యాయులపైని, పాఠశా లాధికారులపైని కూడ గలదు. తగిన గ్రంథములను, పత్రికలను, తరగతులవారీగా కొనవలసిన వానిని సూచించవలసిన బాధ్యత ఉపాధ్యాయు లది. వానినికొని, తగిన జాగ్రత్తలో నుంచు బాధ్యత అధి కారులది. ఎవరిబాధ్యతను వారు- అధికారులు, గురువులు, విద్యార్థులు- గుర్తించినప్పుడే ప్రయత్నము సఫలత నొం దును.

విద్యార్థులకు పుస్తకము లిచ్చు బాధ్యతయు, వారి కార్డులను పరీక్షచేసి, కోరిన యంశములను తెలియజేయు

బాధ్యతయు సహించుటకు ఉపాధ్యాయులను కాక, ప్రత్యేక గ్రంథ భాండాగారాధికారిని నియమించుట పాఠశాలాధికారుల విధి. ఏలయిన, తక్కిన పాఠములను బోధించు నుపాధ్యాయులు విద్యార్థులకు కావలసిన గ్రంథముల నన్నింటిని చదివి, తరగతివారీగా నిర్ణయించుటకు వ్యవధియుండదు. గ్రంథాలయాధికారికి, గ్రంథాలయములోని అన్ని పుస్తకముల విషయము అవగాహనమై యుండుటవలనను, అతనికి వేఱొక బాధ్యత లేనందునను అత డెంతయోని విద్యార్థుల కుపకరింపగలడు.

ఇదివఱకు జెప్పబడిన సౌకర్యములు కలిగి, ఆయా పద్ధతుల నవలంబించియున్న పాఠశాలలు లెక్కకు మిక్కిలి తక్కువగ నున్నవి. తక్కిన పాఠశాలలుకూడ మీాది మార్గముల ననుసరించినచో విద్యార్థుల కెంతయోని మేలొనర్చిన వగును.

# ౧౩. తాత్కాలిక పాఠశాలలు

— శ్రీ సూరి వెంకటనరసింహశాస్త్రి

[illegible]నమందిప్పుడు జరిగిన పాఠశాలలలో విద్యాభ్యాసము చేయువారు సామాన్యముగా కోమల వయస్సు గలవారున్నారు. ఇచ్చట చదువువారికి యితర వ్యాపకముండదు. ఈ పాఠశాలలయందు దినమునకు 5-6 గంటలవరకు విద్యాభ్యాసము జరుగుచుండును. ఇట్టి పాఠశాలలలో విద్యాభ్యాసము చేయువారు విద్యాభ్యాసకాలమందు తమ పోషణకొరకై యితరులమీద ఆధారపడి యుండవలసిన వారుగానున్నారు. కాబట్టి ప్రస్తుత పరిస్థితులలో తమ జీవనము కొరకు స్వయంసహాయముమీదనే ఆధారపడి యుండవలసినవారును, కోమలవయస్సును గడపినవారును, ప్రతిదినము గంటలతరబడి విద్యనభ్యసించుటకు తగు సావకాశము లేనివారును, విద్యాభివృద్ధి చేసికొనుటకు మనదేశములో సాధనములేమియు లేకున్నవి; ఇందుచేత విద్యవలన కలుగవలసిన లాభమంతయు మన దేశస్థులకు లభించుటలేదు. జరుగవలసినంత విద్యాభివృద్ధి జరుగుచుండుటలేదు. ఈలోపములను నివారణచేయుటకు ఏర్పడినవి తాత్కాలిక పాఠశాలలు. తాత్కాలిక పాఠశాలలననేమో ముందు తెలిసికొనవలసియున్నది. ఇతర దేశములలో యెట్లు జరుగుచున్నదో ముందు వివరించి, పిమ్మట మనదేశమందు వీనిని యెట్లునడుపవలెనో సూచించుట యుచితము.

ప్రథమమున ఇంగ్లాండు దేశమందలి ప్రతిష్ఠాపనలను గూర్చి వివరింపబడును. మనదేశమందువలె విశ్వవిద్యాలయ నిర్వాహణము కేవలము కళాశాలల మూలముననే మాత్రము

కాదు. ఆయా విశ్వవిద్యాలయముల కేంద్రస్థానముల చుట్టు పట్లనుండు దేశమునందు కూడ విద్యాభివృద్ధి చేయుటకు తోడ్పడును. ఆవిధముగా ఒక పట్టణమునందుగాని పల్లెటూరిలోగాని విద్యాభివృద్ధిని కోరెడి కొందరు యువకులు ఒక సంఘముగా చేరి తాము ఏవిషయమునందు విద్యాదానము కోరెదరో తెలియచేయుచు విశ్వవిద్యాలయము వారిని తమకు సాయముచేయవలెనని కోరుదురు. ఇట్లు కోరినపుడు పంపుటకుగాను ప్రత్యేక విషయములందు తరిబీతు పొందిన ఉపాధ్యాయులు విశ్వవిద్యాలయమువారిచే నియమింపబడి సిద్ధముగా నుందురు. ఈ యుపాధ్యాయుల మూలమున జరుగగల విద్యావిధాన మెట్టిదో వివరింతును. ఏవిషయమందైనను విశేషజ్ఞానము సంపాదించకపోయినను సామాన్య విద్యనుమాత్రము అభ్యసించినవారి ప్రస్తావన విద్యావిధానమున విద్యాలాభము పొందుట కష్టములుగా నుందురు. ఇట్లు జ్ఞానాభివృద్ధిని సామాన్యముగా కోరెడి విద్యావిషయములలో ఒక్కొక్కదానిని ఒక గంటలోగాని, గంటన్నరలోగాని పూర్తిచేయుటకు వీలుగానుండునట్లు వారములు లేక ఉపన్యాసములుగా ముందుగా విభజించుదురు. ఒక్కొక్కవారమును తిరిగి అందు వివరించవలసి ముఖ్యవిషయముల ననుసరించి విభజించెదరు. వీనినన్నిటిని కరపత్రముల మూలముగా వారమున కొకటివంతున ప్రకటింతురు. మరియు వారములకు సంబంధించిన విషయములు విపులముగా విద్యార్థులకు సామాన్యముగా పందుబాటులో నుండతగిన ఏయేగ్రంథములందు వివరింపబడియున్నవో అట్టి గ్రంథముల పేర్లనుగూడ ఆ కరపత్రములయందు ప్రకటింతురు. ప్రస్తావన విద్యాప్రచారము జరుగవలసినచోట్ల ముందుగా ఈ కరపత్రములను ఆయా స్థానికసంఘముద్వారా ప్రకటింతురు. స్థానికముగా

జరుగవలసిన వ్యయమంతయు స్థానికసంఘము భరించవలెను. ఇందుకు కావలసిన యింటిని సంపాదించుట, సమావేశములు జరుపుటకు కావలసిన ఏర్పాట్లు చేయుట స్థానికసంఘము యొక్కపని. విశ్వవిద్యాలయమువారు ఉపాధ్యాయుల జీతములను భరింతురు. వారిరాకపోకల ఖర్చులుగూడ భరింతురు. అచ్చుఖర్చులుకూడ వారివే.

విశ్వవిద్యాలయమువారికిని, స్థానిక సంఘమునకును అన్యోన్య సంబంధ మేర్పడిన పిదప ఆయా స్థలములయందలి పరిస్థితులనుబట్టి ఈ విద్యాప్రచారమునకు కాలనిర్ణయము చేయబడును. కొన్నిచోట్ల వారమున కొకతూరి గంటగాని, గంటన్నరగాని ఏర్పర్చవచ్చును. ఇతరచోట్ల మరొకతీరుగా ఏర్పర్చవచ్చును. ఈ గంట గంటన్నరలో ప్రథమమున యిది వరకు ప్రచురించబడిన కరపత్రములందు వివరింపబడిన విధానం ననుసరించి ఉపన్యాసరూపమున నిర్దిష్టవిషయము బోధింపబడును. ఉపన్యాసము చివర ఉపాధ్యాయులను ప్రశ్నించి విద్యార్థులు సందేహములు తీర్చుకొందురు. విద్యార్థులు జాగరూకతతో విషయమును గ్రహించుచున్నదీ లేనిది తెలుసుకొనుటకుగాను ఉపాధ్యాయుడు వారిని ప్రశ్నించును. ఈవిధముగ అనుకొన్నప్రకారము ఉపన్యాసములన్నియు పూర్తియయిన పిదప విద్యార్థులకు పరీక్షయొకటి జరుగును ఉత్తీర్ణులైనవారికి విశ్వవిద్యాలయమువారు సర్టిఫికెట్లు నిత్తురు. అగ్రగణ్యులకు బహుమతులిత్తురు. ఈవిధమున ఇంగ్లాండు దేశమందు విశ్వవిద్యాలయములపక్షమున స్కూళ్ళకు, కాలేజీలకు వెళ్ళుటకు అవకాశంలేనివారికి విద్యాభివృద్ధి జరుగును. శరీరకష్టముచేసి జీవించువారికి విద్యాభివృద్ధి చేయుటకు వారలకు తగినమార్గము లవలంబించు ప్రతిష్ఠాపనలు స్థాపింపబడి యుండును. విద్యాగోష్ఠులు ఏర్పరచుట, ప్రత్యేక ఉపన్యాస

ము ను నిప్పించుట మున్నగు సాధనాలమూలమున కోమల వయస్సుగలవారి విద్యాభివృద్ధి చేయుటకు ఆ దేశము లందు నిరంతరము గాఢమైనకృషి జరుగుచుండును.

ఇట్లే ఐరోపా ఖండమందలి ఇతర దేశములందుకూడ విద్యా ప్రచారము జరుగుచుండును. ఫ్రాంసుదేశమందు స్వయం కృషిమీద జీవనాధారముగల వారల విద్యాభివృద్ధి చేయుటకు నానావిధములగు ప్రతిష్ఠాపనలు అనేకమున్నవి. స్పెయిను, బెల్జియము, హంగరీ, హాలెండు, నార్వే, ఇటలీ మున్నగు దేశములందు కూడ ఇట్టి ప్రతిష్ఠాపనలెన్నియో గలవు.

ఈ విధానము ననుసరించి మన దేశమందు కూడ ఎక్కువ వ్యయ ప్రయాసలు లేకుండనే ప్రభుత్వమువారి ధన సహాయములేకుండకూడ చేయతగిన కృషియెంతయోయున్నది. మన దేశమందు పూర్వమువలె గాక వర్తమాన కాలమందు పల్లెటూళ్లని పిలువతగిన స్థలములందు కూడ సెకండరీ పాఠశాలలేర్పడియున్నవి. ఇందు దేశాభిమానపూరితులును, విద్యాధురీణులునను యువకులెందరో యుపాధ్యాయులుగా నున్నారు. వీరి సహాయముతో ఇంగ్లాండు దేశములో విశ్వ విద్యాలయముల పక్షమున పైన వివరింపబడిన విధమున నడుపబడుచున్న తాత్కాలిక పాఠశాలల కార్యవిధానము ననుసరించి మన దేశమందుకూడ అట్టి ప్రతిష్ఠాపనలను నెలకొల్పవచ్చును. ఆ మూలమున యువకులకు విద్యాభివృద్ధి చేయవచ్చును. 1920 వ సంవత్సరములో రామమోహన ధర్మ పుస్తక భాండాగారపక్షమున బెజవాడలో యిట్టి విధానము ననుసరించి తాత్కాలిక పాఠశాల మూలమున దాదాపు ఇరువదిమంది యువకులకు విద్యాదానము జరిగినది.

# ౧౪. శ్రవణ విధానము-గ్రంథాలయములు

— శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు

గ్రంథాలయోద్యమము ఇతర దేశములలో అనంత ముఖములపెరిగి పోవుచున్నది. పురుషులకు - స్త్రీలకు, శిశువులకు - విద్యార్థులకు, పట్టణవాసులకు - పల్లెటూరివారికి, విద్యావంతులకు, కర్షకులకు, ఖైదీలకు, రోగులకు, విహారార్థము ఉద్యానవనములలో తిరుగునట్టి పాంథులకు, వృద్ధవారికి-అందరకు అన్ని విధములుగ గ్రంథాలయోద్యమము ప్రయోజనపడునట్లు గ్రంథాలయ శాస్త్రము వివిధగ అభివృద్ధియైనది. గ్రంథములు సమకూర్చుటయందు, వానిని ఏకీకరించుట యందు, చదువరులకు వాని విషయమై ప్రబోధము కలిగించుట యందు, చదువరులు గ్రంథములను వినియోగించుటకు ఏర్పాట్లుచేయుట యందు, భిన్న భిన్నస్థలములకు భిన్న భిన్న వర్గములకు సరిపోవు సునిసిత పద్ధతులు సిద్ధమై కార్యక్రమము నందున్నవి. తుదకు ఒక్క గ్రామము ఒక్క ప్రాంతము ఒక్క దేశము నందుండు సర్వగ్రంథాలయముల సంయోగ ప్రయత్నమునకు పునాదులు వైచుట కూడ జరిగియున్నది. నానా దేశముల గ్రంథాలయములవారు ఏకమై గ్రంథములను ఆ దేశము నుండి ఈ దేశమునకు, ఈ దేశము నుండి మరియొక దేశమునకు పరస్పరమెట్లు పంపుకొని ప్రజోపయోగమునకు ఉపయోగించవలెనను అంశమును గూడ 1930 వ సంవత్సరమునందు స్పెయినులో సమావేశమయిన అంతర్జాతీయ గ్రంథాలయ సంఘమువారు చర్చించిరి.

నేటి దినము గ్రంథములను చదువరులకు లభింపజేయుటకు అనుసరింపబడు మార్గములన్నియు విమర్శలోనికి వచ్చెను. పుస్తకములేల దేశ దేశమునకును చేతులు మారవలయునను ప్రశ్న యొకటి అచ్చట తర్కింపబడెను. ముఖ్యమైన గ్రంథములు సినిమాద్వారా, పేజీలవరుసగా ఫిల్ములు తీసి యంత్రముల సహాయమున ఎక్కడివారక్కడ చదువుకొన వీలగు మన్నదిగదాయని వారిప్రశ్నకు ప్రత్యుత్తర మిచ్చుకొనిరి.

## నేత్రేంద్రియ ప్రాముఖ్యము

ఇంతటి విశ్వప్రయత్నమునకును పడమటి దేశముల వారు, ఒక్క గ్రుడ్డివారి విషయమునందు తప్ప, ఎక్కువగా మానవుని నేత్రేంద్రియమునకు ప్రాముఖ్యము నిచ్చియే నడుప జూచుచున్నారు. దీనికి కారణము లేకపోలేదు. ప్రపంచమున అక్షర జ్ఞానము చాల విస్తారముగ పెరిగిపోయి ది ఇంగ్లండులో కొందరయినను అనగా నూటికొక్కరయినను చదువలేనివారున్నారుగాని అమెరికాలో ఎనిమిది యేండ్లకు పైబడిన వయసుగల ఏవ్యక్తియు చదువురానివాడు లేడు. మన ఇండియాబోటి ఏ కొన్ని దేశములలోనో తప్ప, నాగరిక దేశములన్నిటి యందును అక్షరజ్ఞత చాల ఎక్కువ అభివృద్ధి నైయున్నది. ఇంతేకాక, పడమటి రాష్ట్రములలోను, ఉత్తర దక్షిణఅమెరికాలలోను, తుదకు తుర్కిలో సహా రోమనులిపి ప్రచారమునందుండి ముద్రణా సౌకర్యములు అతివేగముగ విజృంభించి యున్నందున, గ్రంథసంపత్తి విపులమై ప్రజల అక్షరజ్ఞతకు దోహదమొనర్చుటేగాక, దాని ప్రయోజనమును గూడ సాధించుచున్నది. ఇచ్చట ఒక్క చిన్న చిత్రమును తెలియపరుచనిండు. పిల్లలు చదువుకొనుటకు పెద్ద పెద్ద గ్రంథములను భాష మార్చి, సులభమైన పదజాలముతో

గ్రంథాలయములకొరకు ప్రత్యేకముగ అచ్చువేయుచున్నారు. అక్షరజ్ఞాన మెక్కువగా లేక పెద్దవారయిపోయి త్వరగా చదువ లేని ప్రజలకు గొప్ప గొప్ప గ్రంథములను సంక్షేపపరచి తేలికయగు రూపమున గ్రంథాలయములకొరకే ప్రత్యేకముగ ప్రకటించుచున్నారు. గ్రంథములలోని సారమును, సొంపును, విషయమును చదువరులకు అందివ్వగలసుశిక్షితులను సిద్ధము చేసి గ్రంథాలయ సేవకులుగ నియోగించుచున్నారు. ఏ దేశపు గ్రంథాలయముల చరిత్రను చదివినను, పాశ్చాత్య దేశములలో, అచ్చుపుస్తకములను చదువుకొనుటకు, అచ్చు చిత్రములను చూచి నేర్చుకొనుటకు అనేక సంవిధానములు కల్పించును. మానవుడు నేర్చుకొనవలసిన విషయములనన్నిటిని మెదడునందు చేర్చుటకు, అనగా వికాసమును మానవునికి కల్పించుటకు, కంటిని ప్రథమాంగముగ వారు గ్రహించినారు. ఇది సామాన్యసూత్రము.

## భిన్న సూత్రము

దీనికి భిన్నమయిన విశేషసూత్రమునువా రంగీకరింపక పోలేదు. గ్రుడ్డివారలకు పెట్టిన గ్రంథాలయాలలో స్పర్శజ్ఞానము చేత విషయము గ్రహించుటకు కావలసిన గ్రంథము లేర్పడి యున్నవి. వానికిని అక్షరములే ఆధారములు. ఉబ్బయిన అక్షరములతో గ్రంథములు ప్రకటించి, చేతతడుముటచే స్వరూపజ్ఞాన మాత్రమున గ్రుడ్డివారు విషయము గ్రహించుటకు ఉపాయములు పన్నినారు. ఇంతకు తప్ప స్పర్శచే వికాసముకల్గుటకు అవకాశమున్నదని పాశ్చాత్య శాస్త్రజ్ఞులు ఇప్పటికంగీకరింపలేదు.

## శ్రోత్రేంద్రియము

జ్ఞానేంద్రియములలో విజ్ఞానసంపాదనకు ప్రబల సాధనముగాగల మరియొక ఇంద్రియము, ప్రత్యేకముగ ఎవ్వరును

పేరొక్కొనక పోయినను. అందరకును స్ఫురింపగలదు. ఉపాధ్యాయుడు బోధించునప్పుడు, వక్త ప్రసంగించునప్పుడు, ఇత్యాది సర్వ వ్యవహారములలోను పనికి వచ్చు జ్ఞానేంద్రియము శ్రోత్రము. తేటతెలుగు మాటలో చెవి. పాశ్చాత్యులు ఈ జ్ఞానేంద్రియమును గ్రంథాలయప్రయత్నమున తోలగ ద్రోసిరా యను ననుమానము మనకు కలుగక పోదు. వారు తోలగ ద్రోసినను ఇది తోలగునట్టిదిగ లేదు. ఇటీవల గ్రంథాలయోద్యమమునందు కొన్ని కొన్ని గ్రంథములను గ్రామఫోను రికార్డుల కెక్కించి, భద్రము చేసి, అచ్చటచ్చట వినిపించుట ఆచారమయినది. మన దేశమునందు గూడ గాంధిగారి యుపన్యాసము, సరోజిని వాక్కులు ప్లేటుల కెక్కినవి. మన దేశమునను, పడమటి దేశములలోను, మరియొక వార్తావహ విజ్ఞాన వాహక యంత్రము బహుత్వరిత గమనమున ప్రచారనకు వచ్చినది. అది రేడియో సంస్థాపన. బ్రిటిష్ బ్రాడ్కాస్టింగ్ సర్వీసువారు అనుదినము ఇంగ్లండులోనుండి చారిత్రక, వాఙ్మయ, వారిశ్రామిక, వ్యవసాయిక ప్రకృతి శాస్త్ర వైశిష్యములను పెద్దలచేత రేడియోలలో చెప్పించి, ప్రపంచమునకు వ్యాపింపజేయుచున్నారు. మన టాకీలవలన లోకమున దృశ్యముగను, శాబ్దికముగను విజ్ఞాన వికాససాధన జరుగుచున్నది. అచ్చుపుస్తకముల కాగితముమీది చిత్రములు వీటినే ఆధారముచేసి కొనదగినదను ప్రాచీనాచారమును విడువలేకయో, మరి ఏ కారణముననో పాశ్చాత్య దేశముల లోని గ్రంథాలయోద్యమము ఇంకను దృష్టిని శ్రోత్రేంద్రియ ప్రయోజనము మీదికి మరల్చియుండలేదు

## వట్టి యనుకరణము వలదు

మనదేశమున గ్రంథాలయోద్యమమును అభివృద్ధి పరచుటకు కంకణము కట్టిన కొందరు అన్ని విషయములందు

వలెనే ఈ యుద్యమ విషయమునందును పాశ్చాత్యదేశజులను అనుకరించుటను పూర్ణముగ నేర్చుకొని ఈ దేశమున నిదివరలో ప్రచారమందున్న సాధనసంపత్తిని వినియోగించుకొనక, నట్టి అనుకరణ మాత్రముచే జీవనము గడుప నిశ్చయించినట్లనుమానము గల్గుచున్నది. దక్షిణమున ఇటీవల ఆరంభమైన లైబ్రరీ అసోసియేషనువారు పడక కుర్చీల పారములు నేర్చి ఎక్కువగా "రీడింగు హేబిట్" "రీడింగు హేబిట్" అని యంగలార్చుట ద్వారా కాలహరణము చేయుచున్నారు. గ్రంథాలయోద్యమమునందు గ్రంథములకు ముఖ్యస్థానములేదనిగాని, "రీడింగు హేబిట్" అంటే చదివే ఆచారము అభివృద్ధి చేయనక్కరలేదనిగాని దేశములోని సర్వ ప్రజలను-స్త్రీలను, పురుషులను, శిశువులను' కూలివారలను అక్షరాస్యులను చేయవలసిన యక్కరలేదనిగాని దీనివలన ననుకొనరాదు. ఇవన్నియు ముఖ్యములే; సాధింపతగినవే కాని మనరాజకీయ పరిస్థితులలో ఆర్థిక గతులలో మనకివి సుసాధ్యములుకావు. నేడే సమకూర్చుకొనకలిగినవియుకావు. ఈ మార్గములందు ప్రజలను చొప్పించుటకు తగిన యధికారముగాని, ఆర్థిక శక్తిగాని మనచేతులలోలేదు. అందువలన విజ్ఞాన వికాసములు మరి యితర మార్గముల మన ప్రజలలో వ్యాపింపజేయు నుద్యోగము వెదకి కనుగొని చేయవలసి యుండగా, అట్టిమార్గము కంటికి కట్టినట్లు మన దేశచరిత్రమున దేశాచారముగ కనుపించుచుండగా, వినియోగపరచుకొనలేక పోయితిమేని వట్టి వ్యర్థుల మగుదుమనుటకు సందేహము లేదు.

## ప్రజాకర్షణోపాయము ప్రథమ గణ్యము

మన పెద్దలు విజ్ఞాన వికాసమునకు మార్గము వేయుచు శ్రవణ, మనన, ధ్యాన-ఇత్యాది సాధనములను సూచించిరి.

ఇందులో శ్రవణమార్గ ప్రయోజనమును సాధించుటకు వేన వేల యుపాయములను నిర్మించిరి. త్యాగరాజుబోటి భక్తుడు సంగీతముపాడెను. నటరాజుబోటి దేవుడు నృత్యముచేసెను. పురాణశ్రవణము, హరికథ, భజన, జంగముకథ, వీధి నాటకముఇత్యాదులువాడవాడకు, గ్రామగ్రామమునకు, సంఘము సంఘమునకు తెగతెగకు, ప్రాకినవి. రామాయణపుపాటలు, భారతపు పాటలు కృష్ణలీలలు, వైరాగ్యపుపాటలు, తుదకు గణితపు పద్యములు ఇన్నియును అక్షరము రాని ఆడముదుసలుల రక్తములో జీర్ణమైనవి. ఇప్పటికిని హరికథయనిన నూర్లకొలది ప్రజలు సమావేశమగుదురు. సప్తాహములనిన వేలకొలది గుమిగూడుదురు. ఇన్నిటను మనపెద్దలు శ్రోత్రేంద్రియమునే ప్రధానముచేయుటకు కారణ మరయవలయును. ముప్పదిమంది విద్యార్థుల తరగతిని, ఒక్క ఉపాధ్యాయుడు తన కంఠధ్వనిచే తరిబీతు చేయకలిగిన రీతిని, వేలకొలది జనసమూహమున కుపన్యసించి వక్త తన భావములను వారికెక్కించు వగిది, లక్షలు, కోట్లకొలది ప్రజల శబ్దబ్రహ్మము నందించి వికాసము కల్గించుటకు ప్రయత్నించు రేడియోవలె గాదు-కాదు వీనినన్నింటిని వేయి విధముల మించి, శబ్దబ్రహ్మము నుపాసించి ఫలమందుట కొరకు మన పెద్దలు మానవుని హృదయ తంత్రులను ఆయా రసానుభవమున కనువగు రీతిని మాటనుద్దేశముతో, సంగీతమును, సాహిత్యమును, విజ్ఞానమును మేళవించి, శ్రవణేంద్రియము నాధారముజేసి సర్వకాల సర్వావస్థలకును, సులభముగ పనికివచ్చు సుబోధకమార్గములను సిద్ధపరచిరి.

## అప్రయత్న ప్రబోధాధారమేది ?

శ్రోత్రేంద్రియమునకు విషయము మానవుని ప్రయత్నము లేక చేరుట కవకాశమున్నది. నయనములు జాగ్రదవస్థ

యందును, మూతపడుటకు అవకాశముకలదు. వానిని తెరచి యుంచుటకు ప్రయత్నమవసరము. ఈశ్వరోద్దేశము మనకు తెలియదు కాని, శ్రోత్రమునకుమాత్రము ఈ నిర్బంధములు అతడు పెట్టలేదు. మానవుడు సాధారణముగ ఇతర కార్యాసక్తుడై యున్నప్పుడు దృక్కులా కార్యముపై కేంద్రీకృతము లగుట సహజము. శ్రోత్రములు మాత్రముఅట్టి కేంద్రికరణము నకు పాత్రములుగావు. ఓడనడుపుచు, పాటపాడు బేస్త తన పాటచే తానే వీనుల విందొనర్చుకొని, శ్రమను పరిహరింపు కొనజూచుచున్నాడు. "గంగమ్మతల్లికి చెంగల్వపూదండ జోర్సేయ్, బార్సేయ్, గోదారితల్లికి గొజ్జంగిపూదండ జోర్సేయ్, బార్సేయ్" అని పండితులైన వేదము వేంకట రాయశాస్త్రులవారు ఈ అభ్యాసమును ఛాయామాత్రముగ కనుబరచినారు. వేణువూదికొనుచు పసులకాపరి తనపనిని నిర్వహించుట లోకప్రసిద్ధము. అడవులలో చెట్లునరకు బోయ మహత్తమమయిన కాయకష్టము చేయుచు సంగీతము పాడు కొనుట అడవులలో తిరిగిన వారెరుగుదురు. పై దర్జావారి విషయామాలోచించినను మహత్కార్యములలో నిమగ్ను లయిన విద్యావంతులుగూడ ఏ ప్రాంతమునుండియో 'నానా గాయన గాయనీ మణుల గానంబుర్వినాలించి' ఆనందించు వారుగలరు. ఇట్లుండ విజ్ఞానసాధనకే సంగీతసుధా నిష్యంద నము ఆధారము చేయుటచేత కలుగునట్టి ఫలము అద్వితీయ మని మనపెద్దలు గణించిరనిన, వారి ప్రతిభవిషయమున నేటి నవనాగరకులుగూడ తలలూపవలసివచ్చును. శ్రోత్రేంద్రియమును ఆధారముచేసి బోధించుటకును, సరియైన పద్ధతులలో ప్రజలనాకర్షించుకొనుటకునుఏర్పాటులుజరుగు పక్షమున విజ్ఞాన వికాసవ్యాప్తికి ఇప్పుడుండు కొన్ని ఆటంకములు గట్టిగ తొలగిపోవుననుట నిజము. అక్షరములు రానివారికి బోధ

చేయుట సుసాధ్యము కాదను కష్టముండదు. తెలుగుభాష లోనికి అథవా ఇతర దేశభాషలలోనికి నేటి అత్యుత్తమ వాఙ్మయము భాషాంతరీకరణము కాలేదను దుఃఖముండదు. ప్రజలు మన గ్రంథాలయము ఆవరణలోనికి అందఱును వచ్చి చదువలేదేయను ఆశాభంగముండదు. వేనవేలు ద్రవ్యము వెచ్చించి, గ్రంథసమూహములను ప్రతిచోటను పెంచి ఆర్థికముగ దుర్దశలపాలు గావలసిన పనియుండదు. సాధ్యమయిన చోట్ల మంచి వసతులతో గ్రంథాగారములు నెలకొల్పి, అనువయిన దేశఖండమునందు సంయుక్త కార్యక్రమమును వీనికన్నిటికి ఏర్పరచి, వీనిపక్షమున సంచార గ్రంథాలయ విధానమును నడుపుచు, దానివెంబడి సుశిక్షితులైన గ్రంథాలయ సేవకులను పంపి భజన, కీర్తన, పురాణ-ఇత్యాది పద్ధతుల ఛాయను నవీనజ్ఞాన సంపదను వ్యాపింపజేయుటకు వినియోగించినయెడల, మితవ్యయముతో వ్యాప్తకార్యమును సాధించుటకు రాచబాట వేసిన వారగుదుము. ప్రభుత్వమువారి వివిధశాఖలలోని ప్రబోధకోద్యోగులను, అనగా వ్యవసాయ, పరిశ్రమ, పశుచికిత్స, ఆరోగ్య, విద్యాశాఖలవారును, అనధికార విద్యాప్రచారక సంస్థలును గ్రంథాలయోద్యమమును తమ యుద్యమముగానెంచి, ఇంకను బహుకాలమువరకు పూర్తిగ అక్షరాస్యులు కాలేని మనదేశ ప్రజలకు శ్రోత్రేంద్రియ వికసనముద్వారా విజ్ఞానవ్యాప్తి జేయు ప్రయత్నములు చేయుటయే నేడు తరణోపాయమని ఎవ్వరికైనను గోచరింపగలదు. ఇది నేటిపరిస్థితులలో మన కావశ్యకమని మన మనుసరించుటచేత ఏనాటికో ఈమార్గమే ప్రపంచమునకు సులభతరమార్గమై, మనము కష్టపరిస్థితులలో వైచిన బీజమే లోకమునకు తారకోపాయము కాగలదని, క్రమక్రమ

ముగ మాబోంట్లకు విశ్వాసము హెచ్చుచున్నది. అచ్చు గ్రంథములు, యంత్రములు అన్నియు ఆర్థికప్రధాన మార్గములుకాబట్టి, ఇవి మితిమీరి అనంతరూపముల విజృంభింపవలెనన్న మితిమీరిన ఆర్థికబలమును సమకూర్చవలసివచ్చును. ఆబరువుచేతనే ఈమార్గ మొకప్పుడుగాకున్న మరొకప్పుడయినను, క్రుంగిపోవలసినదగును. దీనిని మితియందుంచి, ఆర్థిక కష్టములను నివారించి, దీనికిప్రాణశక్తి రూపకమై పనిచేయుగల సంవిధానము మనదియని, సృష్టిస్వభావము నెరింగిన శాస్త్రవేత్తలు అంగీకరింపవలసి యుందురు. ఈ విషయమై కలిగినచో గ్రంథము విపులముగ పెంచవలసినపని యేర్పడును. అది ప్రస్తుతముకాదు.

# ౧౫. పొత్తపుగుడి కొలువరులు

— శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి

పొత్తపుగుడులు పెంపొంది అవి సరిగా పనిచేయుచో తెనుగువారు బాగుపడుదురను నమ్మకము కలిగి, "గ్రంథాలయ సేవకులము" అని చెప్పుకొనువారు తాము చేయవలసిన పనులు తెలిసికొని, వానినిబట్టి నడచుకొనవలె.

## చేయవలసిన పనులు

౧. పొత్తపుగుడులవలననే ప్రజలందరికిని జ్ఞానమును, దానివలన ఐకమత్యమును కలిగించి, దేశమునకు స్వాతంత్ర్యమును సమకూర్చి తమ దేశమును ఆదర్శదేశముగా చేయుటకు కంకణము కట్టుకొనవలె.

౨. తమప్రయత్నము నెగ్గుటకు తాము పగలేని పట్టుదలయు, మచ్చలేని మంచినడతయు అలవఱచుకొనవలెనని గుర్తింపవలె.

౩. పేరుకొరకును, అధికారముకొరకును దేవులాడరాదు. పదవులలో నున్నను తమ అధికారము దుర్వినియోగము చేయరాదు. తోడి కొలువరులతో జట్టీలు పడరాదు; వారిపై అసూయపడరాదు; పనినిబట్టి వారిని మన్నింప నేర్చుకొనవలె. తమపట్టే నెగ్గించుకొన చూడరాదు. ఆత్మస్తుతియు, పరనిందయు ఉద్యమమునకు ముప్పు తెచ్చునని ఎఱుంగవలె. అవి విడువవలె.

౪. ఉద్యమమునకు ఎవరివలన ఎట్టిసాయము కలుగునో తెలిసికొని, వారివలన అట్టిసాయము లభించుటకు తగినట్లు తాము నడచుకొను నేర్పు బాగుగ గడించుకొనవలె.

౫. మంచి నడతవలనను, కార్యదీక్షవలనను తాము తోడికొలువరులకు మేలుచరితులై వారి మన్ననకు పాత్రులై మెలగవలె, అందువలన పెక్కుమందిని ఆకర్షించి ఉద్యమమున చేర్చి పని విరివిగా జరుగునట్లు చేయవలె.

౬. బింకపు నడవడి వేఱుపాటు నెరవు కాన అది తమయందు ఎప్పుడును తలచూపకుండునట్లు జాగ్రత్తపడవలె.

౭. తెనుగు బాగుగా చదువుకొనవలె; దానికితోడు సంస్కృతమును, ఇంగ్లీషును, హిందీయును, వలయుచో ఉర్దూను నేర్చుకొనవలె, పాండిత్యము గడించుట ప్రశస్తము, ఉపన్యాసము లిచ్చుటకును, వ్యాసములును, పుస్తకములును వ్రాయుటకును సమర్థులుకావలె.

౮. మంచి చదువరులగుటకుతోడు మంచిపాటకులగుచో బంగారమునకు తావి అబ్బినట్లగును గాన సంగీత జ్ఞానముకూడ సంపాదింప ప్రయత్నింపవలె. తేటగా పద్యములు చదివియు, ఇంపుగా పాటలు పాడియు, చాలమందిని పొత్తపుగుడులకు ఆకర్షింపవలె.

౯. పనిచేయుచున్న పొత్తపుగుడులు మరింత హెచ్చుమందికి పనికివచ్చునట్లు చేయవలె. మూలబడిన పొత్తపుగుడులు మరల పనిచేయునట్లు పాటుబడవలె. లేనిచోట్ల పొత్తపుగుడులు పెట్టింపవలె.

౧౦. సొంతయిండ్లులేని పొత్తపుగుడులకు తగినయిండ్లు లభించుటకు గట్టిప్రయత్నము చేయవలె.

౧౧. సభ్యుల చందాలవలన వచ్చురాబడి గ్రంథాలయములు సరిగాపనిచేయుటకు చాలదు. కాని ఊరిఉమ్మడి రాబడి నుండియు, దేవాదాయ ధర్మాదాయములనుండియు, స్థానికసంస్థలనుండియు, పరపతి సంఘములనుండియు, ధనిక

లగు దాతలనుండియు, బిడ్డలులేని ఆస్తులనుండియు, ఇంకను తక్కిన వెరవులనుండియు తగినంతడబ్బు రాపట్టవలె.

౧౨. స్మారకచిహ్నములుగా వారిపేర్లతో పొత్తములు, బీరువాలు మొదలైన కావలసిన సామాను కానుకలుగా సంపాదింపవలె.

౧౩. పాటకచేరీలు, కవితాగోష్ఠులు, భజనలు, హరికథలు, ఉపన్యాసములు, పురాణములు చదివించుట, నాటకము లాడించుట, బొమ్మలు చూపుట, రేడియో మొదలైన సాధనములవలన హెచ్చుమందిని గ్రంథాలయములకు రప్పించి వారిలో తగినవారిని పోషకులును సభ్యులును అగునట్లు చేయవలె. స్త్రీలను సభ్యురాండ్రుగా చేర్చి వారిలో ఒకరిని కార్యదర్శినిగా ఎన్నుకొని, ఆమెవారితోను, పిల్లలతోను సంబంధించిన పని ఆమెకు అప్పగించవలె.

౧౪. వీలగుచో స్త్రీలకు ప్రత్యేకముగా పొత్తపుగుడులేర్పఱుపవలె. అపుడు పిల్లలను స్త్రీల గ్రంథాలయములకే రప్పింపవలె.

౧౫, పరిస్థితులనుబట్టి ఆయా పొత్తపుగుడులకు కావలసిన పుస్తకములయు, పత్రికలయు జాబితాలు తయారుచేయవలె. రాబడినిపట్టి మిక్కిలి ఆవశ్యకములైనవి మొదటచేర్చి, పిదప క్రమక్రమముగా తక్కినవి చేర్చవలె.

౧౬. చదువురానివారికి పత్రికలలో ముఖ్యభాగములును, పొత్తములును చదివి వినిపింపవలె.

౧౭. పత్రికలలోను, పొత్తములలోనుఉన్న ముఖ్యవిషయములు నల్లబల్లమీదగాని, సిమెంటుచేసిన గోడమీదగాని వ్రాసియో, తుదకు కాగితముమీద వ్రాసి అట్టలమీద అం

టించి గోడకు తగిలించియో, చదువరులపనికూడ సులువు చేయవలె.

౧౮. పౌస్తపుగుడులకు రాజాలని వారున్నచోట్లకు వెళ్ళి వారివారికి తగినవిషయములు చెప్పి, చదువవలసిన పొత్తములిచ్చి, అవి మరల రప్పించుకొనవలె.

౧౯. ఎచ్చట ఎవరికి ఏవిషయములను గూర్చిన పత్రికలును పొత్తములును ముఖ్యముగా తెలిసికొని అవిచేర్చి, చదివి, చదివించి, చెప్పి, వ్రాసి, వానికి ఆవిషయములను గూర్చిన జ్ఞానము సమకూర్చి వారు మేలొందుటకు తోడ్పడవలె.

౨౦. వ్యవహారజ్ఞానము కలిగించు పుస్తకములు మొదలగునవి చేర్చి, కోరినవారికి సలహాలిచ్చుచుండవలె. కోర్టులకెక్కు దురాచారము వీలగునంతవఱకు తగ్గింపవలె. మఱచిపోయిన గ్రామస్వరాజ్యకళ పల్లెలవారికి బాగుగా పట్టుపడునట్లానర్పవలె.

౨౧. ఈడుమీరిన వారికి చదువు నేర్పుటకు తగిన యేర్పాటు తప్పక చేయవలె.

౨౨. పిల్లలను తగినవేళను పౌత్తపుగుడులకు రప్పించి, ముచ్చటించియు, కథలుచెప్పియు, బొమ్మలుచూపియు, ఆటలాడించియు, వారిజ్ఞానమును హెచ్చించి, అందునలన పత్రికలును, పొత్తములును చదువుకొనవలెనను అపేక్ష వారికి కలిగింపవలె.

౨౩. ఒడలు జబ్బులపాలు గాకుండుటకు ఎవరికితగిన సాము వారికి నేర్పుటకు ప్రయత్నింపవలె. తెలిసినవారిచే ప్రాణాయామము, ఆసనములు, దేశవాళీఆటలు మొదలగునవి నేర్పింపవలె.

౨౪. చదివిన పొత్తములలో పరీక్షలు పెట్టి నెగ్గినవారికి కానుకలిచ్చి మంచిపొత్తములే చదువుటకు ప్రోత్సాహము కలిగింపవలె.

౨౫. సభ్యులకును, ఇతరులకును ప్రోత్సాహము కలుగుటకు వార్షికోత్సవములు మొదలగునవి జరుపుచుండవలె.

౨౬. గ్రంథాలయ యాత్రలలో వాల్గొని, బాగుగా పనిచేయు పొత్తపుగుడులనుగూర్చి తెలిపి, వెనుకపడియున్న వానిని ప్రోత్సహింపవలె.

౨౭. తాలూకా, జిల్లా గ్రంథాలయ మహాసభలు జరిపించి, స్వదేశ విదేశములందు గ్రంథాలయోద్యమములో జరుగు విశేషములు తెలిపి, ఆయా తాలూకా, జిల్లాలలో ఉద్యమము ఉన్నతస్థితికి తెచ్చుటకు ప్రయత్నింపవలె.

౨౮. ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభలలోను, ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక మహాసభలలోను పాల్గొని, తమ ప్రయత్నములవలననో ఇతరుల ప్రయత్నములవలననో కలిగినలాభములు వెల్లడించి, గ్రంథాలయోద్యమము తెలుగునాట అంతట బాగుగా వ్యాపించి వాంఛితార్థము చేకూర్చునట్లు చేయవలె.

౨౯. సాధారణముగా పొత్తపుగుడులలో జరుగు పనితో సంతృప్తిపొందక వానకోలతయు, వేడికొలతయు, గాలిఉనికియు తెలుపు పనిముట్లను, గ్రామఫోనులు, మేజిక్ లాంతరులు, ప్రమాదములకు తొలిసాయము చేయుటకు వలయు పనిముట్లు మొదలగునవి సేకరించవలె.

౩౦. ప్రాత వ్రాతపొత్తములు, రాతిశాసనములు, రాగిరేకు శాసనములు, రాతిబొమ్మలు, ప్రాతనాణెములు, వ్రాతపోటుముట్లు మొదలగునవి సంపాదించి భద్రపరుపవలె.

౩౧. ఊళ్ళు, ప్రోళ్ళు పొత్తపుగుడులు ఒండొంటికి తోడ్పడి, పెంపుచెందుటలోను, మేలుచేయుటలోను పోటీపడి చాలమందికి బాగుగా పనికివచ్చునట్లు చేయవలె.

౩౨. ఎవరిమతమువారికి తెలియునట్లు చేసి తాము మతసమానము కలవారై పరులకవి కలిగింపవలె.

౩౩. చెడ్డవారిని మంచివారినిగా చేయప్రయత్నింపవలె.

౩౪. పొత్తపుగుడులు లేని ఊళ్ళకు సంచార గ్రంథాలయములు పంపి అందువలన అచ్చటివారికి జ్ఞానము సమకూర్పవలె

౩౫. తెలుగువారందఱును పొత్తపుగుడులవలన తగిన జ్ఞానమువలన తాము స్వార్థపరత్వము చంపుకొని, తోడివారిని తమవలె చూడగలిగి, కలిసికట్టుతనము గడించుకొని, అందరును స్వతంత్రులై ఇహపరసుఖములు పొంద సమర్థులగునట్లు చేయవలె.

౩౬. తాము స్వార్థత్యాగులై, పరోపకార పరాయణులై మార్గదర్శకులై వెలయవలె.

# ౧౬. గ్రంథ నిలయార్చకుడు

— శ్రీ పెరుంబూదూరు లక్ష్మీనరసింహాచార్యులు

గ్రంథ నిలయార్చకుడు సరస్వతీ దేవాలయములోని పూజారివలె ననుదినము భక్తుల నాకర్షించు శక్తిగలవాడై యుండవలెను. మనస్తత్వమును తెలిసినవాడై సమస్త కళాభిరుచులను చవిచూచి నిత్యము చదువరులకు వారివారి యభిరుచుల ననుసరించి పుస్తకముల నిచ్చి, అవసరమైనప్పుడు సందేహతృష్ణను నివారించి సంతృప్తి పరచవలెను. ఈవిధముగ దినదినము చదువరుల నెక్కుడుగా నాకర్షింప గలిగి సూదంటురాయివలె వ్యవహరించవలెను. ఎంతమంది వచ్చినను సణుగుకొనక, సహనము, సౌజన్యము, శాంతము కలిగివుండి వారు అడిగిన గ్రంథముల నిచ్చుటయేగాక సద్గ్రంథముల సూచించు వృత్తిగలవాడై యుండవలయును. ఉద్రేకపూరితులు నిష్టోన్మాదమునకు కారణములగు గ్రంథముల నడిగినచో నివ్వక నుత్సాహభంగము కాకుండ అట్టి గ్రంథములవల్ల కలుగునష్టములెల్ల తెలియజెప్పి సద్గ్రంథములోని సారాంశమును బోధించి సదా యట్టి గ్రంథములనేపాఠకులకు యిచ్చుచుండవలెను. ఒకముక్కలో చెప్పవలెనినిన "సరస్వతీ రాజ్యమున రాచకార్య నిర్వాహకుడగు ప్రెగ్గడయై గ్రంథాలయ కార్యదర్శి మెలగవలయు నన్నమాట.

కొంతకాలంక్రితం ఒక పట్టణాధికారి యొక్క గ్రంథాలయోద్యోగి కాతిథ్యమియ్యవలసి వచ్చినదట. ఆ యుద్యోగి అవిద్యావంతుడని యతని నాహ్వానించుట యవమానకరమని తలచి విచారించుచుండగా యాయధికారి గుమాస్తా 'తా నాతిథ్యమిస్తానని యొప్పుకున్నతరువాత అతని చికాకు

కొంత తగ్గిందట - యీ విషయం తెలియని గ్రంథాలయో ద్యోగి పట్టణాధికారి ఇంటికిపోయి యొక చీటీపై తనపేరు వ్రాసి లోనికి పంపించినాడట. ఆచీటిపై యీతని పేరు ప్రక్కన వున్న ఎం. ఏ అను రెండక్షరాలను పట్టణాధికారి చూచి విస్తుపోయి, అప్పాశునికి తాను స్వయముగా నాతిథ్యమిచ్చి నాడట. తాంబూల సమయములో యింతగా చదువుకున్న వారికి యీ నీచోద్యోగము దాపురించినందులకు విచారించు నా యుద్యోగి తన జీతమును తెలియజేయ, పట్టణాధికారి నెరగుపడి తనజీతముకన్న యెక్కువగా నున్నందులకు దేశా దాయములోని యింతసొమ్మును వ్యర్థంగా వాడుచేయు చున్నారని దూషించినాడట. ఇంకను యిటువంటివారు కొంద రున్నారనడం నిస్సంశయము. గ్రంథనిలయము నెప్పుడు చూడక, వాని లాభములను పొందక, అమాయకులుగా తిరుగువారు యీ యుద్యోగిభావములు కలవారుగా నుండ వచ్చును. కాని తఱచు గ్రంథాలయములను రాకపోకలు కలిగి తమ జీవితకాలములో యేదైన యొక విషయాన్ని గూర్చి పరిశోధన జేసినవారు మాత్రం గ్రంథాలయోద్యోగు లను విద్యావంతులుగా నుండవలెనని, తాను పరిశోధించు తున్న విషయానికి కొంత సహాయము చేయగలిగినవారుగా నుండవలెనని ఆశించుతూ వుంటారు. ఒకానొక విశ్వవిద్యా లయ అధ్యక్షుడిట్లున్నాడు "గ్రంథాలయ కార్యకర్త బోధ కుడుగా నుండవలెను. అతనికి కార్యనిర్వహణా సామర్థ్య ముండవలసినదే కాని అతడు నిరక్షరాస్యుడైతే అది కేవ లము వ్యర్థమే." గ్రేటు బ్రిటను పబ్లికు లైబ్రరీ కమిటీవారు యీ విధంగా నిర్ణయించారు. "లైబ్రరి వుద్యోగులు వివిధ సారస్వతాలయందు ప్రవేశము, ఆదరము గలవారుగను, పాఠకుల కవసరమగు సహాయం చేయగలవారుగను, పాఠకులు

తెలుసుకోగోరే విషయ మే గ్రంథంలో వుంటుందో వెంటనే తెలుపగలవారుగను ఉండవలెను. వారు లైబ్రరీలోని పుస్తకాలు మొదలైనవాటిని కేవలం జ్ఞానం వ్యాపింపజేయడానికి మాత్రమే గాక, దానిని విస్తరింపజేయడానికి వుపయోగించు సమర్థులై యుండవలెను.” దీనివలన పాశ్చాత్య దేశములలో విశ్వవిద్యాలయ సామాన్యపట్టములు (University degrees) గ్రంథాలయ పాఠశాలలో ప్రవేశించుట కర్హత కల్పించుచున్నవని మాత్రమే తెలియుచున్నది. గ్రంథనికేతనములలో గొప్ప యుద్యోగములు కావలయునని వారికి పెద్దపట్టములు కావలయును. దీనిని బట్టే ఆర్నాల్డు బెన్నెట్టు యీ విధంగా సూచించినారు. “పుస్తక భాండాగారాలు, పుస్తకాలకు తక్కువగును, విద్యావంతులగు నుద్యోగులకు యెక్కువగను సొమ్మును వెచ్చిస్తే లాభం చాలా కలుగుతుంది. భాండాగారాలలో పుస్తకాలకు యే కొరత యుండదు. కాని వాటిని చక్కగా యుపయోగించకము తెలియకపోవడమే కొరత. విద్య, వ్యక్తిత్వముగల యుద్యోగులుంటే యీ కొరత తీరుతుంది”

గ్రంథాలయోన్నతిని గురించి విశ్వకవి రవీంద్రనాథ టాగూరు ప్రవచించిన సూక్తులు:

“గ్రంథాలయాధికారి ఉన్న గ్రంథములన్నింటిని సరిగా అర్థము చేసుకొని యుండవలెను. గ్రంథాలయము మిగుల పెద్దదైన యెడల యట్లర్థ మొనర్చుకొనుట కతని కశక్యమగును. అందువలన నా యూహయందు పెద్ద గ్రంథాలయము ప్రాణము వంటిది. చిన్నది మాత్రమే భోజనశాల వలె దినదినము ఆహారమును, ఆనందమును సమకూర్చునది.

“చిన్న గ్రంథాలయమున అతిథుల యానందమునకు సరిగా సరిపోవు సామగ్రి యుండవలెను. దాని యధికారికి గృహమేధి గుణము లుండవలెను. కాని ఉగ్రాణపు కావలి వాని గుణము లుండగూడదు.”

# ౧౭. గ్రంథాలయము - గ్రంథాలయ సేవకుడు

— శ్రీ పీతాంబరం వేంకటకృష్ణమాచార్యులు

గ్రంథాలయము ప్రజల విశ్వవిద్యాలయము. ఇది నిరక్షరాస్యతను నిర్మూలించి దేశ కల్యాణమునకు జ్ఞాన జ్యోతులు వెలిగించు దివ్యస్థలము. ప్రతివ్యక్తియు, బడిచదువు పూర్తి అయినపిమ్మట గ్రంథాలయమందలి పుస్తకరూపిణి యగు సరస్వతిని ఆరాధించినగాని పరిపూర్ణుడు కాజాలడు.

గ్రంథాలయోద్యమము పవిత్రమైనదని చెప్పుట అతిశయోక్తి కాజాలదు. అమెరికా కోటీశ్వరుడగు ఆండ్రూ కార్నెగీ దీని ప్రాశస్త్యమును గమనించియే కొన్నికోట్ల డాలర్లు ఉద్యమవ్యాప్తికి విరాళముగా ఇచ్చినాడు. ఈ ఉద్యమంలో స్వార్థరహితమగు త్యాగమున్నది. కోటిమానవులు చదువులునేర్చి, జ్ఞానవంతులు, విజ్ఞానవంతులునయి, సోమరితనమును పారద్రోలి ఆత్మగౌరవమును, అన్నవస్త్రములకు లోటులేని ఇహసౌఖ్యమును, ఆనందామృతాస్వాదనా రూపమగు పరసౌఖ్యమును పొందవలయు నను సంకల్పమే ఈ ఉద్యమమునకు పునాది.

## గ్రంథాలయ నిర్మాణము

పవిత్రమగు గ్రంథాలయమును ప్రతి గ్రామమందును దేవాలయములవలె ఉన్నతమగు స్థలమున చూచువారికిది శ్రీ సరస్వతీదేవి కాటపట్టని తెలియునటుల మంచి వెలుతురు, స్వచ్ఛమైన గాలి ప్రసరించు లాగున నిర్మించవలెను. అందు పొత్తములను భద్రపరచుటకు చూచువారి మనస్సుల

నాకర్షించుచులాగున అందమైన బీసువాలను అమర్చవలెను. పూర్వము దేవాలయములే ప్రతిగ్రామమున విశ్వవిద్యాలయములుగ అన్ని కళలను పోషించుచుండెడివి. ఆరోజులలో దేవాలయ ధర్మకర్తలును, సేవకులును ఆదర్శము కొఱకు, దేశకల్యాణము కొఱకు తమ జీవితములనైన ధారవోయు త్యాగమూర్తులుగ నుండెడివారు. ఇప్పుడు దేవాలయా దర్శము కాలగర్భమున మునిగి దేవాలయములు వర్తకస్థానములైనవి. దేవాలయాధికారులకు, సేవకులకుకూడ స్వార్థపరత హెచ్చినది

## గ్రంథాలయ నిర్వహణము

గ్రంథాలయ స్థాపన ఉదారులగు గ్రామవాసుల సహాయమున చేయవచ్చును గాని నిర్వహణము మట్టుకు చాల కష్టమైన పని. భోగలాలసులగు సుఖోపాసకులవల్ల అదిసాధ్యపడునదికాదు. గ్రంథాలయసేవ కష్టపరంపరల యందు నిశ్చలమగు ఆనందమయ జీవితము గడపగలిగినవారికే సాధ్యపడును. గ్రంథాలయమందుండువారు తమ జీవితపరమావధి గ్రంథాలయసేవయేనని నిశ్చయించుకొనినగాని గ్రంథాలయము అభివృద్ధి పొందజాలదు. పాలకవర్గమువారు కూడ అహంభావమును, అధికారతృష్ణను విడనాడి వేతనములు పుచ్చుకొను సేవకులకంటె అధికముగ పాటుబడినగాని గ్రంథాలయము ఆదర్శముగ నడుపబడదు. ఎంతమంది పని చేసినను పనిచెప్పగల సంస్థ గ్రంథాలయముగాన వేతనములు పుచ్చుకొనువారుకూడ జీతముకొరకే పనిచేయుచున్నామనే భావమునువిడిచి, పొట్టగడవక జీతము పుచ్చుకొనుచున్నామే గాని, మా జీవితములు గ్రంథాలయసేవకు సమర్పణ చేయుచున్నాము అని త్రికరణయా సంకల్పించి, కాలమును పాటింపక అవకాశమున్న ప్రతి నిమిషము సోమరితనమును పార

ద్రోలి గ్రంథాలయసేవ చేయవలెను అట్టి సేవచేయు వారిని పోషించవలసిన బాధ్యత పాలకవర్గమునందును, ప్రభుత్వమునందును కలదు. గ్రంథాలయ నిర్వహణగా ఆదర్శముగ నుండవలెనన్న గ్రంథభాండాగారి కడుసమర్థుడుగ నుండవలెను. అతనికి మాతృభాషయందు పాండిత్యమును, రాజభాషతోను, దేశభాషతోను, పరిసరభాషలతోను పరిచయముండవలెను. గ్రంథాలయవారకులను గ్రంథభాండాగారి 'గృహస్థాశ్రమ ధర్మపరిపాలకుడు అతిథుల నాదరించునట్లు' ఆదరించి, వారివారి అభిరుచుల గ్రహించి, వారి బుద్ధివికాసము ఎట్లున్నదో గమనించి, వారికి ఎట్టిపుస్తకముల చదువుట కిచ్చినవారు క్రమవికాసము పొందగలరో అట్టి పుస్తకములే వారి కిచ్చుచు, పుస్తకపఠనమందు వారికి గాఢమగు అభిరుచిని కలుగజేయుచు, వారికి తెలియని విషయముల తెలుపుచు, ఆత్మవికాసమునకు దేశకళ్యాణమునకు హేతుభూతములగు సద్గ్రంథ పఠనము చేయుటకు గ్రంథభాండాగారి శ్రద్ధతీసుకొనవలెను వేదికలపై ఉపన్యసించినంత సులువుగ యిదిసాధ్యపడునదికాదు. తానుఊరివారి ఉపాధ్యాయుడనని గ్రంథ భాండాగారి తలచవలెను. గ్రంథాలయము ఆదర్శ సుఖజీవనమును ప్రసాదించునదిగ నుండవలెనేగాని ఆటలతోను వ్యసనములతోను నిండిపోయి అమానుషత్వమునకు దారిచూపునదిగ ఉండకూడదు. అట్టి సంస్థలు ఏవిధముగ చూచినను ఆత్మోన్నతికి గాని, దేశసౌభాగ్యమునకు గాని ఉపయోగపడజాలవు. భాండాగారి ప్రతివిషయమును విమర్శించి యథార్థమును తెలుసుకొని వారకులకు తెలుపుచుండవలెను. గ్రంథభాండాగారికి కుండవలసిన సల్లక్షణములలో ఓర్మి ముఖ్యమైనది. కన్నతల్లి తనపిల్లలు చేయు అల్లరిని సహించి వారి పునర్భివృద్ధికి ఎట్లుపాటుపడునో అట్లే భాండాగారి పారకులు గ్రంథాలయ నిబంధనల నాచరణలో

పెట్టికపూర్వము చేయు చిరుచేష్టలు సహించి, వారికి హితవు నొసగి, వారిని సన్మార్గులనుగ చేయువలెను. భాండాగారి సంకల్పబలమే గ్రంథాలయ పురోభివృద్ధికి మార్గముచూపు దివ్యజ్యోతి. శ్రీ రామకృష్ణ మఠమువారు ప్రచారకులను తరిఫీయతు చేసి పంపుచున్నమాదిరిగ ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు ప్రతిసంవత్సరము ప్రతిజిల్లాలోను కేంద్రములు స్థాపించి, వేసవి పాఠశాలల ద్వారా ఆదర్శప్రవర్తకులగు గ్రంథభాండాగారుల తయారుచేసినగాని గ్రంథాలయ నిర్వహణము పూర్ణత్వము పొందజాలదు. సక్రమ నిర్వహణ లేని యేసంస్థగాని, దేశమునకుగాని, దేశస్థులకుగాని ఉపకారి కాజాలదు. ఆచరణలేని ఆర్భాటములు నిష్ప్రయోజనములు. మరియు గ్రంథాలయ పఠనాలయములకు వచ్చు రకరకముల మనుష్యులను సద్బాయి చేయగల సమర్థతకూడ గ్రంథభాండాగారి కుండవలెను. పాలకవర్గమువారు గ్రంథభాండాగారిని గుమస్తాగా వాడుకొనక, అతనికి స్వేచ్ఛనొసగి, గ్రంథపఠన మెచ్చుటకు తగు అవకాశములు కల్పించి, తద్వారా భాషాసేవ, గ్రంథాలయసేవ, దేశసేవ చేయగలుగునట్లు వానిని తయారుచేయవలెను. ఆంధ్రులలో ఆరంభశూరత్వము, అనుకరణకలదు. పట్టుదలతో కార్యములను సాధించగలవారు చాలా తక్కువగా ఉన్నారని చెప్పుట సాహసము కాజాలదు. ఏ ఉద్యమమును నడుపువారు ఆ ఉద్యమమును తమ జీవితాంతము వఱకు శ్రద్ధగ నడుపగలిగినచో ఆ ఉద్యమమునకు, ఆవ్యక్తికి సాఫల్యత కలుగునని చెప్పకతప్పదు. పై విధానము ననుసరించియే కొన్ని దేశములలో ప్రతి ఉద్యమము ఉన్నతిస్థానము నలంకరించి ఆదర్శమును వెదజల్లుచున్నది. ప్రతి ఉద్యమము నడుపుటకు ఆర్థికసహాయ మవసరము. దానిని ప్రజలే చేకూర్చి, ఉద్యమసేవకులను ప్రోత్సహించవలెను. పనిచేయుటకు స్థలము, ధనము, కార్యకర్తలు

అవసరము. ఇందు ఏది లోపించినను ఉద్యమము సాఫల్యము పొందజాలదు. అన్నియు సమకూరినను యోగ్యతలేనిచో (వాటియందు పవిత్రత్వము లేనిచో) ఆదర్శరహితమగు పరిపూర్ణత్వమే కాని ఆదర్శసహితము పరిపూర్ణత్వము కాజాలదు. సదుద్యమములను సక్రమముగ నడుపవలెనన్న నిర్వాహకులలో ఐకమత్యము ముఖ్యముగ అవసరము. సహనశక్తి, ఐకమత్యములేని నిర్వాహకులు ఏఉద్యమమును ప్రారంభించినను "పుబ్బలోపుట్టి మఖలో మాడుటయె" తటస్థించును; సలక్షణులగువారిచే నిర్వహింపబడునట్టి సంస్థలు ఆశోన్నతికి, దేశసౌభాగ్యమునకు మార్గదర్శకములు కాగలవు.

## సేవకుడు

గ్రంథాలయోద్యమవ్యాప్తికి స్వార్థరహితముగు సేవ చేయు వారందరు గ్రంథాలయసేవకు లనబడుదురు. ప్రతి గ్రంథాలయ సేవకుడును తనధర్మమును తెలుసుకొని సక్రమముగ ఆచరించినచో గ్రంథాలయోద్యమము వెర్రితలలు వేయక క్రమ వికాసమును పొంది ప్రపంచమందు నిరక్షరాస్యతను నిర్మూలించి ప్రజలను ఆదర్శసుఖజీవనము గడుపు వారినిగ తీర్చి తద్వారా దేశకళ్యాణమును చేకూర్చుననుటకు సందియము లేదు. ఎవరు "నేను సేవకుడ" నను సద్భావముతో దేశమునకుగాని, సంఘమునకుగాని, మతమునకుగాని, ఉద్యమమునకుగాని, సంసారమునకుగాని సేవచేయునో అట్టివ్యక్తియు, అతనిపనియు ఆచంద్రతారార్కము కీర్తి శరీరములు ధరించును. నేను అధికారినను అహంభావముతో చేయబడిన పని తన జీవితాంతములోనే మాసి మట్టి గలియును. "తనవలన కుక్కకైనను అపకారము కలిగినచో కొన్ని వేల జన్మలు ఎత్తుదు"నని శ్రీ రామకృష్ణపరమహంస చెప్పి

యున్నారు. కాన మానవులందరు సర్వభూత సుహృదయులుగ నుండులాగున తయారుచేయవలసిన బాధ్యత గ్రంథాలయ సేవకునియందు కలదు. ఇతరులను ఆదర్శప్రాయులుగ తయారుచేయవలెనన్నచో తాను ఆదర్శప్రాయుడుగ నుండవలెను. ఆదర్శ సుఖజీవి లక్షణము లెవ్వియన 1. తన శరీరమును తానెట్లు ప్రేమించునో సర్వభూతముల నట్టుల ప్రేమించుట, 2. పెద్దలకు వారియందు విధేయత కనబరచుట, 3. పరస్త్రీని తల్లిగ దలెను, పరధనమును చిల్లపెంకువలెను చూచుట, 4. దీనజనుల బాధలు పరిహరించుటకు త్రికరణశుద్ధిగా ప్రయత్నించుట, 5. స్నేహితులను సోదరులవలె జూచుట, 6. గురువులను దైవసములుగ భావించుట, 7. సర్వకాల సర్వావస్థలయందును సత్యమునే పలుకుట, 8. పరుల దుఃఖమును తనదుఃఖముగ నెంచుట, 9. పరులసుఖమునే తనసుఖముగ తలంచుట, 10. సేవ చేయునపుడు సోమరితనమునకవకాశ మీయకుండుట. పైసుగుణములన్నియు గ్రంథాలయ సేవకుని కున్నచో గ్రంథాలయోద్యమము త్వరలో విశ్వవ్యాప్తమై దేశకల్యాణమునకు జ్యోతులు వెలిగించును. మానవసేవయే మాధవసేవ. సేవా స్వరూపమే భగవంతుడు. సేవాదీక్ష బొందుటయే భగవత్సాన్నిధ్యమును చేరుట గాన సేవా ఉపాసకుడే సర్వజనరక్షణకు హేతుభూతుడు కాగలడు. శ్రీకృష్ణపరమాత్మ యేమి చెప్పియున్నాడు? "కురుకర్మసఖే త్యజ కర్మఫలం" "ఫలముకోరక పనిచేయుము". మహాభక్తుడగు కులశేఖరుడు ఏమిచెప్పియున్నాడు? "మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే! మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవ త్వద్భృత్యభృత్య పరిచారక భృత్య భృత్య భృత్యస్య భృత్య ఇతి మామ్ స్మర లోకనాథ!" "ఓ సర్వేశ్వరా! నాజన్మము

నకు సాఫల్య మేమన ప్రపంచ స్వాహాపృతమైన నీ సేవకునకు సేవకునిగాను, నీ భక్తులకు భక్తునిగాను, నీ దాసానుదాసులకు దాసునిగాను అనుగ్రహింపుము.

ఇట్టి సేవాపరత కలిగినవాడే నిజమైన సేవకుడు. వాడే అహంకార మమకార శూన్యుడు. వాడే నిజమైన భాగ్యవంతుడు. వాడే సుఖజీవి. వాడే ధన్యుడు. వాడే మార్గదర్శకుడు, ఇట్టి సేవకులను కలిగియున్న దివ్యసంస్థయే ప్రపంచ కళ్యాణమును చేకూర్చగలదు.

"లోకాస్సమస్తా స్సుఖినో భవంతు"

## ౧౮. పుస్తకముల ఎన్నిక : గ్రంథాలయాధికారి

— శ్రీ పర్వతనేని గంగాధరరావు

గ్రంథాలయా లంటేనే నీరసంగా చూచే యీ రోజులలో గ్రంథాలయాధికారికి ఎలాంటి స్థానమిస్తారో చెప్పనవసరంలేదు. సంఘాభివృద్ధికి, సంఘసంక్షేమానికి గ్రంథాలయాలు ఎంతో అవసరం. ఇంటికి పునాది ఎటువంటిదో గ్రంథాలయానికి గ్రంథాలు అట్టివి. ఏ గ్రంథాలయమూ ప్రపంచంలో దొరికే పుస్తకాలన్నిటినీ సేకరించలేదు. వాటిలో కొన్నిటిని మాత్రమే సేకరించటాని కవకాశ ముంటుంది. అయితే ఆకొన్ని ఏవి? అన్నదే ప్రశ్న. అందువల్లనే గ్రంథాలయ నిర్వహణలో పుస్తకాలఎన్నిక ప్రథమ స్థానాన్ని ఆక్రమిస్తున్నది. ఈ పుస్తకాల ఎన్నిక సమస్య గ్రంథాలయాధికారికి కొరకరాని కొయ్య. ఇతరుల కిది ఏమంత కష్టమైన విషయంగా కనిపించక పోవచ్చును. పుస్తకాల ఎన్నికలో ఎలాంటి అలసత్వం చూపినా 'అధ్యయనం కొరకు పుస్తకా' లనే గ్రంథాలయ ప్రథమ సూత్రాన్నే త్రోసి పుచ్చినట్లవుతుంది.

ఈ విషయంలో గ్రంథాలయాధికారికి దుకాణదారుకు ఎంతో పోలిక, సామ్యమూ ఉన్నవి. వ్యాపారం పదికాలాల పాటు సవ్యంగా జరగటానికి, లాభాలు పొందటానికి దుకాణదారు ఎంత తాపత్రయపడతాడో, ఎలాంటి అష్టకష్టాలకు ఓర్చి శ్రమిస్తాడో అందరకూ తెలిసినదే. అంతకన్నా ఎక్కువగానే గ్రంథాలయాధికారి, తన గ్రంథాలయానికి తగిన పుస్తకాల నెన్నుకొనడానికి అష్టకష్టాలు పడుతుం

టాడు. అలాంటి ఆసక్తిలేని గ్రంథాలయాధికారి తనవిద్యుక్త ధర్మాన్ని పాటించక, జీతం డబ్బుల కొరకు కాలాన్ని వెచ్చిస్తున్న వాడవుతాడు.

గ్రంథాలయాధికారి యీ క్రింది త్రికోణపు ఆఫీసు గదిలో బంధింపబడిన ఉద్యోగి, ప్రజాసేవకుడు. దీనికి ఒక




కోణంలో ధనం రెండవకోణంలో పాఠకులు మూడవ కోణంలో పుస్తకాలు ఉంటాయి. ఈ మూడింటిలో దేని అనుగ్రహం లోపించినా, దేనిని చులకనగా తీసుకొన్నా గ్రంథాలయాధికారి స్వార్థం, పరమార్థం రెండూ దెబ్బతింటాయి. ఈ మూర్తులు మూడింటిని కూడగట్టుకొని ఒక త్రాటిమీద నడిపించటంలోనే ఉన్నది గ్రంథాలయాధికారి యోగ్యత, విశిష్టతాను. దైనందిన జీవితంలో చూస్తూనే వుంటాము. కొన్ని షాపులలో కొన్ని రకాల వస్తువులే దొరుకుతాయి. మరికొన్నింటిలో దొరకవు. అసలు కొన్ని వస్తువులు మనం వెళ్ళిన ఏ షాపులోనూ దొరకపోవచ్చు. ఇది గ్రంథాలయాల విషయంలో కూడ సంభవిస్తుంది. దానికి పై మూడు మూర్తులే కారణం. ఎంతచెట్టుకు అంతగాలి అన్నట్టు, గ్రంథాలయాన్నిబట్టి గ్రంథాలయాధికారి సాధక బాధకాలుంటాయి. డబ్బు, ప్రజలు, పుస్తకాలు ఇవి పుస్తకాల ఎన్నికవిషయంలో, గ్రంథాలయాధికారికి ఎలాంటి యిబ్బందులు కలిగిస్తాయో తెలుసుకొనే ముందు, ఇలాంటి

బాధ్యత గలిగిన గ్రంథాలయాధికారి ఎలాంటి యోగ్యతలు, అర్హతలు కలిగివుండాలో ఆలోచిద్దాం.

ఒక రాజకీయవాది ప్రజల మానసికతత్వాన్ని తెలుసుకొని, తదనుగుణంగా ప్రవర్తించి తన ఆశయాన్ని సాధించగలుగుతాడు. అది స్వార్థచింతతో కూడిన విషయం. గ్రంథాలయాధికారి ప్రజల అభిరుచులు తెలుసుకొని, వారి జ్ఞానాభివృద్ధికి తోడ్పడాలి. తన ఆశలు, ఆశయాలు, ఉద్దేశాలను నలుగురికి తెలుపవలెననుకొను రచయితకు, వాటికి తగిన చదువరులకు మధ్యనుండి, ఇద్దరినీ అర్థంచేసుకొని దగ్గరకు తీసుకొనిరాగలిగిన వాడు గ్రంథాలయాధికారి. గ్రంథాలయాధికారి నిష్పక్షపాతి, నిస్వార్థపరుడు. అందరిలో విజ్ఞానతృష్ణను రేపి ఆతృష్ణను తీర్చి, జ్ఞానాభివృద్ధిచేసి, మానవుని వివేచనాపరునిగా చేయగలబహుకొద్దిమందిలో గ్రంథాలయాధికారి ఒకడు. తాను పనిచేస్తూవున్న సమాజంలోని వ్యక్తుల స్థాయిని సమాజపు వివిధ సమావేశాలలో పాల్గొంటూ, ప్రజలతో కలిసిమెలసి వుంటూ వర్తమానానికి పనికివచ్చే పుస్తకాలు మాత్రమేగాక, భవిష్యత్తులో ఉపయోగించే పుస్తకాలుకూడ ఎన్నికచేయగల శక్తిపరుడు గ్రంథాలయాధికారి. పుస్తకాలను మనుష్యులను ప్రేమించి, అభిమానించి, సమతాభావనతో సమాజాన్ని ప్రగతిమార్గంలో నడిపించే అవకాశంకూడ గ్రంథాలయాధికారికి కలదు. డ్రూరీ అనే ప్రముఖ గ్రంథాలయ శాస్త్రవేత్త గ్రంథాలయాధికారికి ఉండవలసిన అర్హతలు, గుణగణాలను గూర్చి విపులంగా వివరించాడు.

## ధనం

మానవజీవితంలో డబ్బుకు ఎంత ప్రాముఖ్యతఉన్నదో గ్రంథాలయాల విషయంలో కూడ అంతే. పిండికొద్దీ రొట్టె

అన్న సామెత గ్రంథాలయాధికారి గమనించి తన గ్రంథాలయానికి కేటాయించబడిన మొత్తాన్ని సద్వినియోగంచేయడానికి ప్రయత్నించాలి. కావలసిన పుస్తకాలు మరల దొరుకునో లేదోనని ఎక్కువ డబ్బు ఖర్చు పెడితే, ఎందుకు అంత డబ్బు ఖర్చుపెట్టావు? ఎవరు ఖర్చుపెట్ట మన్నారు? డబ్బు ఎక్కడనుండి వస్తుంది? అని అధికారులు లేక గ్రంథాలయ పాఠకులు సతాయిస్తారు. 'ఎందుకు యిలాంటి చెత్తకొన్నారు? ఫలానా పుస్తకం ఎందుకు కొనలేదు? అని పాఠకులు గూటిస్తారు. సర్దిచెప్పబోతే, ఆవేశంతో, పుస్తకాల కెంతడబ్బు కేటాయించబడినదీ తెలుసుకోనకుండా 'అసలు నీకీఉద్యోగం ఎవడిచ్చాడు? అనటంకూడ కద్దు. ఎంత డబ్బు పుస్తకాల ఎన్నికకు, కేటాయించబడినదీ వాళ్ళకు అనవసరం. వాళ్ళకు కావలసినది, వాళ్ళు కోరుకునేది పుస్తకాలు. ఇక పుస్తకాలు చూస్తే కోకొల్లలు.

"కొనవలసినవి ఎన్నో పుస్తకాలున్నవి. అన్నీ కొనటానికి డబ్బులేదు... వీటిలో ఎన్నిక చేయడం ఎలాగా" అంటూ మానసికంగా బాధపడుతుంటాడు గ్రంథాలయాధికారి జాలిగా చూస్తూవున్న పుస్తకాలనుచూచి. ఏ గ్రంథాలయాధికారి చేతులలోను అతడు కావలెనను కొన్నంత డబ్బుండదు.

## పుస్తకాలు

ఈనాడు మనదేశం, పుస్తక ప్రచురణలో ఎంత ముందుకువెళ్ళినదో తెలుసుకుంటే 'నిజంగానా!' అని ఆశ్చర్యపడతాము. అలాగే పాఠకుల సంఖ్యకూడ పెరిగినది. మనం పాశ్చాత్యదేశాలతో సరితూగలేకపోవచ్చు. పుస్తకాలను ఆనందాన్ని కలిగించేవి, విషయాలను తెలిపి జ్ఞానబీజాలను నాటేవి, విజ్ఞానాభివృద్ధికి తోడ్పడేవి అని మూడురకాలుగా

విభజింపవచ్చును. వీటన్నిటినుండి పాఠకులకు ఉపయోగపడే, నాలుగుకాలాలపాటు పనికొచ్చే అన్నిరకాల పుస్తకాలను ఎన్నుకొని పాఠకుల మన్ననలను పొందడంలోనే గ్రంథాలయాధికారి ప్రజ్ఞ యిమిడి ఉన్నది.

కొన్నివస్తువులు ఒకసారికన్నా ఎక్కువగా ఉపయోగించటానికి పనికిరావు. అలాగే కొన్నిరకాల పుస్తకాలు కూడాను. మరొకవిషయం కలాలు తీసుకోండి. వాటిల్లో ఎన్నోరకాలున్నాయి. ఒకేరకంలోకూడ రంగులోగాని. ఆకారంలోగాని, రాయటంలోగాని తేడాలనేక ముంటాయి, అలాగే పుస్తకాలలోకూడ కొన్నిటికి అట్టగట్టిగా వుంటుంది. కొన్ని ముట్టుకుంటేచే చిరిగిపోయే దీనావస్థలో ఉంటాయి కొన్నిటి అచ్చు బాగావుంటుంది, కొన్నిటిని చూస్తూనే మనకు తెలియకుండానే ఒకరకమైన అయిష్టత కలుగుతుంది. అక్షరాల పరిమాణానికి, పాఠకులకు సంబంధంవుంది. పెద్ద టైపు అక్షరాలు చిన్నపిల్లలకు చదవటానికి వీలుగా ఉంటాయి. టైపు చిన్నదిగా వుండి, పంక్తులమధ్య, మాటల మధ్య ఖాళీలు సరిగాలేకపోతే, వాటిని చదవటానికి పాఠకులు ఇష్టపడరు. చదవాలన్నా ఎక్కువకాలం చదవటం కష్టం. వీటి మూలంగా కంటిజబ్బులు రావటంకూడ జరుగుతుంది. కొన్నిటిలో బొమ్మలు చూడముచ్చటగా వుండి పిన్నలను, పెద్దలను కూడ ఆకర్షిస్తాయి. కొన్నింటిలో బొమ్మలక్రింద పేరువ్రాస్తేగాని మనకర్థంగాదు. ఆకర్షణీయమైన బొమ్మల పుస్తకాలు వయోజనులకు, బాలబాలికలకు ఎలా ఆహ్లాదాన్ని కలిగించి జ్ఞానాభివృద్ధికి తోడ్పడతాయో వేరుగా చెప్పనవసరం లేదు. వీటినన్నింటిని పరిశీలించి, పాఠకులనుబట్టి పుస్తకాలను ఎన్నుకొనవలసిన బాధ్యత గ్రంథాలయాధికారిమీద ఉన్నది.

పుస్తకాలుగూడ గ్రంథాలయాధికారిని ఎలా మోసగిస్తాయో పరిశీలిద్దాం. ఒకే పుస్తకాన్ని వేరువేరు కాలా

లలో ప్రచురించకంవల్లగాని పలురకాల పెట్టుపెట్టటం జరుగు తూంది. దీనికి కారణం ప్రకాశకుని స్వార్థంగాని, రచయిత ఆశాపరత్వంగాని కావచ్చు. గ్రంధాలయాలలో అదివరకున్న పుస్తకాలను మరల కొనకుండా ఉండటానికి గ్రంధాలయాధి కారి చాల జాగ్రత్తగా ఉండాలి. పుస్తకాలలో మరీ మోసం కారులు తర్జుమాలు అనువాదకుడూ, ప్రచురణకర్తా ఒకరే కావచ్చు. కాని వేరువేరు పేర్లతో తర్జుమాలు వెలువడటం మనకు తెలిసిన విషయమే. ఒకే పుస్తకాన్ని వేరువేరు అను వాదకులు అనువదించినపుడు, వేరువేరు ప్రచురణకర్తలు ప్రచురించినప్పుడు ఆపుస్తకం ఎన్ని మారుపేర్లతో బైట కొస్తుందో చెప్ప నవసరంలేదు. ఉదాహరణకు శరత్ బాబు ఒకే పుస్తకం వాగ్దత్త, దత్త, విజయ, వాగ్దానం అను వేరు వేరుపేర్లతో అమ్మబడుతూవుంది. ఈ పరిస్థితులలో గ్రంధా లయాధికారి ఏమిచేయాలి? ఇన్నిపేర్లతో ఉన్న ఆ ఒకే పుస్తకం ప్రతులన్నీ కొనాలా? ఇలా చేయటం జరిగితే, తన తెలివితక్కువతనాన్ని వెల్లబుచ్చుకొనటం అలావుంచి, పాఠకు లను మోసపుచ్చుట అనిపించుకొనదా? ప్రజల డబ్బును బాధ్యతారహితంగా, దుబారాగా ఖర్చుపెట్టుట అనిపించు కొనదా?

కొన్ని పుస్తకాలు అనేక అవతారాలతో వెలువడ తాయి. అట్టపై పేరు ఒకరకమైన భావాన్ని కలిగిస్తుంది. లోపల ఇంకొకరకంగా ఉంటుంది. ఒకేపేరుతో, ఒకేపుస్తకం నాటకంగాను, నవలారూపంలోను, పద రూపంలోను ఉండ వచ్చు. కాని అట్టపై పేరు చూచికొనటం జరిగితే మోసం తప్పదు. ఉదాహరణకు శరత్ 'దేవదాసు' తీసుకొందాం. అది ప్రఖ్యాత నవలయని, మనకు తప్పకకావాలని ఎన్ను కొంటాము. చివరకు చూస్తే అది నాటక రూపంలో ఉండిఉండవచ్చు. ఒక పాఠకుడు వచ్చి అర్జంటుగా

ఆ నవల కావాలంటాడు. గ్రంథాలయాధికారి అప్రమత్తతవల్ల నాటకరూపంలో వున్నది యిస్తాడు. ఆపాఠకుడు రైలు ప్రయాణంలో తోచక ఆపుస్తకం చదవటానికి తీస్తాడు! అతడికి నాటకాలంటే అంతయిష్టముండదు. అప్పుడాపాఠకుడు ఎలాంటి పరిస్థితిలో ఉంటాడో, గ్రంథాలయాధికారిని గురించి ఏమనుకుంటాడో వేరుగా చెప్పనవసరం లేదు. కనుక గ్రంథాలయాధికారి ఇలాంటి చిక్కులన్నీ తెలుసుకొని అప్రమత్తతో మెలగకుంటే అడుసులో కాలువేయటం తప్పదు. అలాంటి అడ్డంకులన్నీ దాటి పుస్తకాలను ఎన్నిక చేయటం ఎంత క్లిష్టమైనపనో ఊహించవలసినదే.

గ్రంథాలయాధికారికి ప్రముఖ రచయితలు తెలిసిఉండాలి. ఏయే ప్రచురణకర్తలు ఏయే పుస్తకాలను ప్రచురిస్తారో, ఏయే పుస్తకాలు ఎక్కడ సరసంగా దొరుకుతాయో కూడ తెలిసివుండాలి, కొన్ని వేలపుస్తకాలనుండి కొన్ని వందల పుస్తకాలు మాత్రమే గ్రంథాలయాధికారి ఎన్నుకోవాలి. ప్రతి పుస్తకాన్ని గూర్చి, యీ చివరనుండి ఆచివరివరకూ చదివి ఆతరువాత ఎన్నుకొనటం అనేది జరగనిపని. మానవ మాత్రునికి సాధ్యంగాని పని మరి ఎన్నికకు మార్గమేది ? అందుకే గ్రంథాలయాధికారి గ్రంథసమీక్షలను చూస్తూ ఉండాలి. ఏయే పత్రికలలో గ్రంథ విమర్శనలు వచ్చేదీ, ఏయే పత్రికలు నిష్పక్షపాతంగా విమర్శనలు వ్రాయించి వాటికి ప్రాముఖ్యత యిచ్చి ప్రచురించేదీ, ఏయే విమర్శకులు నిష్పక్షపాతంగా, నిర్మాణాత్మకంగా విమర్శలు చేసేదీ, ఆ విమర్శకులయు. విమర్శనలయు స్థాయి గ్రంథాలయాధికారికి తెలిసిఉండాలి.

## పాఠకులు

రకరకాల మనస్తత్వాలతో జీవనయాత్ర సాగిస్తున్నాం మనందరం. రకరకాల వలయాల మధ్యనుండి, ఇతరులను దగ్గరకు రానీయని మనస్తత్వం గలవాళ్ళు అనేకులు. 'తాను మునిగినదే గంగ, తానువలచినదే రంభ' అనే అజ్ఞానపు అహంకారంతో నూతిలోని కప్పల్లాగ కాలం వెళ్ళబుచ్చువారు కొల్లలు. కులం, మతం, భాష పార్టీభేదాలులేక పరిమితి దాటకుండా, గ్రంథాలయాధికారి వీరినందరినీ సంతృప్తి పరచాలి. వాళ్ళవాళ్ళ మనః ప్రవృత్తిలో మార్పు తేవాలి. అప్రాణులతోకన్నా, ప్రాణులతో మసలుకోనటంలో ఎంత నేర్పు, ఓపిక ఉండాలో చెప్పనవసరంలేదు. రెండు ప్రాణులను కలపటమే కష్టమైన యీరోజులలో ప్రాణులను, అప్రాణులకు సంబంధ బాంధవ్యాల నేర్పరచటం తేలికైన పనికాదు.

వ్యాపారి తనవద్దకు వచ్చేవారి అవసరాలేమిటో, వాళ్ళకు ఎలాంటి వస్తువులుకావాలో తెలుసుకోనటం అతని వ్యాపారం నాలుగు కాలాలపాటు సాగటానికి అవసరం. గ్రంథాలయాధికారికూడ, గ్రంథాలయానికి వచ్చేది ఎవరు? వాళ్లకు ఎలాంటి అభిరుచులున్నవి? వాళ్ళు ఎంతవరకు చదువుకొన్నారు? మొదలగు విషయాలెన్నో తెలుసుకోవాలి. అలా వాళ్ళ అభిరుచులు తెలుసుకొనగలిగి, వాటికి అనుగుణంగా పుస్తకాలుకొని, వాళ్ళను సంతృప్తి పరచగలిగితే అతడు తన ధర్మాన్ని నిర్వర్తించగలిగినట్టే. అప్పుడతడు అనేకమందిని గ్రంథాలయానికి రప్పించ గలుగుతాడు. అనేకమందిలో అనేక విషయాలను తెలుసుకోవాలనే తృష్ణను కలిగించగలుగుతాడు. వ్యక్తుల అభిరుచులు వాళ్ళచుట్టూరా ఉన్న పరిస్థితులనుబట్టి, వయస్సునుబట్టి, విద్యాయోగ్యతను బట్టి స్త్రీపురుష భేదాన్నిబట్టి, వృత్తినిబట్టి మారుతూ ఉం

టాయి. ఈ అతిసున్నితమైన విషయంపైనే గ్రంథాలయాధికారి జయాపజయాలుకూడ ఆధారపడి ఉంటాయి. విద్యార్థులకు వారివారి వయస్సులనుబట్టి, వారి విద్యార్హతలనుబట్టి, వారికి పనికి వచ్చే పుస్తకాలే ఎన్నుకోవాలి. స్త్రీలను ఆకర్షించే పుస్తకాలు వేరు. పురుషులను ఆకర్షించే పుస్తకాలు వేరు. పిన్నలలోనేగాక పెద్దలలో కూడవివేచనా జ్ఞానాన్నిబట్టి, విద్యాసౌకర్యాన్నిబట్టి వాళ్ళ పుస్తకాభిరుచులు మారుతూ వుంటాయి.

స్త్రీలకన్నా పురుషులు ఎక్కువకాలం వార్తాపత్రికలు చదవటానికి వినియోగిస్తారనీ, సంసారులకన్నా బ్రహ్మచారులు ఎక్కువ పుస్తకాలు చదువుతారనీ, సంసారులలో పిల్లలుగలవారికన్నా పిల్లలులేనివారు ఎక్కువకాలం చదువుకు వినియోగిస్తారనీ, పిల్లలుగలవారిలో ఒకపిల్లడు ఉన్నవారు యిద్దరు ముగ్గురు ఉన్నవారికంటె యెక్కువకాలం పుస్తకాలను వినియోగిస్తారనీ, పల్లెవాసులకంటె పట్టణప్రజలు ఎక్కువగా పుస్తకాలూ పత్రికలూ చదువుతారనీ, చదువుకొన్నవారిబిడ్డ పాఠ్యగ్రంథాలతోపాటు యితర పుస్తకాలు చదవటానికి చదువుకోనివారి బిడ్డకన్నా ఎక్కువకాలం వినియోగిస్తాడనీ, గ్రంథాలయ సౌకర్యాలు, పుస్తకషాపుల సౌకర్యాలు ఉన్నవారు ఎక్కువగా చదవటానికి అవకాశం ఉన్నదనీ అనేక పరిశోధనలవల్ల తెలుస్తున్నది. గ్రంథాలయాధికారి యీ విషయాలన్నీ దృష్టిలోపెట్టుకొనే పుస్తకాలు ఎన్నిక చేయాలి.

“ప్రజావాణి” విషయంలో గ్రంథాలయాధికారి చాల జాగ్రత్తగా ఉండాలి. పదిమంది కోరుతున్నంతమాత్రాన ఆ పుస్తకం ఎంతో గొప్పదనిగాని, చాల మంచిదనిగాని, అత్యవసరమైనదనిగాని అనుకోనటం పొరపాటు. ఉదాహరణకు డిటెక్టివు నవలలు తీసుకొందాం. వాటిని చాలామంది చదువ

వచ్చు. ఒకసారి చదివినతరువాత వాటిస్థితిఏమిటి? వాటి 'విలువ' ఎంత? సాహిత్యరంగంలో వాటికిఎలాటిస్థానమున్నదీ, ఎంతవిలువ ఉన్నదీ తెలుసుకొంటే 'ప్రజావాణి'కి విలువ కట్టాలో అక్కర్లేదో తెలుస్తుంది. స్వర్గీయ గోపీచంద్ గారి "అసమర్థుని జీవయాత్ర" గాని, బుచ్చిబాబుగారి "చివరకు మిగిలేది" గాని చదవకపోవచ్చు. వాళ్ళలో చాలామంది కివి అర్థంగాకపోవచ్చు. కాని అలాఅని వాటిని వదలలేము. ఈనాటి తెలుగునవలా ప్రపంచంలో వాటికి ఒకస్థానమున్నది. విలువయున్నది. పదికాలాలవాటివి బ్రతుకుతాయి. అలాంటప్పుడు, ఎక్కువమంది అడిగారుగదా అని గ్రంథాలయాధికారి గ్రంథాలయానికి అన్నీ డిటెక్టివులే కొనకూడదు. పుస్తకం విలువనుబట్టితప్ప అడిగేజనాన్నిబట్టి పుస్తకాల ఎన్నిక చేయకూడదు. ఇది చాలా క్లిష్టమైన విషయం.

ఇలా అన్ని సందర్భాలను సర్దుబాటు చేసుకొంటూ, అడ్డంకులను దాటుకొంటూ, ఎవరికి ఏ పుస్తకంకావాలో, ఆపుస్తకాన్ని సకాలంలో అందజేసే వ్యక్తి గ్రంథాలయాధికారి - ఎంత నిస్స్వార్థుడో, నిష్పక్షపాతియో పలుగురితో కలసిమెలసి సంఘాభివృద్ధికి పాటుపడే ప్రజాసేవకుడో, అనేక విషయాలు తెలుసుకొన్న విద్యావంతుడో, సహకార సానుభూతులతో ప్రవర్తించిగలిగే సాహసవంతుడో ఊహించవలసినదే. గ్రంథాలయాధికారికి ఇలాంటి అర్హతలు గుణగణాలు లేకుంటే , పుస్తకాల ఎన్నిక సవ్యంగాచేయడం తనవిద్యుక్త ధర్మంగా అతడెంచకుంటేను పుస్తకాల ఎన్నిక సక్రమంగాను, శాస్త్రీయంగాను జరుగక గ్రంథాలయాదర్శం పూర్తిగా దెబ్బతింటుంది. ఈ ప్రమాదాన్నుండి గ్రంథాలయాన్ని కాపాడేందుకు పాలకులతోపాటు పాఠకులుకూడ శ్రద్ధ వహించడమెంతైనా అవసరం.

# ౧౯. గ్రంథవరణం - విధులు - నిషేధాలు

— శ్రీ జి. రాఘవేంద్రరావు

గ్రంథాలయ నిర్వహణలో గ్రంథాలయాధికారులు పరిష్కరించవలసిన సమస్యలలో గ్రంథవరణం ముఖ్యమైనది.

గ్రంథవరణం, గ్రంథాలయం యొక్క ఆర్థిక స్తోమతు మీదా, సభ్యులయొక్క విద్యాస్థాయి మీదా, గ్రంథాలయం ఉన్న గ్రామంలోని ప్రధానవృత్తులమీదా ఆధారపడి యుంటుంది.

ఆర్థికస్థితి బాగుంటే గ్రంథవరణం కొంత సులభమవుతుంది. కాని సాధారణంగా గ్రంథాలయాలకుండే రాబడి చాల పరిమితంగా ఉంటుంది. కాబట్టి ధనాన్ని అతి జాగ్రత్తగా ఖర్చుచేయవలసి ఉంటుంది అందువలన, గ్రంథవరణం కొన్ని విధి నిషేధాలకు లోబడి జరగాలి.

మన దేశంలో గ్రంథాలయోద్యమం తగినంతగా వ్యాపించలేదు. ప్రత్యేకవిషయాలకు సంబంధించిన గ్రంథాలయాలు విస్తారంగాలేవు. కావున, గ్రంథవరణం అన్నప్పుడు అది పౌరగ్రంథాలయాలకి సంబంధించినదేనని గుర్తించాలి.

గ్రంథాలు, సభ్యుల ఉపయోగం నిమిత్తమే కాని గ్రంథాలయంలో భద్రపరచటానికి కాదనే సంగతి గ్రంథవరణంలో జ్ఞాపకం ఉంచుకోవాలి. సాధారణంగా ప్రజలు ఎక్కువగా చదివే పుస్తకాలు, పత్రికలు సారస్వతానికి సంబంధించినవి అనగా నవలలు, నాటకాలు, కథలు, పద్యకావ్యాలు వగైరా. తరువాత దేశచరిత్ర, తమ వృత్తికి సంబంధించిన గ్రంథాలు, సాంఘికవిజ్ఞానం, మత గ్రంథాలు ప్రాధాన్యతలో ఒకదానివెనుక మరొకటి వస్తాయి.

ఇది కాక సభ్యులు, అనేక విషయాలపై తమకు కావలసిన సమాచారం తెలుసుకోవడానికి గ్రంథాలయానికి వస్తారు. అందువల్ల ప్రతి గ్రంథాలయంలోనూ ముఖ్యమైన ఆచూకీ గ్రంథాలన్నీ ఉండాలి. కొందరు ఆంగ్లభాష గ్రంథాల్ని అడగవచ్చు. కనుక అవికూడా కొన్ని ఉండాలి.

పై విషయాన్ని గుర్తులో ఉంచుకొని యీ క్రింది పట్టిక తయారు చేయబడింది.

| | | |
|---|---|---|
| 1. సారస్వతం | నూటికి 40 | వంతులు |
| 2. ఆచూకీ గ్రంథాలు | 20 | ,, |
| 3. దేశచరిత్రలు, రాజకీయములు | 10 | ,, |
| 4 వృత్తికి సంబంధించినవి | 10 | ,, |
| 5 సాంఘిక విజ్ఞానం | 5 | ,, |
| 6. శాస్త్ర విజ్ఞానం | 5 | ,, |
| 7. మత, వేదాంత, పౌరాణిక గ్రంథాలు | 5 | ,, |
| 8. ఆంగ్ల గ్రంథాలు | 5 | ,, |

పుస్తకాలు కొనడానికి నిర్ణయించే ధనాన్ని పై విధంగా పెచ్చిస్తే, పాఠకులకు కావలసిన గ్రంథాలు హెచ్చుతగ్గులు లేకుండా లభ్యమవుతాయని యెంచవచ్చును.

ఆచూకీ గ్రంథాల్ని కొనేటప్పుడు, అవి సాధ్యమైనంతవరకూ తాజాసమాచారం కలవిగా ఉండేటట్లు చూసుకోవాలి. పేరుగల కంపెనీలు ప్రకటించినవే కావాలి. విజ్ఞాన సర్వస్వాలు, దేశపటాల పుస్తకాలు (అట్లాసులు) నిఘంటువులు యీ తరగతిలోకి వస్తాయి.

సారస్వతానికి సంబంధించిన గ్రంథాలలో, ప్రసిద్ధులైన గ్రంథకర్తల గ్రంథాల్నే ఎన్నుకోవాలి. రైల్వే సారస్వతం వంటి చౌకబారు గ్రంథాల్ని గ్రంథాలయంలో చేర

నివ్వరాదు. రామాయణ, భారత, భాగవతాదులు; శ్రీనాథుడు, అష్టదిగ్గజాలు, తంజావూరు కవులు వ్రాసిన పద్య కావ్యాలు; వేదం వేంకటరాయశాస్త్రి, కందుకూరి వీరేశ లింగంవంటి ప్రసిద్ధుల నాటకాలు, పింగళి, కాటూరి, విశ్వనాథ, రాయప్రోలు, రామిరెడ్డి, కృష్ణశాస్త్రి, జాషువా వగయిరా నవ్యకవులు ఆధునిక కావ్యాలు; విశ్వనాథ, బాపిరాజు, మునిమాణిక్యం వగయిరాల నవలలూ, కథలూ ప్రతి పౌర గ్రంథాలయంలో ఉండితీరాలి.

చారిత్రక గ్రంథాలలో, మనదేశ చరిత్రకు సంబంధించినవి ఎక్కువగా ఉండేటట్లు చూడాలి.

రాజకీయ గ్రంథాల్ని కొనే విషయంలో గ్రంథాలయాధికారులు యీక్రింద విషయాన్ని గమనించాలి. రాజకీయాలకు సంబంధించిన సిద్ధాంత గ్రంథాలన్నింటినీ కొనవచ్చును. ప్రచారసాహిత్యానికి తావియ్యకూడదు. ప్రచార సాహిత్యం చాలావరకూ ప్రజల్ని మభ్యపరచటానికే ప్రచురింపబడుతుంది పరిమితి వనరులు గ్రంథాలయాల్లో ప్రచార గ్రంథాలకు స్థానంయిస్తే, అమాయకులైన పాఠకుల్ని మోసపుచ్చడమేగాక, ఉత్తమ గ్రంథాలకు స్థానంలేకుండా చేయడం జరుగుతుంది. గ్రంథాలయం యొక్క మనుగడ రాజకీయాలకు అతీతంగా ఉండడంపైనే ఆధారపడి ఉంటుంది. కనుక ప్రచారసాహిత్యాన్ని ఎంతమాత్రం కొనకూడదు. రాజకీయ గ్రంథాలలో ఉత్తమమైన తాత్కాలిక ప్రయోజనాలుగల పుస్తకాలు అప్పుడప్పుడు వెలువడుతుంటాయి. అటువంటివి కొనాలి. గ్రంథాలయంలో ఎన్ని ఆధునిక గ్రంథాలుంటే, అంత ప్రాముఖ్యం వస్తుంది.

ప్రతి పౌరగ్రంథాలయంలోనూ, ఆ గ్రంథాలయం ఉన్న ప్రదేశంలోని ముఖ్యవృత్తికి సంబంధించిన గ్రంథాలుండాలి. వ్యవసాయమే ముఖ్యవృత్తిగాగల ప్రదేశాల్లో వ్యవసాయ శాస్త్రానికి సంబంధించిన శాస్త్రీయగ్రంథాలుండాలి. అట్లే పారిశ్రామిక ప్రాంతాల్లో, ఆయా పరిశ్రమలకు సంబంధించిన గ్రంథాలు కొనాలి.

స్వతంత్రదేశ పౌరులైన మన ప్రజలకు గ్రంథాలయాలద్వారా సాంఘికవిజ్ఞానాన్ని బోధింపవలసిన అవసరం ఎంతైనా వున్నది. పతివ్యక్తీ ఉత్తమపౌరుడుగా మెలగడం నేర్చుకున్నరోజునసే మన స్వాతంత్ర్యం, మన స్వరాజ్యం సార్థకమవుతాయి. అందువల్ల పౌరవిజ్ఞానానికి సంబంధించిన ఉత్తమగ్రంథాల్ని గ్రంథాలయాలు సేకరించాలి.

ప్రపంచంలో శాస్త్రవిజ్ఞానం నానాటికీ విపరీతంగా వృద్ధిపొందుతోంది. ఈనాడు మనం 'అణుయుగం'లో ఉన్నాము. మానవుడు తనవిజ్ఞానంతో ప్రకృతిని జయించి తన జీవితాన్ని సౌఖ్యకరంగా చేసుకోవడానికి చేస్తున్న అద్భుతకృషిని మనపౌరులంతా గుర్తించాలి. లేనియెడల మనం శరీరవేగంతో పురోగమిస్తున్న ప్రపంచంలో వెనుకబడిపోయే ప్రమాదమున్నది. అందువల్ల పౌరగ్రంథాలయంలో శాస్త్రగ్రంథాలు ఉండాలి.

'శాస్త్ర గ్రంథాల్లో లైంగికవిజ్ఞానానికి సంబంధించిన గ్రంథాలు పౌరగ్రంథాలయాల్లో ఉండవచ్చునా?' అనే ప్రశ్న గ్రంథాలయాధికారుల్ని తరచు వేధిస్తూ వుంటుంది. మన పౌరులకు తగినంత లైంగిక విజ్ఞానం లేకపోవడమే సంఘంలో పాతుకుపోయిన అనేక దురాచారాలకి కారణమని మనం గుర్తిస్తే, అట్టి పుస్తకాలు గ్రంథాలయంలో ఉంచ

దానికి అభ్యంతరం చెప్పనక్కరలేదు. అయితే అవి హేవలాక్ ఎల్లిస్, మేరీస్టోప్స్, వాత్స్యాయన కామసూత్రాలు వంటి ప్రామాణిక గ్రంథాలై ఉండాలి.

గ్రంథాలయాధికారులు గ్రంథాలయాన్ని పవిత్రమైన విజ్ఞాననిలయంగా ఎంచి, తాము దానికి ట్రస్టీలమేగాని, యజమానులము కామని గుర్తించి గ్రంథవరణం విషయంలో నిష్పక్షపాతబుద్ధితో ప్రవర్తించాలి. తమకు హితులైన గ్రంథకర్తలయొక్క, గ్రంథవిక్రేతలయొక్క గ్రంథాలు, అవి పాఠకులకు ఉపయోగించవని తెలిసికూడా కొనడం, పెద్ద ద్రోహంగా పరిగణించాలి

పుస్తకాలు కొనేటప్పుడు గట్టి బైండు, చక్కని అచ్చు, దళసరి కాగితములమీద ముద్రణ ఉన్నవిగా చూచుకోవాలి.

గ్రంథాలయ చట్టం పూర్తిగా అమలులోకి వచ్చినప్పుడు, లేక కేంద్ర గ్రంథాలయాధికారులో, ఆ రాష్ట్రంలోని గ్రంథాలయాల్లో ఉండతగ్గ గ్రంథాలపట్టికలనుతయారు చేస్తారు కాబట్టి గ్రంథవరణం పని ముందుముందు కొంత సులభం కావచ్చు

# ౨౦. ఆచూకీ సేవ

— శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు

గ్రంథాలయ సేవకు సంబంధించిన శాఖలలో నవీనాతి నవీనము ఆచూకీసేవ. పూర్వము దీనినిగురించిన ప్రశక్తియే వుండేదికాదు. గ్రంథాలు సమకూర్చిపెట్టటం, అడిగినవారికి వాటిని ఎరువీయటం యీ రెండు కార్యాలతో గ్రంథాలయ సేవ ముగిసిపోతుండేది. కాని క్రమక్రమంగా గ్రంథాలయ శాస్త్రము అభివృద్ధి అయినకొద్దీ ఆచూకీకి సంబంధించిన వ్యవహారాలు పెరిగిపోయి యీదినము నిజముగా ఈశాఖ లేకపోతే గ్రంథాలయ సేవయేలేదనే స్థితి యేర్పడినది. చదువరికి తగిన గ్రంథమును, సకాలములో సక్రమపద్ధతిని అందజేయుటం ఈశాఖలోని పరమోద్దేశం. ఇచ్చట గ్రంథమంటే యేమో అర్థముచేసుకోతగి యున్నది. నూర్లకొలది పుటలూ, కట్టలూ, బైండింగువున్నవే గ్రంథములని భ్రమపడకూడదు. చిన్నపొత్తములు, కరపత్రములు, దిన, వార, పక్ష, మాస, త్రైమాసిక, వార్షిక ప్రచురణములు అన్నీ గ్రంథములే. చదువరికోరే విషయము ఇందులో ఎక్కడ దొరకునో ఆచూకీ పట్టి అతనికి అందచేయటంలో మహోత్తమమైన సేవ గ్రంథాలయ నిర్వాహకునికి లభించుతున్నదనటం గుర్తింపదగును. ఈసేవకు సంబంధించి క్రిందచెప్పబోయే ఉపశాఖలు గ్రంథాలయశాస్త్ర వివరణములో అంగీకృతములై యున్నవి. అన్ని గ్రంథాలయాలకూ, ఈ అన్ని ఉపశాఖలలోనూ ప్రమేయం వుంటుందని యెవరూ భ్రమపడకూడదు. ఆయా సందర్భానుసారంగా ప్రతి గ్రంథాలయమున్నూ తనకు అన్వయించే ఉపశాఖల కార్యక్రమాన్ని అమలులో పెట్టుకోవలెను. చాల గొప్ప గ్రంథాలయాలలో అనుభవాలు పొందినవారు సవిమ

ర్నగా ఆలోచించి యీ ఉపశాఖలక్రింద విషయ వివరణము చేసినారనటం గమనించదగును.

## తాత్కాలిక గ్రంధశ్రేణి నిర్మాణము

వేలకొలది గ్రంధములుండి నూర్లకొలది చదువరులు వచ్చే గ్రంథాలయాలలో చదువుకోటానికి గ్రంధములు తీసుకొనినవారు ఒక్కరు ఐదుసమిషాలలో, యింకొకరు ఒక గంటలో, మరియొకరు రెండుగంటలలో యిట్లా పుస్తకాలు చదివి చదివినచోట వదలిపోతారు. వాటిని అప్పటికప్పుడు ఒక నౌకరు తెచ్చి కుప్పగా పెట్టిపోతాడు. వాటిని వెంటనే వర్గీకరించి తాత్కాలికంగా శ్రేణి ఏర్పరిస్తే ఆపుస్తకాలే, ఆదినమే, ఆగంటలోనే అడిగే చదువరులకు అందివ్వటం సులభమవుతుంది. వారే వచ్చి యేర్పడిన శ్రేణిలోనుంచి తీసుకొని చదువుకోటం సులభతరమవుతుంది. కాబట్టి ఈచిన్న ఆటాకీ కార్యము యెంతో ప్రయోజనకారి అవుతుంది.

## చదువరులకు తోవవేసి యిచ్చుట

గ్రంధాలయములోనికి వచ్చే చదువరికి ఏవిషయమును గురించిన పుస్తకాలు ఎక్కడవున్నవో తెలియుట కష్టము. అంతేకాక, అతనిమనస్సులో యేసంగతి తెలిసికొనవలెనని వచ్చినాడో ఆసంగతి కచ్చితంగా తెలుసుకోవటం అందరికీ సాధ్యంకాదు. అనుభవములేని చదువరిని గ్రంధాలయంలో అట్టే వదలిపెట్టితే అతనికి కాలహరణము అయ్యేది ఒకటే కాక, గ్రంథాలనుకూడా తనకు తెలియక తారుమారు చేయటంచేత గ్రంథాలయనిర్వాహకునికి యెడతెగని కష్టము కలుగవచ్చును. కాబట్టి చదువరి క్రొత్తవాడు కనిపిస్తే, ఆచూకీశాఖలో ఉద్యోగి అతనికితగిన సహాయం చేయడానికి సిద్ధపడవలెను. కొందరు చదువరులు విచిత్రప్రకృతి కలవారుం

టారు. ఇట్టిసహాయం కోరడం అంటే వారికి మర్యాదలోపంగా కూడా కనిపిస్తుంది. అందుచేత వారిని గ్రంథాలయోద్యోగి చాలాజాగ్రత్తగా కనిపెట్టి అట్టివారి విశ్వాసాన్ని సంపాదించే విధంగా ప్రవర్తించవలసి యుంటుంది. వారు కోరేది ఏమిటో కనుక్కొని, వారిని పుస్తకాలదగ్గరకు తీసుకొని వెళ్ళుతూ వారి మనస్తత్వం కనిపెట్టి సలహాలుచేస్తూ తోడ్పడవలెను.

## జాగ్రత్త

పుస్తకా లుపయోగించే చదువరులలో అందరూ నిష్కల్మష ప్రవర్తనులై వుండరు. కొందరు గ్రంథములోని బొమ్మలూ, కొన్నికొన్ని భాగాలు సంగ్రహించే ప్రయత్నం కూడా చేసేవారుంటారు. చిన్నచిన్న పుస్తకాలైతే తస్కరం కూడా చేస్తారు. ఇట్టివారిని జాగ్రత్తగా చూచుకోవటం ఆచూకీ కార్యక్రమంలో ఒకభాగం. అంటే గ్రంథసామగ్రి యెల్లరకూ వినియోగపడటానికి విఘాతము కలుగజేసే అన్ని ఘట్టాలనూ పీరు కనిపెట్టి వుండవలెనన్నమాట.

ఈపైనచెప్పిన మూడువిషయాలూ స్వేచ్ఛోపలబ్ధి పద్ధతిమీద నడచే పెద్దపెద్ద గ్రంథాలయాలకు చాలాబాగా అన్వయమగును.

## తక్షణ ఆచూకీ

కొందరు చదువరులు కోరే విషయాలకు అక్కడనే, యెదుటనే జవాబిచ్చుటకు అవకాశం వుంటుంది. ఏనిఘంటు వునో, ఏవిజ్ఞాన సర్వస్వమునో, ఏ గజెటేరునో, మరియేయితర మైన పుస్తకసామగ్రినో వెంటనే చూచుకొండని తమ గ్రంథాలయంలో వున్నంతవరకు చూపించడం ఈకార్యక్రమంలో చేరును. నిఘంటువులు, విజ్ఞానసర్వస్వాలు, వార్షికసంచికలు ఇట్టివాటిలో దొరికే భోగట్టా ఈబాపతులో చేరును.

# దీక్షకాలపు అచూకీ

కొన్ని విషయాలలో కొంతకాలము పరిశ్రమచేస్తేనే గాని గ్రంథాలయోద్యోగి చదువరికి కావలసిన సహాయమును చేయలేడు. కొన్ని సందర్భములలో యిట్టి సహాయముచేయుటకు నెలలూ, ఏండ్లూ పట్టవచ్చును. దీనికి కారణము మరి యేమీ కాదు. తనవద్ద విషయ వివరణకు తగిన పరికరాలు లేనప్పుడూ, ఇతడు పరిశోధనకు పూనుకొనవలసి వచ్చును. అకారాదిసూచీలు, గ్రంథముల పట్టికలు వగైరాల పర్యావలోకనము మాత్రమేకాక, తనదేశంలోని గ్రంథాలయాలతోను, విదేశాలలోని గ్రంథాలయాలతోను ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపవలసిన అవశ్యకముకూడా కలుగవచ్చును. అంటే గ్రంథాలయసేవ నేటిదినము ప్రపంచ విస్తృతమై యున్నదని గుర్తించి, ఆ యభివృద్ధి ప్రయోజనాన్ని తనదగ్గరకుచేరినచదువరికి అందజేయుటకు యీ యుద్యోగి ప్రయత్నించవలసి యుంటుందన్నమాట. ఈసేవను నేను ప్రత్యేకప్రతిభతో కూడినసేవగా పరిగణించుచున్నాను. గ్రంథాలయ నిర్వాహకులు తమ గ్రంథాలయములో పుస్తకసంఖ్య కొద్దియని, తమకు ఉపపత్తిలేదని, ఆధారములేదని వాపోవుచుండటం మనకు విశదమే. ఇట్టివారు యీ దీక్షాకాలపు ఆచూకీ విధానంలో ఉండే రహస్యాన్ని గ్రహించలేదన్నమాట

తమవూళ్ళలో వుండే స్వల్పసంఖ్యాక గ్రంథాలయాలతో స్నేహసంబంధములు పెట్టుకొని, వారి పుస్తకముల జాబితాలు నకళ్ళుచేసి వశము నందుంచుకొని, తమవద్ద లేని సామగ్రిని తమగ్రామంలోని యితర గ్రంథాలయాలనుండి తెప్పించి యిచ్చేసేవ ఈ విధానంలో మొదటిమెట్టు. తమ ప్రాంతంలోని కేంద్రగ్రంథాలయమేదో తెలుసుకొని, అక్కడి సామగ్రి స్వభావమునెరిగి, ఆగ్రంథాలయ పుస్తకముల జాబి

తాను సేకరించి, అక్కడనుంచి చదువరికి కావలసిన సామగ్రిని తెప్పించియిచ్చుట తరువాతిమెట్టు. అచ్చట కూడా దొరకని పుస్తకములనుగురించి యెంతదూరమైన గ్రంథాలయానికైనా (ఉదాహరణార్థము అమెరికాలోని విశ్వవిద్యాలయ గ్రంథాలయాలకు) ఉత్తరప్రత్యుత్తరాలు జరిపించి ఫోటోస్టాట్లు సంపాదించటం అన్నిటికంటే పైమెట్టు.

పరంపరంగా యేర్పడునట్టి యిట్టి సంబంధ బాంధవ్యము నేడు గ్రంథాలయసేవలో మహోపకారముగా యేర్పడుతున్నది. గ్రంథాలయోద్యోగి ఈసంగతి తెలిసికొన్నమాత్రమున చాలదు. ఎల్లప్పుడూ ఈవివరాలను గురించి చదువుట, ఆలోచించుట గ్రంథాలయోద్యోగి ధర్మం. తన గ్రంథాలయంలో ఉద్యోగపీఠమువద్ద కూర్చున్నప్పుడు వేరేపని చేయకుండావుండే ప్రతినిమిషమును వ్యర్థపుచ్చక గ్రంథముల జాబితాను అవలోకించుచు పూర్ణపరిచయము సంపాదించవలెను. అంతేకాక, తన గ్రంథాలయంలో వుండే అన్నిగ్రంథముల పరిచయమును చేసుకొనవలెను. ఈవిధమైన పరిశ్రమచేసినప్పుడే తాను చదువరికాలమును వృథ పుచ్చక, వెతుకుటలో తనకాలమును వృథాచేసుకొనక చదువరి ప్రశ్నించగానే ఆప్రశ్నకు సమాధానము చెప్పగల తరిబీతును పొందగలడు. ఈవిధమైన తరిబీతును పొందుటను గ్రంథాలయ శాస్త్రమున ప్రత్యేక ధర్మముగా పరిగణించుచున్నారు.

ఇంతేకాదు, తాను ఈపరిశ్రమ చేసేటప్పుడు ఏదైన క్రొత్తవిషయము స్ఫురిస్తే దానిని ఒకచీటీమీద వ్రాసియుంచటం, యిటువంటి చీటీలు పేరకుండా ఎప్పటికప్పుడు వీటిని విషయాన్నిబట్టి వర్గీకరించి పెట్టుకోవటం, వీటికి వర్గీకరణపు కార్డులు వేరుగా వ్రాసియుంచడం చేసుకొనుచూ రావ

లెను. వీటిని గ్రంథాలయపు వర్గీకరణపు పెట్టెలలో చేర్చ వలెను. కొన్ని మాసముల కొకపర్యాయము పెట్టెలోని కార్డు లన్నిటినీ పునర్వ్యమర్శించుకొంటూ యుండవలెను. అందులో తీసివేయవలసినవి యుంటే తీసివేస్తూ యుండవలెను.

ఈవిధానము కార్డుల ఇండెక్సింగు యేర్పడియుండే చోట అన్వయమవుతుంది. అటువంటిది కాక కేటలాగు పుస్తకరూపంగా ఉంచిన చోట వ్రాసుకొన్న చీటీలను విష యానుగుణంగా వేరేవేరే ఫైలుపుస్తకాలల్లో అతికించడమో, లేక వేరేపుస్తకాలల్లో నకలు వ్రాయడమో జరుపుకోవచ్చును. ఈ పుస్తకాలనుబట్టి కేటలాగులోకూడ వీలున్న మార్పులను చేసికొనవచ్చును.

ఎట్లైనా గ్రంథాలయోద్యోగి నిరంతరము విషయ విజ్ఞానము సంపాదించడానికి పాటుపడుతూ యుండవలెనని అనడం, చదువరులతో సన్నిహిత సంబంధము పెట్టుకొని వారికి విశ్వాసపాత్రుడు కావడం, అవసరమైన సందర్భాలలో దగ్గరదూరపు గ్రంథాలయాలతో ఉత్తర ప్రత్యుత్తరాలుకూడ జరపడం ఆచూకీసేవా విధానములో ప్రధానసూత్రము.

# గ్రంథాలయం సాహిత్యం

1. గ్రంథాలయ సర్వస్వము . కళాప్రపూర్ణ
అభినందన సంచిక

2. డిటో : 34 వ ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయమహాసభ సంచిక

3-5 గ్రంథాలయ ప్రగతి : 3 భాగములు

6. 28 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ సంచిక

7. సంక్షిప్త ప్రాచ్యవర్గీకరణ పద్ధతి [అనువాదం]
హిందీమూలం : సతీశ్‌చంద్రగుహ
తెలుగుసేత ; అపిరేడ్డి లక్ష్మీనారాయణ,
పాతూరి నాగభూషణ

8. గ్రంథాలయములు (వ్యాసావళి) 2 వ భాగము

9. డిటో 3 వ భాగము (అనువాదములు)

10. డిటో 4 వ భాగము (సంకలనము)

11. డిటో 5 వ భాగము
రచన : కాట్రగడ్డ శారద

12. గ్రంథాలయ నిర్వహణము (2వ కూర్పు)

13. వాఙ్మయ సూచీకరణము [డిటో]

14. గ్రంథాలయాలు : ఆచూకీసేవ [డిటో]

15. గ్రంథవరణం

16. గ్రంథాలయశాస్త్ర ప్రథమపాఠములు (2వ కూర్పు)

17. పఠనమందిరాలు (డిటో)

# సాధనగ్రంథమండలి యితర ప్రచురణలు

సర్వోత్తమ ప్రచురణలు :

1. భర్తృహరి నీతిశతకము
2. " శృంగార శతకము
3. " వైరాగ్య శతకము

ప్రతిదానిలోను సంస్కృత శ్లోకములు, ఏనుగు లక్ష్మణకవి తెలుగు పద్యములు, ఈ పద్యములకు టీక, తాత్పర్యం, వ్యాఖ్య. పద్యములకు అకారాది సూచి: నీతిశత ములో వ్యాకరణాంశములు ఉన్నవి.

అనువాదములు :

4. దివ్యజీవన దృశ్యములు
5. తపోవనంలో ప్రేమయోగి
6. భారత యువజనులారా లెండు!
7. యువకులకు సందేశం — సాధు టి.ఎల్. వాస్వాని
8. మహనీయుల పుణ్యస్మృతులు (నీతిబోధక కథలు, గాథలు)
9. దాదాజీతో కొన్ని మధురక్షణాలు — జె. పి. వాస్వాని
10. సాధుపుంగవులు
11. జ్ఞానబోధక గాథలు
12. బా - బాపు (2వ కూర్పు) : ముకుల్ భాయ్ కలార్థి
    ఆదర్శదంపతులగు బా, బాపుల పవిత్ర వైవాహిక జీవితగాథలు